చం॥ కరచరణాది సంఘటితకాయము సంజననంబు వహ్నిపు।
ట్టరణిని బోలెఁదల్లిదెస నైనది గాదొకో! యుల్బకారక దు।
ర్భరమగు గర్భభేదమునఁ బట్టికి నైన నిజదేహచింతపై।
భరమొకయింత లేక పడుపాటులు తల్లికి నెక్కుడెంతయున్.

—భారతము.



# గృహలక్ష్మి

## దేశముక్తి

" సహాయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా
పురోవాచ ప్రజాపతిః।
అనేనప్రసవిష్యధ్వ మేష వో స్త్విష్టకామధుక్।
దేవాన్ భావయతానేన- తేదేవా భావయన్తువః।
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ॥
ఇష్టాన్ భోగాన్ హివో దేవాదాస్యంతే యజ్ఞ
భావితాః
తైర్దత్తా నప్రదాయైభ్యో యోభుంక్తే స్తేనయేవసః॥ "

గీత: 3.

అని కర్మయోగమున భగవానుని నుడి. ఇచట యజ్ఞశబ్దమునకు వృత్తియని యర్థము. "ఓ భారతీయుడా, మున్ను సృష్ట్యాదిని బ్రహ్మ ప్రజలను బుట్టించి యా వెనువెంటనే వారి పురోభివృద్ధి కత్యావసరములగు వృత్తులను గల్పించి, 'యో బిడ్డలారా, ఈ వృత్తులను బూని వాటి యధిదేవతలను బూజించి మీ మీ కోర్కెల గొనసాగించుకొనుఁడు. మీ శ్రద్ధాభక్తులవలన బరితుష్టి నొందిన యా వృత్త్యధిదేవతలు మీ యిష్టభోగముల నొసగుదురు; ఆయా భోగములు తత్తద్దేవతార్పణసేసి మీ రనుభవించుట లెస్స; అటులఁ జేయరేని యది యొక దొంగతనము సుమండీ" యని వారల కుపదేశించెను. కాబట్టి కులవృత్తులఁగూల్పక నీవు క్షత్రియోచితమగు యుద్ధము జేయుట లెస్స" యని యా యోగీశ్వరుడు శిష్యునకు బోధించెను.

ఈ బోధనల శిరసావహించి ప్రజలు, తమతమ స్వకులోచితవృత్తులను బూజించి, యవలంబించుచున్నంత కాలము, భరత వర్షము, భూదేవికి శిరోరత్నమైయుండెను. కేవల స్వార్థపరులవలన నా పద్ధతి వినువఁబడిన మరునాటినుండియు గ్రమక్రమముగ నా శిరోరత్నము జారిజారి తుదకు బాతా.

శము పట్టినది. తల్లుల మెడలో మంగళ సూత్రములైన నమ్మి బి.యే. బి.యే. బి.యల్. మొదలగు పెద్ద పెద్ద పరీక్షల నిచ్చియున్న బాబులు, భద్రలోగులు "రిక్షా లాగుచున్నారు, కాఫీహోటల్లు పెట్టుచున్నారు............". మూడు వేల రూపాయలు పోలేపోయినాయిగాని కోర్టుపద్ధతులు మాత్రం మహాబాగా తెలిసినవన్నట్లీ యువకులు 'డిగ్నిటీ ఆఫ్ లేబరు'ను బాగుగా గ్రహించితిమని చెప్పుచున్నారు. నిజమే కావచ్చును. కాని, "కండ్లు పోయిన తరువాత సూర్యనమస్కారముల" కేమి యర్థమో, సర్వనాశనమైన వెనుక సంపాదించిన యీ దివ్యజ్ఞానమునకును అంతయే అర్థము. సర్కసులో హాస్యగాడు, ప్రమాదవశమునఁ గాలుజారిపడినప్పుడు ఆపాటుకూడ నొక 'కొత్తఫీటు' యను కొంత లోకసామాన్యమైన విషయము. అట్లే యీ "విద్యాధికులు" చెప్పెడి యీ విషయము కూడ, మిక్కిలి అపూర్వముగా దోచవచ్చును; కాయకష్టముపడి జీవించుటయందు గల గౌరవానందములను వీరీనాడు క్రొత్తగాఁ జెప్ప నవసరములేదు. అవి, సృష్ట్యాదినే బ్రహ్మదేవునిచేఁ జెప్పఁబడియున్నవి. వృత్తులన్నియు నుచ్ఛదశయందుండుటయే దేశమున కుచ్ఛదశ. ఎట్టి విద్వాంసులైనను తమ కులవిద్యలను వృత్తులను విడువకుండిరి. మహాజ్ఞానియగు ధర్మవ్యాధుడు తా నవలంబించియున్న వృత్తిని విడుచుట కేమాత్రము నిష్టపడలేదు. రాజశాసన మట్టిది. ఆతడు దానిని గౌరవించెను.

ఆర్యభూమి యిప్పట్టున దాస్యవిముక్తయై సుఖంపడవలయునన్నయెడల నొక్కటియే దారి—ఎవని వృత్తి వాడు భక్తితోఁ బ్రీతితో నారాధింపఁబూనుట!! ఈ యథార్థమే ఈ కష్టకాలమున మహాత్ముఁడు, మనకుఁ దెలుపుచున్నాడు. అన్నము ప్రాణరక్ష వస్త్రము మానరక్ష కాబట్టి యీ రెంటికై మన మన్యులపై నాధారపడినయెడల నిక మన తనువులు వ్యర్థములు. సోదరీమణు లీ యభిప్రాయమును దమ బిడ్డల కుగ్గుపాలతోఁ బెట్టవలయును. మరియును దైవవశమున నాంగ్లేయము ప్రపంచభాషయైనది, కాబట్టి, దానిని, సామాన్యముగా వ్రాయను జదువను శక్తి కుదురుటకు, స్కూలుఫైనలువరకుఁ జదివించుచు యథోచితవృత్తులయందు బాలబాలికలను బాల్యమునుండియే ప్రవేశింపఁజేయుట సర్వశ్రేయస్కరము.

ఇది యెల్లమాని, పుస్తెయు బూసయు నమ్మి పెదపెద్ద చదువులు చదివింతుమని యాలోచించుటవలనఁ బ్రయోజనములేదు. తుదకు 'రిక్షా'యో అది కానపుడు "భిక్షా"యో చేతికి వచ్చిన తరువాత విచారించుకొంటకంటె ముందే మేల్కొనుట మంచిది కదా !!

# కన్నీరు

(శ్రీ పిఠాపురము మహారాజ్ఞీమణి స్మృతి)

దామెర రాజగోపాలరావుగారు

జీవితేశ్వరు, సుతుల, ఆశ్రితుల, హితుల,
తల్లిదండ్రుల, సఖుల, సోదరుల, ఎడల;
వగల కారుచిచ్చుసెగల రగులుకొలిపి,
వెడలిపోతి రీలోకమ్ము విడచిమీరు!

తావకీన వియోగ వేదన సహింప
లేక, కుములి, కుములి, సోలి, రేలు పవలు,
బాష్పములు రాల్చుచున్నవి, వగలపొగిలి;
తమరు ప్రేమతోఁ బెంచిన తరులవిరులు!

నందనారామమందార నవలతాంత
మాలికాడోలికలకూర్చి మందిరముల;
పుణ్యయువతులు మిమ్ము కొంపోవతలచి,
వేచియున్నారు వైకుంఠవీథులందు!

# మైత్రేయి

తటవర్తి సూర్యనారాయణమూర్తిగారు

యాజ్ఞవల్క్యునికి మైత్రేయి కాత్యాయని యను వారిద్దరుభార్యలుగలరు. మైత్రేయి మిత్రుడను పేరుగల మహామునికి పుత్రికయై బ్రహ్మవాదినియైన గార్గికి మేనగోడలైయుండెను. ఆమె, తండ్రికడనే బ్రహ్మవిద్యాజ్ఞానమలవరచుకొనియుండెను. అందుపై మేనయత్త స్నేహముచే నాజ్ఞానము మరియు వృద్ధినొందెను. ఈమెచిత్త మంతర్ముఖియైన దగుటచే వెలుపలి ప్రియాప్రియవస్తువులవలన దుఃఖముగాని సుఖముగాని యామెకు ప్రాప్తించియుండలేదు. బాల్యకాలమునందే ముఖముపై గంభీరత్వము వ్యాపించియుండెను. బాహ్యమోదప్రమోదములందుగాని వినోదములయందుగాని యామెకు కొంచెమైన నిష్టములేకుండెను. ఉన్నతాలోచనలయందు జింతనలయందే యామె యధికాంశముగ సమయమును వ్యతీతమొనర్చుచుండెడిది. జనకునిగృహమందు తనవంతులోగల యింటిపనుల జేయుచుండెడిదిగాని దీనియందామె కాసక్తి యెక్కువగ లేకుండెను. ఇట్టి విదుషీరత్నము యాజ్ఞవల్క్యునివంటి మహామునిని పెండ్లియాడి యాతనికి యోగ్యసహధర్మిణియై, ముఖ్యముగ ప్రియతమురాలై విరాజిల్లినదనిన నింకాశ్చర్యమేమి కలదు? పరస్పరము కాలక్షేపము సుఖమయముగ జరుగుచుండెను. కాత్యాయనీ మైత్రేయిలొండొరులు సవతులైనను వారిద్దరియందు నెట్టిక్లేశముగాని ద్వేషముగాని గలుగుటలేదు. కాత్యాయని గృహకృత్యములయందు సమర్థురాలనియెరింగి మైత్రేయి యామెవలన నన్నియు నేర్చుకొనుచుండెడిది. కాత్యాయనిగూడ నిట్లే మైత్రేయితో శాస్త్రచర్చ చేయుచు నిత్య మేదోయొక నూతనవిషయము తెలిసికొనుచుండెడిది. ఈరీతిగ అనేకవత్సరములు గడచెను.

ప్రాచీనకాలమం దార్యులు మృత్యుపర్యంతము గృహస్థాశ్రమపు జంజాటములందు పడియుండెడివారుకారు. ఇందుచే గృహస్థాశ్రమ సమయము గడచినపిదప యాజ్ఞవల్క్యముని వానప్రస్థు డగుటకు తలంచెను. తనభార్య లిద్దఱికడ నీయభిప్రాయము సూచించి— నేను చాలినంతకాలమువరకు మీయిద్దరితోడ గృహస్థాశ్రమమునందలి సుఖమనుభవించితిని. కాని యిప్పుడు నేను సంబంధముల నన్నిటిని వదలుకొని పరివ్రాజకుడ నవదలచుచుంటిని గాన నాకున్న సంపత్తిని నాయెదుటనే మీయిద్దరకు పరిసమానముగ పంచిపెట్టదలచుచుంటిని. లేనిచో దీనికొరకు అనంతరమున మీయిద్దరిలో కలతబయలుదేరి ఈర్ష్యలు బయలుదేరగలవు—అని పలికెను. దీనిపై విదుషీరత్నమొసంగిన యుక్తియుక్తసుందరోత్తరము నేటి దార్శనిక సభ్య జగత్తునకుగూడ తలవంపులు గలుగజేయుచున్నది. భర్తృప్రశ్నకు జవాబురూపముగా మైత్రేయి యిట్లుపలికెను—"ప్రభూ! మీ రీసంపత్తిని పంచుకొనడము విషయములో సెలవిచ్చితిరి. అదిసరియే. దానిని స్వీకరించి నేనేమి చేసికొందునో చెప్పుడు. ఇదియొక సాధారణధనము. ఒకవేళ సమస్తధరణీరాజ్యముగూడ నాకు లభించిన దానితో నాకుగలుగు లాభమేమి? ఈ సంపత్తులవలన నాకమరపదము ప్రాప్తించునాయేమి?"

యాజ్ఞవల్క్యుడు పత్నివేసిన యీప్రశ్నకు సంతుష్టుడైపలికెను—"లేదు. అమరత్వము దీనివలన లభ్యము గాజాలదు. దీనివలన నీవు నానావిధములగు పదార్థములను ప్రోగుచేసికొని కష్టమేమియు గలుగకుండ సుఖముగనుండగలవు. ధనవంతు లెట్లు ధనముచే సుఖస్వాతంత్ర్యజీవనమును గడుపుకొనుచుందురో యట్లే నీవును గడుపుకొన గలుగుదువుగాని నీవు చెప్పినట్లమరత్వప్రాప్తి ధనవైభవములచే గాజాలదు" ఇదివిని మైత్రేయి ఖిన్నమనస్కురాలై—"నాథా అట్టి సమయమున నే నీధనము, సంపత్తును, సుఖభోగములను గైకొని యేమిచేసికొందును? అమరత్వమును గూర్పజాలని, ధనమును బొంద నేనెట్లుగోరుదును? స్వామీ! తా మేవిషయమందు జ్ఞానమును బొందియుంటిరో ఏ బ్రహ్మజ్ఞానరూపమైన యమూల్యధనమును మీసంపత్తిగ జేసికొంటిరో దానిని ఆబ్రహ్మవిద్యోపదేశమును నాకొనర్చి నన్ను కృతార్థురాలినిగ

చేయుదు. ఇంక మీ సాంగత్యలాభము నాకు కలుగజాలదు. మీవద్ద నేయుండి బ్రహ్మజ్ఞానశిక్షను బొందుటకుగూడ సమయములభింపదు. ఎందుకన తాము వానప్రస్థులగుచో తమకు నేనందు బాధగూర్చజాలను. కాని తమరు తమసంపత్తి నంతయు మాఅక్కయగు కాత్యాయనికే యొసంగుడు. అమరత్వ ప్రాప్తికుపాయరూపమైన యీబ్రహ్మజ్ఞానమునకు తా మధిపతులో ఆ బ్రహ్మజ్ఞానమును నాకు దయచేసి నామనుష్యజన్మమును సఫలపరుప వినయముగ ప్రార్థించుచున్నాను" అనెను.

మైత్రేయి ధనసంపత్తుల లక్ష్యముజేయక దానిని తిరస్కరించుచుండుటయు, వైభవభోగవిలాసములలో భ్రమించు నామె చిత్తముజేరకుండుటయుగాంచి మహర్షి కపారహర్ష ముత్పన్నమయ్యెను. అధికప్రసన్నత్వముతో—"మైత్రేయీ! అసలే నీవునా కత్యంతప్రియతమవు. అందుపైన నేటి నీమాటలచే నాకింకను సంతోషమయ్యెను. ఇప్పుడు నీవు నాకధిక ప్రేమాస్పదవైతివి. రమ్ము, నావద్ద కూర్చుండుము. నేను నీకమృతప్రాప్తి కుపదేశ మిచ్చుచుంటిని ధ్యానముతో వినుముగాక" అని యిట్లు చెప్పదొడగెను.

"—చూడు. పతి యే స్త్రీకిష్టుడగుచున్నాడో తనపతి యుద్దేశ్యము సిద్ధించుటకు గాక ఆత్మప్రయోజనముకొరకే ఆపత్నికి పతి ప్రియుడగును. ఈవిధముగనే పుత్రధన కన్యా రత్నాది సమస్తప్రాపంచిక పదార్థములు ఆత్మప్రయోజనమునలననే జనులకు ప్రియములగుచున్నవి. ఈ పదార్థములన్నియు మన ప్రేమను సంపాదించుకొనుచున్నవి. కనుకనే మనకును ఇష్టములగుచున్నవి. లేకపోయినయెడల స్వతంత్రరీతితో ఆవస్తువుకొరకే ఏవస్తువు ప్రియమగుచుండుటలేదు. కాజాలదు. ఎందుకన మనుష్యుల ప్రేమకు ప్రధానకారణమాత్మయే. ఇతర పదార్థములన్నియు గుణరూపముగ ప్రేమవస్తువులు. ఈతత్వమును— "జగత్తునందలి అన్నిటికంటె నధికముగ ప్రేమపదార్థమాత్మయే. అదియే స్నేహప్రియములసామగ్రి" అను దానిని జ్ఞాపకముంచుకొనుము. ప్రపంచమందు భిన్న భిన్న విషయములందు గాన్పించు ప్రేమ, స్నేహము ఆసక్తులు అన్నియు ఈమహాప్రేమకే యంతర్గతములు. ప్రపంచకమందుగల ప్రేమలన్నియు నీపరమ ప్రాప్తికొరకైయే యున్నవి. పితృభక్తి, పత్నిప్రేమము, సంతానస్నేహము, బంధుప్రేమ, ధనాదులయందాసక్తి ఇత్యాదు లెన్ని ప్రేమసామగ్రులు కన్పడుచున్నవో ఆప్రేమలన్నిటియొక్క ఏకమాత్రలక్ష్య మాపరమ ప్రేమను పొందగలుగుటయే. జగత్తునందలి ప్రేమలు వికారములు, క్షుద్రములు, కాని యీమహాప్రేమ యఖండము, నిత్యము, విస్తృతము. ఈ చిన్నిచిన్ని ప్రేమలన్నియు ఈ మహాప్రేమాంశికకణములు. ప్రేమకు తన చిన్నశరీరము ప్రారంభించి ఉత్తరోత్తరము అధికాధికముగ ఉచ్చపదార్థము వైపునకు జనుచుండవలయును. మరల ఆత్మప్రేమను బుత్రాదికుల ప్రేమయందు, కౌటుంబిక ప్రేమను బాహ్యసంబంధ ప్రేమయందు బాహ్యకప్రేమను అన్యజాతుల అన్యదేశీయుల ప్రేమయందును పెంచుచు ఈక్రమముగనే అంతమందీప్రేమను సమస్తమానవ—సమాజ—మనుష్యమాత్రునివరకు చేర్చవలయును. ఈ ప్రకారముగనగుప్రసార మంతమున విశ్వప్రేమ రూపమును బట్టుకొనును. దీనియంతిమ పరిణామము బ్రహ్మప్రేమయగును. కనుకనే యీ చిన్నిచిన్ని ప్రేమల ఈ ఒక యఖండ విశాల ప్రేమసాగరముకంటె స్వతంత్రసత్త మరి వేరేమియులేదు. చిరస్థాయియగు నిత్యప్రేమ అఖండమగు నీశ్వరప్రేమయే. ఇతర ప్రేమల ప్రకాశవికాసము లీప్రేమకొరకే కనుక మహాప్రేమయొక్క యీ సముద్రమును అనగా పరమాత్మను దర్శించవలయు. ఆచార్యుల—ఉపనిషత్తుల వాక్యముల ద్వారా దానిని ప్రతిమారు వినవలెను. తదనంతరమున తర్క, యుక్తి, మనోబలములతో ఈమహాతత్వమును హృదయమున ధరించవలయును. ఈవిధముగ సతతము ధ్యానయోగములచేతనే సునిశ్చితమైన ఆత్మను హృదయమందుంచుకొనవలయును. ఈవిధముగ శ్రవణము, మననము, నిదిధ్యాసము చేయుచుండుటలో ఆత్మ ఏకతయు సత్యత్వము తెలియగలదు.

"ఎప్పుడు ఆత్మతత్త్వజ్ఞానము పూర్తిగ గలుగునో అప్పుడు ప్రాపంచిక వస్తువుల వేటిని నెరుగ కోరిక గలుగదు. ఎందుకన విశ్వమండలి సమస్త పదార్థముల కాధారము పరమాత్మయే. దానిని వదులుటతోడనే జగత్తునందలి ఏ పదార్థముమీదను ఏ సత్తాయును ఉండదు. ఏ బ్రాహ్మణుడు బ్రాహ్మణజాతిని ఆత్మకంటె వేరుగ తలచునో వానిని బ్రాహ్మణజాతి ఇతడు నన్ను నాత్మరూపముతో జూచుచున్నవాడని తలచి తననుంచి వేరుపరచుచున్నది. ఏ క్షత్రియుడు క్షత్రియజాతిని ఆత్మకంటె భిన్నముగ తలచునో వానిని క్షత్రియజాతి వేరు చేసివైచుచున్నది. ఎవడు, స్వర్గాదిలోకములను ఆత్మకంటె అన్యత్రముగ దలచుచున్నాడో వానిని స్వర్గాదిలోకములు తమనుంచి వేరుచేయుచున్నవి. ఎవడు దేవతలను భూతములను ఆత్మకంటె వేరుగ తలచుచుండునో వానిని దేవతలు భూతములు వేరు చేసివైచుచున్నవి. ఎందుకనగా ఏ యాత్మశ్రవణము అనుభవముజేయుటకు యోగ్యమైనదో అది ఈ ఆత్మ ఈబ్రాహ్మణజాతి, క్షత్రియజాతి, ఈ లోకములే, ఈ దేవతలే ఈ భూతములే అన్నియునిదే. ఉదాహరణకై—ఒక భేరీవాయించినచో మనుష్యుడు దాని శబ్దము గ్రహింపజాలడు కాని భేరీయొక్క సాధారణశబ్దము గ్రహించుటచే, లేకపోయిన దానిని వాయింపగానగు ధ్వనిని చూచినయెడల భేరీయొక్క ముఖ్య శబ్దమును గ్రహింపగలుగుచున్నాడు. శబ్దవిశేషముయొక్క శబ్దము అసలు సామాన్యశబ్దముకంటె వేరు కాదు. ఈ ప్రకారముగనే స్ఫురణరూపబ్రహ్మ సామాన్యముకంటె స్ఫురితపదార్థము కూడ వాస్తవమందొకటి రెండవదానికంటె భిన్నము కాదు. ఎట్లన ఉప్పుయొక్క గడ్డకట్టిన అచ్చు, జలవికారమే. జలముయొక్క రూపాంతరము. ఈ అచ్చును నీటిలో బడవైచినచో అది కరిగిపోవును. అప్పుడు ఎంత నేర్పరియైనను ఆ ఉప్పు అచ్చును నీటిలోనుంచి వేరుగ తీయజాలడు. ఎందుకన ఆ సమయమున దాని పృథకత నష్టమై పోవుచున్నది. ఓ మైత్రేయీ! ఈప్రకారముగనే నీవుకూడ అపరిచ్ఛిన్న, నిర్వికార, కార్యకారణరహిత, విశుద్ధజ్ఞానాత్మవే."

ఈవిధముగ ఇట్టి అనేక యుక్తులచేతను దృష్టాంతములచేతను యాజ్ఞవల్క్య ముని మైత్రేయికి బ్రహ్మసాక్షాత్కార మొనర్చి అమరత్వము పొందజాలు దుర్లభమార్గము తెలిపెను. విస్తారభయముచేతను, విషయగహనత్వముచేతను యీ యుపదేశము నిచ్చట పూర్తిగ మేము వెలువరించియుండలేదు. పాఠకలోకమొకవేళ దీనిని చదువదలచినచో బృహదారణ్యకోపనిషత్తులయందు జదువుకొనగలరు. పిదప ఈ యుపదేశమొసంగి యాజ్ఞవల్క్య మహర్షి వనమునకు జనియెను. మైత్రేయి వారొసంగిన తత్త్వజ్ఞానచర్చచేతను నియమితసాధనమందును దన జీవితమును శాంతియుతముగ వ్యతీతము చేసికొనసాగెను. ఈప్రకారముగ ఏ అమరత్వముచే ఆమె సమస్త పార్థివ సుఖములను రజోలేశమువలె విడిచిపెట్టివైచెనో ఆ అనుపత్వనిర్మాణము ప్రాప్తించుటచే మైత్రేయియొక్క మనుష్యజీవనము సఫలమయ్యెను.

భూమిపై మనము దేనిని సుఖమనుచున్నామో ఏ సుఖప్రాప్తికై జగత్తున అనేక విధములగు సత్యాసత్యములతోడను కృత్రిమములతోడను పనిగొనుచుంటిమో ఆ సుఖముచే మనకు వాస్తవికమగు స్థాయీతృప్తి ప్రాప్తమగుచుండుటలేదు. భోగము, ఐశ్వర్యము, పదము, గౌరవము, యశస్సు వీటిలో కొంచము పొందువారలకివి పూర్తియగు శాంతిని తృప్తిని గూర్పజాలవు. కారణమిదియే- యేమన- భోగి యింకను అధికముగ భోగముల వాంఛించుచున్నాడు. ధనవంతు డధిక ధనము కోరుచున్నాడు. పదాధికారి యున్నతపదములకై ప్రయత్నము చేయుచున్నాడు. యశస్వియు యింకను యశస్సు కోరుచున్నాడు. సంక్షేపములో—ఉన్నంతలో సంతుష్టి జెందక ఇప్పుడుకూడ నింక కొంచెము లభించిన బాగుండును అని తలచుచునుండును. కాని అదిలభ్యమగుచుండు నట్లుగనే యాతని యాశయు పెరుగుచుండును.

నిజసమస్తమనోకామ్యములు సిద్ధించిన మీదట మనుజుడు తన ప్రాణముల క్షుధాబాధ తీరలేదని తలచును. అతనియందు మొదటగల శూన్యత్వము, న్యూనత్వము, ఇప్పుడుకూడ పూర్తిఅయియుండలేదు. అతడింకను సుఖసంతుష్టుడయియుండలేదు. అతని మనస్సు తృప్తి యింతకుగూడ బొందనేరదు.

ఈ క్షుధయును నీ శూన్యతయును నాత్మదే. పార్థివ సుఖముల నుప భోగ మొనర్చుటచే నీ శూన్యత్వము పూర్తియగుచున్నది. ఆత్మయొక్క క్షుధ తొలగించుటకు శూన్యత్వము పూర్తిజేయుటకు, నిత్యసచ్చిదానంద విశ్వముయొక్క ఆత్మస్వరూపమగు బ్రహ్మముతో నిజసంబంధానుభవంబు చేయుటే, బ్రహ్మముతో సంపూర్ణాత్మ మిలనము. ఆత్మసమర్పణము చేయుటే, మరియు నిరవచ్ఛిన్న బ్రహ్మానందముయొక్క అమృతపానము చేయుటే, ఒక్కమాత్రమైన యుపాయము. మనుజుడు తనను గుర్తించలేడు. అతడు తన అంతరాత్మ వైపునకు గాంచనుజాలడు. అంతరాత్మయొక్క సత్యాభిలాష మేమియో ఈ వాక్యములచే నాతడు కొంచెముకూడ పరిచితుడు కాక, ఆ అభిలాష యెట్లు పూర్ణముకాగలదో అభిలాషయొక్క తృప్తి ద్వారా ఆత్మకుచిరస్థాయియగు శాంతి యెట్లులభ్యము కాగలదో ఏమియు తెలిసికొనజాలకున్నాడు. మోహవశుడై ఆ మనుజుడు సుఖముకొరకు భోగవిలాసములయొక్క ఆదర గౌరవములకు లోభియై ఇటునటుల తిరుగులాడుచుండును గాని యిట్లు చేయుటచే నాతనికి సత్యమైన సుఖము ప్రాప్తించుటలేదు.

ఏ జనులకు వాస్తవికమగు నంతర్దృష్టి ప్రాప్తమై యుండునో వారంతరాత్మను గుర్తెరిగి ఆంతరికాభిలాషను తెలిసికొనుచున్నారు. ఈ ప్రపంచకపు అసార, అనిత్య విషయభోగములను ధూళివలె త్యజించి తత్వజ్ఞాన, పరమాత్మ, ఆత్మాసమ్మేళనమందే తమ జీవితముయొక్క పరమశాంతిని పరమతృప్తిని అనుభవము జేయుచున్నాడు. శాంతికి వినాశము లేదు. అంతములేదు. పరివర్తనములేదు. మోహముక్తులగు మనుష్యులు ఆ ఆనందమందు మత్తులైపోవుచున్నారు. ఈస్థితి పేరే యమరత్వము.

మైత్రేయి నిజసాధనమువలన వాస్తవికాంతర్దృష్టిని పొందెను. ఆంతరికాభిలాషను తెలిసికొనియే అమరత్వముకొరకునై ప్రాపంచికానిత్య- అపారధనసంపత్తిని పూర్తిగ విడచివైచెను. ఆమె జగత్తునందలి సారరూపమగు నొకే వస్తువు అనగా నిత్యధనమగు బ్రహ్మజ్ఞానప్రాప్తికై యుత్సుకరాలైయుండెను. ఇంతవరకనగా ఆమె జీవితవాంఛలన్నియు ఈ బ్రహ్మప్రాప్తికొరకై యుండెను. వ్యాకులహృదయరాలై యామె ప్రార్థించెను.

“—అసతోమాసద్గమయ తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా మృతంగమయ, ఆవిరావీర్మ ఏధి రుద్రయత్తే దక్షిణం ముఖం| తేనమాంపాహి నిత్యం||”

అనగా ఓ భగవంతుడా నన్న సత్యమునుండి సత్యము వైపునకు గొనిపొమ్ము. అంధకారమునుండి ప్రకాశములోనికి గొనిపొమ్ము. మృత్యువునుండి అమరత్వములోనికి గొనిపొమ్ము. ఓ ప్రకాశస్వరూపా! నీవు నాయందు ప్రకాశమును జేర్పుము. ఓ రుద్రా నీవు నీ ప్రకాశరూపమును ప్రసన్నరూపమును జూపుము. ఆ ప్రసన్నముఖముద్వారా నన్ను రక్షింపుము.

ఇంతకంటె శ్రేష్ఠ సుందర ప్రార్థనము మరియే రమణీ ముఖమునుండియును వెలువడియుండలేదు. నేడు వేలకొలది స్త్రీ పురుషుల యాత్మలకు యీ మైత్రేయి ప్రార్థనముచే శాంతి గలుగుచున్నది. జీవనమునందలి శాంతి, పరమతృప్తికొరకు మనుష్య హృదయమందేయే ఆకాంక్షలు గలుగుచున్నవో వాటినన్నిటిని ఈ కొద్దివాక్యములచే మైత్రేయి వ్యక్తీకరించివైచెను.

ఇంతేగాక తన తండ్రియగు మిత్రమునియొక్క విద్యాలయమందీమె శిక్షకురాలిగగూడ పని చేసెను. ఈప్రకారముగ మైత్రేయి అపరిమితమైన అపూర్వమైన తన జ్ఞానమును తనవరకే హద్దుగానుంచుకొనక ఇతరులకుకూడ అజ్ఞానమువలన లాభము జేకూర్చెను. ధన్యవు మైత్రేయీ!! నీవంటి విదుషీరత్నములు భారతభూమిని జన్మించి కేవల మీ దేశమునందే కాక సమస్త ప్రపంచకమునందను శాశ్వతకీర్తిని గడింతురనిన సత్యేతరము కాదు. ఇంకను నీవంటి బ్రహ్మజ్ఞాన నేర్పరులు భారతావనియందు జనియింతురు గాక.

ఓమ్ తత్సత్.

# గ్రీష్మము

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

సీ॥ లలితపల్లవముల బలునెమ్మిదినికూయు। కోకిలరవళ్ళి జీకాకుజేసి
కమ్మతెమ్మెరల సౌఖ్యమ్ములబోకార్చి। సుడివడగాడ్పుల గ్రుక్కజేసి।
అతిఘోరలీలదావాగ్నికీలలపర్వ। తారణ్యసీమల హాతమొనర్చి।
పటుతీవ్రతాప సంభరితోష్ణకరదీప్తి। నుంకించినదుల నీరింకజేసి।
గీ॥ అతివిజృంభణావృత్తి నజాండమెల్ల। ఘల్లటిల్లగనేచుచు ప్రళయకాల।
హరునిసయనాగ్నివోలె జనాళికెల్ల। భీతిగొల్పుచు ప్రబలె గ్రీష్మాతపంబు॥

## ద్విపద

గిరులపై దావాగ్ని దరికొనుచుండ। కరముదుర్భరమగు గాడ్పులువీచె।
కాలువెట్టిననిప్పు కణికలవోలె। గాలెడిరాళ్లచే గఠినమౌధరణి।
ప్రళయజంఝూనిలప్రభలోయనంగ। బలుభయంబొదలించె వడమటి గాడ్పు।
మనసారగ్రోలగా మంచినీరంబు। లినికెగూపంబుల ఘనతటాకముల।
ఎండమావులజూచి దండినీరనుచు నిండాస మోదల నిక్కపైకెత్తి।
పసులు దప్పికదీర పానంబుసేయ। వెసజూచిచూచి బర్వెత్తుచునుండె।
త్రావనీరములేక తరుకోటరముల। కాపుకావనుచువా పోవుపక్షులును।
అంతింతయైనను కల్లాడకుండ। ఎంతయొక్కొకవేళ నేచెడిగాలి।
పీవనలందుండి వెసలువాయువులు। దావానలంబట్ల దనరె వేడిమిని।
ఉస్సురుస్సురటంచు నుష్ణాతపమున। డస్సిచైతన్యముల్ దప్పిజీవులకు।
దివ్యమౌపుణ్యనదీ తోయములును। భవ్యసౌధోపరి భాగ్యవాసములు।
చల్లనినీరముల్ చలువచందనము। మల్లెపూబందిరుల్ మలయానిలంబు।
వలనొప్పసలిపెడి వనవిహారములు। బలురమణీయపుష్పా పర్యంకపాళి।
అతివేడ్కగొల్పు వీణాదిగానములు। సతతంబనామయసౌభాగ్యములును
గలుగుశ్రీమంతుల గాసినొందింప। గలుగుదే గ్రీష్మమా? కడు పేదవారి।
అలయింపజేతు వియ్యది మేలెనీకు?। తలగిపోవమ్మ సంతాపంబువీడి।
వర్షాగమంబున వసుధాస్థలంబు। హర్షంబునొందు శ్రీహరికటాక్షమున॥

# పశ్చాత్తాపము

శ్రీమతి వి. శశిరేఖ గారు

౧

కలకత్తాలో ఒకధనవంతుఁ డున్నాఁడు. అతనికొక కొడుకున్నాఁడు. అతనిపేరు మోహనుఁడు. మోహనునికి, పాపము, చిన్నప్పుడే తల్లి దండ్రులు చనిపోయిరి. అతఁడు, ఏలాగో, బడిలో చదువుకొని, పరీక్షలలో తేఱినాఁడు. ఆయూర సుందరరావుగారను ప్లీడరున్నాఁడు. ఆయనకు మనోరమయను ఒకకూఁతురున్నది. మనోరమకూడ మోహనుఁడు చదువుకొను బడిలోనేచదువుకొన్నది. అప్పటినుండి వారిద్దఱకు చాలస్నేహము. మోహనుఁడు ఎం.ఏ ప్యాసయి ఇంగ్లండు వెళ్ళినాఁడు. మనోరమ బాగుగా ఇంగ్లీషుమాటాడుట వచ్చువఱకు చదువుకొని; తర్వాత మానివేసినది. హిందూదేశమునుండి యింగ్లాండునకు వెళ్లు యువకులలో పెక్కండ్రు ఏలాగున తయారగుచున్నారో వర్ణింపనక్కఱలేదు. మన మోహనుఁడుకూడ అలాగే తయారైనాఁడు. తనదగ్గఱనుండు డబ్బంతయు తగులఁబెట్టినాఁడు.

౨

సుందరరావుగారి కూఁతురు చూచుటకంత అందగత్తె కాకపోయినను, మొత్తము మీఁద బాగుగనేయున్నది. అందానికి మించినపోషకులు. ఆకుఱుచచేతులు, నొక్కునొక్కుల వాలుజడ, కండ్లకే జబ్బును లేకపోయినను అందముకోసమై కష్టపడి పెట్టుకొనుచున్న ఒక కండ్లజోడు, ఇంగ్లీషు దొరసానికివలె కాళ్ళకు టక్కుటిక్కుమను జోళ్లు, ఇంటిలో ఒకముస్తాబు, బయటికి వెళ్ళునప్పుడింకొకముస్తాబు—చేతికి రిష్టువాచి, చెవులకు లోలకులు, పైటకొక బ్రోచి, మొగము మీఁద పడునట్లు జుట్టు, ఆజుట్టునకు క్లిప్పులు, ఇది ఆమె సింగారము. సాయంకాలము నాల్గుగంటలగునప్పటికి కారులోఁగూర్చుండి, టింగురంగాయని ఒయ్యారముగా కాలు మీఁద కాలువేసికొని, యిటునటు మెఱుపుఁజూపులఁచూచుచు, క్లబ్బునకు వెళ్ళును. ఆమెకు రోజంతయు షోకులతోనే ముగియునుకాలము.

౩

సుందరరావుగారప్పుడే కోర్టునుండివచ్చి కాఫీ పుచ్చుకొనుచున్నారు. మనోరమ పేపరు చదువుకొనుచు సోఫామీఁద పండుకొన్నది. అప్పుడు తపాలాబంట్రోతువచ్చి సుందరరావుగారి కొక టెలిగ్రామిచ్చినాఁడు. సుందరరావుగారు టెలిగ్రాము మనోరమ చేతికిచ్చి, "మనోరమా! దానిని విప్పి చదువుమమ్మా!" అనెను. మనోరమ యిట్లు చదివెను.

"నేను చాల చిక్కులలో నున్నాను. వెంటనే కొంత 5 వేలు పంపఁగోరెద"

'మోహన్'

సుందరరావుగారి భార్య సుశీల గదిలో తమలపాకులకు సున్నము రాచుచుండెను. సుందరరావుగారు సుశీలను పిలిచినారు. సుశీల రాఁగానే మనోరమ అవలకు వెళ్ళిపోయింది.

సుంద—సుశీలా! మోహనుఁడు డబ్బు కొఱకు టెలిగ్రామిచ్చినాఁడు. ఏమిచేయు మందువు?

సుశీల—సందేహ మెందుకు? కావలసిన డబ్బు పంపుఁడు.

సుంద—వాఁడు మరల మనకు డబ్బు తీర్చునో లేదో!

సుశీ—ఇయ్యకపోయిన నేమి? మనము పిల్లనిచ్చునప్పుడు కట్న మేమియు ఇయ్య కుండ కార్యము చేయుదము. ఏమందురు?

సుంద—అవును. ఆలాగుననే చేయుదము.

సుశీ—ఇంక నాలస్య మెందుకు? పాప మతఁ డెంత కష్టపడుచున్నాఁడో!

ఈమాటలన్నియు చాటుననిల్చి మనోరమ విని సంతోషించినది. సుందరరావు మనోరమా యని పిలిచినాఁడు. మనోరమ వచ్చినది.

సుంద—(ఇనుపపెట్టె తాళములు కూఁతురుచేతికిచ్చుచు) అమ్మాయీ! అయిదువేల రూపాయ లాపెట్టెనుండితీసి మోహనునికి పంపు.

మనో—సరే, నాన్నా—అని సంతోషముతో వెళ్లింది.

౪

నేటిసాయంకాలము లండను నుండి మోహనుఁడు వచ్చును. అందుచేత సుశీల—వంటగదిలో కాఫీ తయారు చేయుచున్నది. "మనోరమా! మోహనుఁడు వచ్చువేళ యైనది. త్వరగా బట్టలువేసికొని మీనాన్నగారితో స్టీమరుదగ్గఱకు వెళ్ళు," అని సుశీల చెప్పినది. స్టీమరు రేవునకు వచ్చినది. సుందరరావుగారు, ఆయన కొమరితయు కారుదిగి స్టీమరు దగ్గఱకు వెళ్ళునప్పటికి మోహనుఁడు స్టీమరు దిగి వారి కెదురుగా వచ్చెను. వారు మోహనునిచూచి ఆనవాలు పట్టలేకపోయిరి.

మోహ—ఏమండీ, సుందరరావుగారూ! నన్ను మఱచిపోయితిరా యేమి?

సుంద—ఓహో! నీవా? ఇంగ్లాండు వెళ్లినతర్వాత దొరవై పోయినావే! ఆనవాలు పట్టలేకపోయితిని.

మోహ—దానికేమి లెండు. మీరు నాసామానంతయు ఒకబండిమీఁద వేయించుకొని తీసికొనివత్తురా? ముందుగా నేనును మనోరమయు మీకారెక్కి వెళ్లెదము. ఏమందువు మనోరమా? వెళ్ళుదమా?

మనో—సరే, మీయిష్టమువచ్చినటులే చేయుదును.

ఇద్దఱును కలిసి వెళ్ళిపోయినారు.

౫

ఒకరోజున పూర్ణిమనాఁడు రాత్రి మనోరమా మోహనులు వెన్నెలలో నది యొద్దకు షికారు వెళ్ళిరి. కారుదిగి నదిగట్టుపై కూర్చున్నారు.

మోహ—మనోరమా! నీముఖమునకును ఆచంద్రునికిని ఏమియు భేదములేదు సుమా! నే నన్ని దేశాలు తిరిగితిని కాని, నీవంటి చక్కనిదాని నెక్కడను చూడలేదు.

మనో—(నవ్వుచు తలవంచుకొన్నది.)

మోహ—నీమనసులో నాకు చోటియ్యవా?

మనో—(సిగ్గుచే నూరకున్నది.)

మోహ—ప్రియా! మాటడవా?

అని బుజముమీఁద చేయివైచి ముఖమువంక చూచుచు కూరుచుండెను.

మనో—మో...హ...నా!(అని యనురాగదృక్కులతోఁ జూచినది.)

మోహ—ప్రియా! (అని యాలింగనము చేసికొని ముద్దులవాన కురియించినాఁడు) ఆలాగున నెంతసేపుండిరో వారికే తెలియదు. మన మెట్లు చెప్పఁగలము?

మనో—నామనసులో నీకుచోటేకాదు. నన్నే నీకర్పించుకొన్నాను.

కొంతసేపైనతర్వాత వారు మరల కారెక్కి వెళ్లిపోయిరి.

౬

రాత్రి పదునొకండు గంటలైనది. మనోరమా మోహను లింకను సినీమానుండి రాలేదు. సుందరరావుగారు మేడమీఁద వసారాలో పడకకుర్చీలో కూరుచుండి యేదో ఆలోచించుచున్నారు. ఇంతలో సుశీలవచ్చి ప్రక్కనున్న కుర్చీలో కూర్చున్నది.

సుశీ—ఏమండీ! మన మనోరమయు మోహనుఁడును ఇంకను రాలేదేమీ? సినీమా తొమ్మిదిగంటలకే అయిపోవునుగదా?

సుంద—ఏమో! వారల వేషములు, చర్యలు, నాకు నచ్చలేదు. రాత్రులయందు ఒంటిగా వెళ్లెదరు షికార్లకు. ఈసినీమాలు, నాటకాలు ఏమో నాకు తెలియకున్నవి. ఎంతగా చెప్పినను వినరు. వారల కర్మము. నేనేమి చేయుదును?

సుశీ—ఆలాగు అనిననెట్లు? వారికి త్వరగా పెండ్లియేల చేయరు?

సుంద—సిద్ధాంతులతో ఆలోచించితిని. రాఁగల ఆదివారము మంచి ముహూర్త మన్నారు.

ఇట్లువారు మాటాడుచుండఁగా, మనోరమా మోహనులు కారుదిగి మేడమీఁదికి వచ్చిరి.

సుంద—మోహన్! మీపెండ్లికి ఆదివారమునాఁడు ముహూర్తము కుదిరినది. అది స్థిరపఱుపవచ్చునా?

మోహ—ఓ! మీ యిష్టమువచ్చిన నీరోజున స్థిరపఱుపుఁడు.

(ప్రక్కగదిలో భోజనము సిద్ధము చేయుచున్న నూరమ్మ వెంకయమ్మలను ఇద్దఱు పనికత్తె లిట్లు మాట్లాడుకొనిరి.)

నూర—ఏమే వెంకూ! ఈ రోజులలో సిగ్గులులేవు సుమా? అదేమి పాపమో గాని.........

వెంకమ్మ—పాపమేమే! సిగ్గు ఎందులకే? ఎవరి యిష్టము వారిది. అంతలోనే మనోరమ యిచ్చటకు వచ్చి యా మాటలాలించి "నూరీ! నీకేమి! మా యిష్టము మాది. నోరు మూయుము" అన్నది.

౭

రాత్రి 8 గంటలకు వివాహముహూర్తము. వచ్చెడు వారికండఱకు మర్యాద చేయుచున్నాఁడు సుందరరావు. పెండ్లిసందడిలో మునిగియున్నది సుశీల. మనోరమ అలంకరించుకొనుచు నిలువుటద్దమునొద్ద నిలిచి యున్నది. మోహనుడు సూటువేసికొని

షోకుగా తయారై మనోరమదగ్గఱకు వచ్చినాడు.

మోహ—మనోరమా! ప్రయాణమునకు సిద్ధపడితివా?

మనో—ఎక్కడికి? పెండ్లి పందిటిలోనికే గదా?

మోహ—అవును. కాని, ఆపందిరి యీ దేశములోనిది గాదు.

మనో—మరి యేదేశములోనిది?

మోహ—మన పెండ్లికి తగిన చోటు లండన్. అక్కడికి పోదము రమ్ము.

మనో—అయ్యో! మా నాన్నగారు చాల యత్నములు చేసిరే! వారేమందురో?

మోహ—ఏమన్నను సరియే. బయలుదేఱు. స్టీమరువేళ యగుచున్నది.

మనో—సరే. పదండి.

మోహ—నీ నగలో?

మనో—అవి నా దేహముననేయున్నవి.

మోహ—నా వెనుక నెమ్మదిగా చప్పుడు కాకుండ నడిచిరమ్ము.

మనో—కానిండు. మీదగ్గఱ కావలసిన డబ్బున్నదా?

మోహ—కావలసినదానికన్న నెక్కువ యున్నది. రా.

దొడ్డిదారినిబడి వా రిరువురును పోవుచుండగా, నెవరో చూచి సుందరరావుగారితో చెప్పిరి. సుందరరావు పరుగునబోయి అడ్డుపడినాడు.

సుంద—మోహనా! ఎక్కడికీ ప్రయాణము?

మోహ—ఇంగ్లాండునకు.

సుంద—పెండ్లియో?

మోహ—పెండ్లికేమంత తొందర వచ్చెను?

సుంద—అయ్యో! నా పరువులీయకుమా! చుట్టాలందఱు వచ్చిరి. అన్నియు సిద్ధమైనవి. ఇప్పు డిట్లు చేయుదువా?

మోహ—చేయవలసివచ్చినది. మీరు పొండు.

సుంద—మనోరమా! నీ వెందులకు? నీ వుండిపొమ్ము. ఓయి మోహనా! నా కూతును తీసికొని వెళ్లుటకు నీకేమి హక్కున్నది?

మనో—నాన్నా! నేనుకూడ వెళ్లెదను.

సుంద—నామాట వినరా?

మనో, మోహ—మాయిష్టము మాది. మీరు వెళ్లుడు.

సుంద—మీ రెక్కడికి వెళ్లిన నాకేమి? ధర్మము తప్పకుండ పెండ్లి చేసికొని మీ యిచ్చ వచ్చిన చోటికి పొండు. మీ మంచి కోసమే చెప్పుచున్నాను. తరువాత పశ్చాత్తాపపడెదరు సుండీ!

మోహ—(మనోరమ చేయిపట్టుకొని విసుగుదలతో) కాలము మించిపోవుచున్నది అనుచు సమీపముననే వారికొఱకు వేచియున్న కారెక్కి స్టీమరుదగ్గఱకు వెళ్లిపోయిరి.

౨

మనోరమ మోహనము లండను నగరములో స్టీమరు దిగి, ఒక పెద్ద హోటలునకు వెళ్లి, గదులు మాటాడుకొని, అందు కాపురమున్నారు. క్రొత్త యూరు కాబట్టి

మనోరమకు చాల సరదాగానున్నది. సినీమాలకు, నాటకాలకు, వెళ్లుట తరుచైనది. బసలోనుండుటయే తక్కువైనది.

వారు లండను చేరి దాదాపుగా అయిదు నెల లైనది. ఒకరిమీది మోజు ఒకరికి తగ్గినది. మనోరమకు మనస్సులో కొంచెముబాధగానున్నది. కాని పైకిమాత్రము ఎప్పటివలెనే యున్నది. ఏమేని అనిన, తన్నతఁడు వదలి పోవునేమో యని భయము. ఈలాగుననే రోజులు గడచిపోవుచున్నవి. అత డొక దొరసానితో స్నేహముచేసి, యెప్పు డామెతోనే తిరుగుచున్నాడు. పైగా ఇంటికి తీసికొనివచ్చి మనోరమ యెదుటనే, ఆమెతో హాస్యప్రసంగాలు చేయజొచ్చినాడు. ఒక్కొక్కప్పుడు మనోరమ యెట్ట యెదుటనే దొరసానిని ముద్దు పెట్టుకొనెడివాడు. ఇక మనోరమ యోర్చుకోలేక అడిగివేసిన దొక రోజున మోహానుడు టీ పుచ్చుకొనుచుండ.

మనో—ఏమండీ! నేనుండగా దానితో సరసములా!

మోహా—సరసము లాడినంత మాత్రమున, తప్పా యేమి?

మనో—నేను ధర్మపత్నిని గదా!

మోహా—నీ వెటువంటి ధర్మపత్నివో, ఆమెయు అట్టి ధర్మపత్నియే. నీ గొప్ప యేమున్నది?

మనో—మీ రామెతో తిరుగ వీలు లేదు. నేను గట్టిగా చెప్పుచున్నాను.

మోహా—నీ మాట వినుటకు, నిన్ను నేను పెండ్లి చేసికొంటినా? దానిలాగుననే నీవును వచ్చితివి!

మనో—ఇదా మీ యుద్దేశము? సరే! నేటితో మీకును నాకును సరి.

మోహా—నోరు మూయుము, నీ కర్మము నీది, నా కర్మము నాది. నేటితో నీవు నాకు వదలిపోయితివి.

అనుచు దుస్తులు తొడుగుకొని బయటికి పోయినాడు. మనోరమకు చాల కోపము వచ్చినది. నగలన్నియు తీసివేసినది. మోహానున కొక జాబు వ్రాసి బల్లమీద పెట్టి, కట్టుగుడ్డతోడనే థేమ్సు నదియొడ్డునకు పోయినది. అక్కడ కూర్చుండి మనసులో ఈలాగున అనుకొన్నది. "అయ్యో! దైవమా! నా కెట్టి గతి పెట్టితివి? ఆరోజున మా నాన్న చెప్పినట్లు పెండ్లి చేసికొన్న, ఎంత బాగుగ నుండెడిది! పెండ్లి కాకుండ సతనితో తిరుగరాదని మా యమ్మ యెన్నోసారులు చెప్పినది. ఆ మాటలు విననైతిని. "మీ రొక రోజున పశ్చాత్తాపపడెదరు" అన్నాడు మా నాన్న. అలాగే అయినది. ఆహా! నా జీవితమంతయు వ్యర్థమైపోయినది. ఛీ, ఛీ! నే నిక బ్రతికి యేమి లాభము! హా! తండ్రీ! నా తప్పులు మన్నింపుము. ఇక మొగము చూడను!!" అని నదిలో దూకబోయినది.

౬

మనసేమియు బాగుగానుండక మోహానుడు వెంటనే యింటికి మరలి వచ్చినాడు. "మనోరమ నన్ని మాటలంటిని. ఆమె ముఖ మెట్టుచూచుట?" అనుకున్నాడు. లోపలికి పోయి చూడ మనోరమ కనబడ లేదు. "మేడమీదనున్న దేమో, అక్కడకు పోయి క్షమాపణ మడిగెద" నని పైకి వెళ్లి

నాడు. ఎక్కడను ఆమె కనుపింపలేదు. ఒక చీటిమాత్రము బల్లమీద దొరకినది. ఆత్రముతో దానిని విప్పి చూచినాడు. గుండెలో పిడుగుపడ్డట్లు అయినది. ఆ చీటిలో ఇట్లున్నది.

"మోహనా! నాకొఱకు నీవు వెదక వలదు. వెదకినను లాభము లేదు. దయ యుంచి నన్ను మఱచిపొమ్ము.

మనోరమ"

మోహనుడు వెంటనే యిల్లువదలి మనోరమను వెదకుచు బయటికి వెళ్లినాడు. అతనికి బాగుపడెడు యోగమున్నది కాబట్టి మనోరమవలెనే పశ్చాత్తాపపడినాడు. కండ్ల వెంబడి నీళ్లు కారుచున్నవి. పాపమేమి చేయఁగలడు? త్రోవయు తెన్నును తెలియకయే అతడు నడువ మొదలుపెట్టినాఁడు. దైవయోగముచేత నదియొడ్డునకు చేరుకొన్నాడు. ఎదుట ఒక స్త్రీ చేతులు చాచుకొని నీళ్లలో దుముకబోవుచున్నట్లు, అతడు చూచినాడు. మోహనునికి ఆ వ్యక్తి మనోరమ యని అప్రయత్నముగ తోచినది. ఒక్క పరుగున వెళ్లి మనోరమను పట్టుకొన్నాడు. ఆమె ఆశ్చర్యముతో వెనుకకు చూచినది.

మోహ.—నా తప్పులు క్షమించువఱకు నిన్ను వదలను.

మనో.—ఏమి తప్పేమున్నది? అంతయు నాదే.

మోహ.—అలాగునకాదు. నా తప్పు క్షమించితిననుము.

మనో.—సరే, వదలుము.

మోహ.—మనమిద్దఱము రేపు కలకత్తా వెళ్లెదము.

మోహనుడు భార్యతో బయలుదేఱి వచ్చుచుండెననియు, పెండ్లికి సర్వమును సిద్ధము చేయవలసినదనియు వెంటనే సుందరరావుగారికి తంతివార్త పంపినాడు.

౧౦

మనోరమా మోహనులు కలకత్తా చేరిరి. కొలది దినములకే వివాహమైనది. దంపతులానందముతో వృద్ధ దంపతులగు సుశీలా సుందరరావుగార్లకు నమస్కరించిరి. వారు మనఃపూర్వకముగా వధువరుల నాశీర్వదించిరి. అంతయు ఆనందమయమై పోయెను.

## నేటి "బి. యే." లు

శ్రీమతి చర్ల సగి రాజకుమారిగారు

సీ॥ ఉద్యోగము దొరక దోదేముడాయని దేవులాడుచు నూళ్లుదిరుగువారు
పిత్రార్జితంబంత పీసమైనను లేక బి. యె కయ్యెనని విలపించువారు
చదువులకై కలసంపదల్ గోల్పోయి సతులసొమ్ముకు చేయిజాపువారు
ఉద్యోగమునకునై యూరూరదిరుగుచు కలధనంబుల ఖర్చుసలుపువారు
నగుచునెందును జీవనోపాధిలేక
కుందుచున్నారు సుఖములగోలుపోయి;
"కాలమా! నీకృతమ్ములు గలవుగద శ
తమ్ములున్ గోట్లు, ఏమిఫలమ్ము బలుక!"

# సౌందర్య పిపాస

పసుమర్తి రామకృష్ణారావు గారు

ఉదయసింహుడు సింహాసనమధిష్టించ నుండెను. మాధవపురమంతయు బాగుగ నలంకరింపబడెను. నలుదిక్కులను ఆనందప్రవాహము పెల్లివిరియుచుండెను. నృత్యసంగీతనిస్వనములు ప్రతిధ్వనించుచుండెను.

"రేపు మధ్యాహ్నమునుండి సాయంకాలము వరకు రాజకుమారుడు బహుమతుల నొసంగును.— ఎవరికి కావలసినది వారడుగవచ్చును. అందరి కోర్కెలు తీర్పబడును"—అని నగరమంతట చాటింపబడెను.

మరుసటిరోజున నిర్ణీతసమయమునకు ముందే స్త్రీ పురుషులు రాజభవనప్రాంగణమున గుమిగూడిరి. ప్రజలందరు తమతమ మనోరథముల సఫలమొనర్చుకొనిరి. జయజయధ్వనులతో ఆకసము ప్రతిధ్వనించెను.

సాయంకాలమగుట కిక నెంతో యాలస్యములేదు. రాజకుమారు డలసిపోయెను. అతడు రాజప్రాసాదములోని కేగదలచుచుండెను.

ఇంతలో ఆనందమున నోడలెరుంగని యా జనసమూహంబును త్రోసికొనుచు ఒక నారీలలామ అతని యెదుటకు వచ్చి నిలువబడెను. ఆమె శరీరమంతయు నల్లని వస్త్రముచే నాచ్ఛాదితమైయుండెను.

ఆమె "ఉదయసింహా!" అని కోమలస్వరంబున పిలచెను.

అమృతము వర్షించినట్లుండెను!

రాజకుమారు డులికిపడెను!

ఆ రమణీమణి "నేనుకూడ ఒకటి కోరుచున్నాను. ఇంకను సంధ్యాసమయము కాలేదు. కాన నా ప్రార్థన వ్యర్థముకాదని యూహించెదను" అని పలికెను.

ఉదయసింహుడు చిరునవ్వు నవ్వి—"నీకేమి కావలెను?" అని యడిగెను.

కోర్కెతో మిళితమైన శబ్దముతో "నీవు!" అని యా కోమలాంగి వాక్రుచ్చెను.

"నేనా!"—యని ఉదయసింహు డాశ్చర్యచకితవదనములతో ఆ ప్రచ్ఛన్నరమణీమణి వైపు జూడ నారంభించెను. అతని కేమియు నర్థము కాలేదు. ఆమె నఖశిఖా పర్యంతము నల్లనివస్త్రము కప్పుకొనియుండెను.

రాజకుమారునికి కవిత్వము కాని మనోవిజ్ఞాన శాస్త్రము గాని తెలిసియున్నచో "ఆ సుందరి నవ్వుచున్న"దని తప్పక గ్రహించియుండును.

ఉదయసింహు డించుక యాలోచించి "సాయంకాలము కాలేదనుట వాస్తవమే. కాని నన్ను నే దానమిచ్చుకొందునని చాటించియుండలేదు. నన్ను విడచి నీవేమి కోరినను పొందగలవు."

సుందరి పకపక నవ్వసాగెను. "నీవు పారబడుచున్నావు".

"ఏమంటివి?"—ఉదయసింహుని నేత్రముల నుండి విస్ఫులింగములు రాలదొడగెను. క్రోధకంపిత స్వరమున నిట్లు పల్కెను. "మాయారమణీ! యిచటి నుండి వెడలిపొమ్ము. నిన్ను క్షమించుచున్నాను."

"క్షమించుటా!" అని ఆ రమణి యింకను బిగ్గరగా నవ్వెను.

"అవును, క్షమించుటే—నేను నిన్ను క్షమించుచున్నాను. మరియొక దినమైనచో నిన్ను ప్రాణములతో సముద్రమునందు విసరివేయించియుందును.

ఆ రమణి తన శరీరాచ్ఛాదనమును తీసివైచెను. ఆహా! ఆమె అపూర్వసౌందర్యరాశి. ఆ రూపవిలాసమునకు రాజకుమారుడు సమ్మోహితుడైపోయెను. అతడు ఉత్తేజితుడై "ఎవరు?" అని ప్రశ్నించెను.

"ఒక సామాన్య భిక్షుకురాలను!" అని పలికి యా రమణి క్రమక్రమముగ వెనుక కడుగిడసాగెను. రాజకుమారు డాశ్చర్యమగ్నుడైపోయెను.

ఆమె అదృశ్యమైపోయెను !

ఉదయసింహుడు మోహనిద్రనుండి మేల్కాంచెను. పిచ్చివానివలె కనుబొమల ముడివేయుచు "ఇప్పుడిచ్చటినుండి అంతర్ధానమైన స్త్రీని వెంటనే పట్టుకొని తీసికొనిరండు" అని సైనికుల కాజ్ఞయొసంగెను.

అర్ధరాత్రి సైనికులు మరలివచ్చి తమ కారమణి జాడయైనను దొరకలేదని చెప్పిరి.

2

ఉదయసింహుడు వ్యాధిగ్రస్తుడాయెను. అన్నపానములు సహించుటలేదు. ఏపనిచేయుటకును మనస్సుకుదురకుండెను. దర్బారునకు వచ్చుటకూడ మానివైచెను. హృదయమున అశాంతి, సంక్షోభము, ప్రాణములలో సౌందర్యపిపాస, నేత్రములలో నిద్రావిహీనత ప్రబలమయ్యెను.

అతని కనులయెదుట రాత్రింబగళ్లు ఆ ప్రచ్ఛన్న రమణి రూపవిలాసములే ప్రత్యక్షమాచుండెను.

ఎన్నియో ప్రాతఃకాలములు వచ్చినవి. వెడలినవి. దినకరుని స్వర్ణమయ కిరణము లతని హృదయమందిరమున ప్రకాశించలేదు.

ఒకదినమున రాజ్యమును విడనాడి అజ్ఞాతయగు నా తరుణీమణి నన్వేషింప నొంటరిగా బయలుదేరెను.

వృక్షరాజములఛాయ నాశ్రయించి సఘనాంధకారము నిదురించుచుండెను. ఆవెన్నెలరాత్రి "రాజకుమారా, ఇట్టే కదలిపొమ్ము నిశ్శబ్దశీతంబగు నర్ధరాత్రమున నీకామె యవశ్యము లభించగలదు." అని యాతని చెవిలోచెప్పెను.

వక్రమార్గమున నిబిడములగు పొదరిండ్లయందున్న కాలసర్పంబులు ఫూత్కారము లొనర్చుచుండెను. "అహో! రాజకుమారుని ప్రేమపిపాసయం దగ్నిశిఖ లెగయుచున్నవి.!"

సింహము తోకముడుచుకొని పర్వతగుహాలోనికి పోయి దాగికొనియెను.

"ఇది బహుక్రూరమైన సాహసజంతువు" అతడు పిచ్చివాని ప్రలాపమువలె ముందునకు సాగిపోవుచుండెను.

అతని కొక నిశ్చితమార్గము లేదు.

యౌవనోన్మాద మొక్కటియేకలదు !

చంచలప్రకృతియం దంతట నుదయసింహునకా రమణియే తోచుచుండెను.

వాని సౌందర్యపిపాస శతగుణంబు లధికమయ్యెను. అసమయముననే రెండు సుదృఢబాహువు లతనిని బంధించివైచెను. అతడు నిశ్చేష్టుడైపోయెను.

3

మరునాడు అంధకార బంధురమగు నొక కారాగారంబున నుదయసింహుడు బంధితుడైయుండెను.

కఠినకారాకుడ్యమున గూటియందలి చిన్నదీపము మిణుకుమిణుకు మనుచుండెను.

ఏమియు నర్థమగుటలేదు—"ఇదంతయు నేమి?"

అతడు వ్యాకులుడై ఇటునటు పచారుచేయుచుండెను. ప్రతియిటుకను చేతితో తడిమిచూచెను. కాని బయటకుపోవుమార్గ మేమియులేదు.

అదినిశాసమయమో—పగటివేళయో—కూడ వానికి తెలియకుండెను.

అకస్మాత్తుగా వానికాళ్లసంకెలలు గణగణలాడెను. కారాగారమునందు భూమికంపించెనో యనునటులాయెను. ఇనుపద్వారము తెరచుకొనెను. దృఢపదంబులతో నొక స్త్రీమూర్తి కారాగారమున ప్రవేశించుచుండుటను ఉదయసింహుడు చూచెను.

"ఖైదీ! నీవింకను మేల్కొనియే యుంటివా?"అని యామె అడిగెను. ఉదయసింహుని తలతిరుగ నారంభించెను. ఆశ్చర్యముతో "నీవెవరు?" అని ప్రశ్నించెను.

"ఒక సామాన్యభిక్షుకురాలను, నీవు నన్నెరుంగవా?" అని యామెపలికి యవనతశిరస్కయై వాని యెదుట నిలువబడెను.

రాజకుమారుడు స్తంభితుడైపోయెను. "దానమునందు నన్నడిగిన స్త్రీ యీయామెయే. ఏయువతి రూప

విలాసములకు నేను సమ్మోహితుడనైపోతినో, ఆమెయే యీమె! ఏసెలంత నన్వేషించుటలో నేను మిగుల డస్సిపోతినో, ఆమెయే యిపుడు నాయెదుట పాషాణమూర్తియై మానవముద్ర ధరించియున్నది.”

“సుందరీ! నీవెవతెవు?

దేవివా? లేక, దానవివా?”

“నేను నీచరణదాసిని ఒక సామాన్యభిక్షుకురాలను. నీ చిరకాలవైరి మహారాజాధిరాజు ప్రభాతసింహుని కూతురను.” అని సగర్వముగ నామె పల్కెను.

“ఏమి! ప్రభాతసింహునికూతురు రేణుకవా? ఇది స్వప్నము కాదు గదా?” అనుచు నుదయసింహుడు కంపించిపోయెను.

“కాదు, స్థూలసత్యము! స్వప్నలోకమున చింతాశుష్కకంకాళమూర్తులను దర్శింతుము. సౌందర్యోపాసకుడు సౌఖ్యవంతుడగుచక్రవర్తి కాజాలడు. యుద్ధమున నీవు నాప్రియజనకుని హత్య చేసితివి. నేను దానికిబదులు తీర్చుకొనెదను.” అని విరక్తస్వరమున రేణుక వాక్రుచ్చెను.

“ఎవరితో, రేణుకా?”

“నీతో.”

“నాతోనా?”

“అవును నీతోనే—నేను నిన్ను ప్రేమించుచున్నాను.!”

“కాని హత్యకుబదులేమియో—తెలియునా?”

“అవును, తెలియును—హత్యకుబదులు హత్యయే నీహత్య!”

“కాని నీవు......”

మాటకడ్డువచ్చి రేణుక యిట్లు పల్కెను.—

“మాటాడవలదు! నేను నీప్రేమచే గ్రుడ్డిదాననైపోతిని.—ఉన్మాదము! ఆదినమున నేను నీప్రాణములను తీయుటకై వచ్చియుంటిని. జనసమూహము నుండి నిన్ను బాగుగా పరికించితిని—ప్రతిహింస ప్రేమగా మారిపోయెను.”

“ఇదియంతయు నీసాహసము—నీవు నన్నేల కారాగారమునందుంచితివి?”

“కేవలము నిన్ను తనివితీర దర్శించుటకు.”

“ఇపుడేల వచ్చితివి?”

“నిన్ను విముక్తుని చేయుటకు”

“ఇంత త్వరితముగనే?”

“అవును.”

“ఏల?”

“నేను నిన్ను తనివితీరునట్లుగ చూచివైచితిని.” రేణుక, ప్రేమకంపితహస్తములతో నుదయసింహుని చేతి సంకెలలను సడలించివైచెను.

ఉదయసింహుడు కుక్కిమంచముపై కూర్చుండెను: సౌందర్యోజ్జ్వలధవళచంద్రికయం దతడు ప్రేమామృతము తనివితీర గ్రోలి మైమరచియుండెను.

“పొమ్ము నీవు విముక్తుడవైతివి. ఇదియే నాయంతిమనమస్కారము.” అని రేణుక అత్యాదరంబున అవనతవదనయై పలికెను.

“నేను నాపితృదేవుని యాజ్ఞాపాలనము చేయజాలక పోతిని.”

“వారి యాజ్ఞయేమి.?”

ఉదయసింహుడు రెండుచేతులతో తన ముఖంబును మూసివేసుకొనెను.

అతడపరాధివలె రేణుకసమక్షమున నవనతముఖుడైపోయెను. యుద్ధమున ఖడ్గధారతో రేణుక వక్షస్థలమును బొడిచినప్పటి సమయ మతని మనస్సునకు స్ఫురించెను.

నాడెంత యుల్లాసము? కాని నేడో?—పరితాపము.

నాడు విజయము—నేడు పరాజయము.

“నేను మహాపాపిని,—హంతకుడను!” అని ఉదయసింహుడు కన్నీరునించుచు పలికెను.—

“రేణూ! నీయిచ్చవచ్చిన శిక్ష విధించుము. నేను మహాపరాధిని.”

“అపరాధివా?—నీ యపరాధమేమి?”

“నీ జనకునిహత్య.”

రేణుక పకపక నవ్వెను—"నీ వపరాధివికావు, పూజ్యుడవు, కర్మవీరుడవు; శత్రునితో పోరి పగదీర్చుకొంటివి. అపరాధిని నేను."

"అదియెటుల రేణుకా ?"

"నేను నా తండ్రిగారి యాజ్ఞను పరిపాలింపజాలకపోతిని. యుద్ధశిబిరమునందే, నేను—ఉదయసింహుని వేడివేడిరక్తమున స్నానము చేయుదునని ప్రతిజ్ఞ చేసియుంటిని; కాని నా దురదృష్టముచే ప్రతిజ్ఞ పూర్తిగాలేదు. నే నాత్మహత్య చేసికొందును."

"అయిన రేణూ నీవు నీప్రతిజ్ఞ పూర్తిచేసికొమ్ము—నీయెదుట నాకంఠ మానతమైయున్నది."

రేణుక ఉదయసింహుని శిరమును, తన ప్రేమహస్తముతో నిమురసాగెను.

ఉదయసింహుడు కాతరదృష్టితో ఆమెను పరికించెను. భక్తిశ్రద్ధలుప్పొంగ ఆమె వానిపాదములను స్పృశించి యిట్లు పల్కెను. "నా ప్రథమప్రతిజ్ఞ నీ సౌందర్యపిపాసయందు సమాప్తమైపోయినది—యిక రెండవప్రతిన మిగిలియున్నది."

"అదియేమి ?"

"ఆత్మహత్య."

"ఏమి................ఆత్మహత్యయా ?
నీ వాత్మహత్య చేసికొనెదవా ?"

"అవును."

మిణుకు మిణుకు మను ఆ దీపపుకాంతిలో ఉదయసింహుడు రేణుక కరపల్లవమును గ్రహించెను. అతడు "రాజకుమారీ?" అని వ్యాకులతతో పలికెను.

"నేను రాజకన్యను గాను! విశ్వాసఘాతకురాలను. నేను నా ప్రియజనకుని ఆత్మవిషయమున భయంకర కృతఘ్నత నాచరించితిని."

"ఇది నీ పొరపాటు రేణుకా నీ వాత్మహత్య చేసికొనవద్దు. నే నన్నివిధముల నీవాడనే."

"అయిన నాతో రమ్ము" రేణుక నేత్రముల నుండి బొటబొట కన్నీటిచుక్కలు పడసాగెను.

కారాగారము శూన్యమయ్యెను. ప్రేమోన్మాదిని యైన రేణుక నిర్జనమార్గమునందలి మెలికలు తిరిగిన సందులలో ముందుముందు నడచుచుండెను. ఆమె వెనువెంట మంత్రముగ్ధునివలె రాజకుమారు డుదయసింహుడు.

## ౪

ప్రపంచలీలయే యింతే.

మనుష్యజీవనము నవలలోని కథగాక మరేమి? ఉదయరాగ మెల్లెడల వ్యాపించుచుండెను. శీతల వాయుతరంగములు — కుసుమాప్సరోరమణులసానంద నృత్యము—అహో! సౌందర్యమును విరజిమ్ముచుండెను.

మాధవపుర పరిసరప్రదేశమున............—
రేణుక నిలువబడి "చాలు, యింతవరకే! రాజకుమారా పవిత్ర రాజధానినిం బ్రవేశింతువు గాక, నే నిక నీవెంట రాజాలను."

"ఎందులకు రేణూ?"

రేణుక మాటాడలేదు.

ఉదయసింహు డాశ్చర్యముతో నామె ముఖము చూడసాగెను.

"పితృ హంతకుడా!!" రేణుక ఉత్తేజిత కంఠస్వరంబున యిట్లు పల్కెను. "నీవు శీఘ్రముగ నిట నుండి వెడలిపొమ్ము. నే నాత్మహత్య చేసుకొందును." ఏవగింపుచే ఆమె తన ముఖమును త్రిప్పివైచికొనెను.

"నేను నీ తండ్రిగారి హత్య చేయలేదు, రేణూ!" ఉదయసింహుని కనులనుండి కన్నీరు కారసాగెను.

అతడు వ్యాకులస్వరముతో — "హత్యచేసినది నా తండ్రిగారి ప్రతిహింస,—తీక్ష్ణఖడ్గధార,—నీ సౌందర్యయాకర్షణము,—నా దురాశాపాశము!"

"మహారాజా"

"రేణూ?"

రేణుక తన వక్షస్థలమును ఖడ్గధారతో పొడిచివైచుకొనెను.

ఉదయసింహుడు హాహాకార మొనర్చెను. నఖావిద్ధసారంగమువలె నామె యాకలిగొన్న-బెబ్బులివంటి మృత్యుదేవత యంకతలంబున గిలగిల తన్నుకొనసాగెను.

రక్తధారచే యిరువురు తడిసిపోయిరి.

"రాజకుమారా! నాకరమును గ్రహింపుము" అని రేణుక మరణబాధచే గిలగిల తన్నుకొనుచు యిట్లు పలికెను.—"మన వివాహమున కిదియే శుభముహూర్తము! రక్తస్రోతస్సుయొక్క ధార, నీకు జయమగు గాక."

ఉదయసింహుని దక్షిణహస్తము రేణుక వామ కరంబును గ్రహించెను.

రేణుక తన విస్ఫారితనయనముల నుదయసింహుని ముఖమండలమును తిలకించుచుండెను. అతనిముఖమున సౌందర్యపిపాస తొలుకాడుచుండెను.

ఉదయసింహుడు "రేణూ!" అని పెద్దపెట్టున కేకవైచెను.

కాని యొకటనున్నది రేణుక? రేణుకయనగా ఎవరు? అతనిమాట వినువా రెవరును లేకపోయిరి.

ఉషాలక్ష్మి సౌందర్యము లంతమైపోయెను.

ప్రాతఃకాల. స్వర్ణమయకిరణములు క్రమక్రమముగ పృథ్వీతలముపై దిగివచ్చెను. శరాఘాతహరిణమువలె అపరాధియగు రాకొమరు డాసమయమున తనప్రియురాలి వక్షస్థలమున ముఖముంచి పడియుండెను.

అతడు సజీవుడా? నిర్జీవుడా? ఏమియు తెలియకుండెను.

ఇంకను సౌందర్యపిపాస వాని యధరమున దాండవించుచుండెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

(అనువాదము)

## దేశభక్తి

"అయ్యదియెనేను జన్మించి నట్టిపుడమి
అల్లదిగో! నన్నుగన్నట్టితల్లి" యనుచు
మనసు నుప్పొంగబోవని మనుజుడెపుడు
శవసమానంబు! దానిదౌ జన్మమేల?
దేశదేశము లెన్నియో తిరిగితందకు
ఆత్మదేశాభిముఖమౌ మనెడిబుద్ధి
పుట్టి నెమ్మదికలఁగని పూవుబోడి
శవసమానంబు! దానిదౌ జన్మమేల?

శ్రీమతి యస్. అనసూయ గారు

భీరుడు లేమెమొగలవను బింకమేల?
ధనికురాలను నేనను దర్పమేల?
పరహితవు నెపుడుగాంక్షించు పడతిగామి,
శవసమానంబు! దానిదౌ జన్మమేల?
ఆమెమరణింపవగచువా రెవరులేరు
దేశమావంతయేని జంతింపబోదు
కీర్తికాయములద్దాని కార్తితోనె
శవసమానంబు! దానిదౌ జన్మమేల?

## పూవు

రంగురంగుల వింతవస్త్రములదాల్చి
కొదమతేనియ పుప్పొడిన్ కూడబెట్టి
షట్పదములనేడి యతిథిసత్సంగమునకు
ఆతిథేయంబునిడెదు గృహస్థువీవు!
చిన్నవైననువయసునఁ జెన్నుమీఱి
కమ్మతెమ్మరలల్లన గ్రుమ్మరించి

శ్రీమతి యస్. అనసూయ గారు.

తావులై తీవ్రపశంసకు; "పూవుపుట్ట
గనెపరిమళించు" ననుటను వినమెమనము!
పూజసమయాల దేవునిమూర్ధమందు
తొయ్యలులసొగసుఁ గుల్కు లేదురుములందు
పూవ! గ్రాలుచునుందువే ప్రొద్దునందు
బాపురే! నీదుజాతకఫలమదేమొ!

# ధర్మపత్ని

పి. వి. రామచంద్రమూర్తిగారు, బి.యే.

మొగలాయి సామ్రాజ్యాధిపతియగు బేబరు మరణశయ్యనుండి, తన సుతులలో జ్యేష్ఠుఁడగు హుమయూను చక్రవర్తి గావలెనను దన యభీష్టమును వెల్లడిజేసెను. తండ్రి యిష్టానుసారము హుమయూను సింహాసనమధిష్ఠించెను కాని అతని యనుజుఁడగు కేమ్రను అతని పెక్కుబాధలఁ బెట్టసాగెను. కేమ్రను, అన్నయగుహుమయూనును బాఱఁదోలి తానే మొగలాయి సింహాసన మాక్రమించవలెనను దురాశతో సేనల గూర్చుకొని దండెత్తిపోయెను. తమ్ముని దృష్టిపరుప హుమయూను పెక్కురాష్ట్రముల నాతని కొసగెను గాని కేమ్రను నాశకంతము లేదయ్యెను. అన్నకు శత్రుఁడగు షెర్‌షాతో కేమ్రను కుట్ర సల్పెను. తుదకా భ్రాతృద్రోహితాఁ ద్రవ్వుకొన్న గోతియందు తానే పడెను. అతఁడనుజు నెదిరింపఁ దనకుఁ దోడురమ్మని గేకర్ రాష్ట్రప్రభు నడుగఁబోయెను. కాని గేకర్‌ప్రభు వాతని బట్టి హుమయూనున కప్పగించెను.

చక్రవర్తిహుమయూను, సింహాసనాసీనుఁడై యుండెను. అమీరు లందఱును సభాస్థలి నలంకరించియుండిరి.

క్రూరుఁడును, భ్రాతృ ద్రోహియునగు కేమ్రనునకు మరణదండన విధించవలయునని అమీరులలో ముఖ్యులెల్లరు తమ యుద్దేశమును చక్రవర్తికిఁ దెలియజేసిరి.

వారి యభిమతమును గ్రహించినప్పుడు చగ్రవర్తి వదనము విషాదావృతమయ్యెను. అతఁ డమీరులతో 'సామంతముఖ్యులారా! నాయనుజున కట్టి కఠినశిక్ష నెట్లు విధింపగలను?' అని పలికెను.

అమీరులెల్ల రాగ్రహముం దెలుపుచు సణుగుకొనఁజొచ్చిరి. వారంద ఱేకగ్రీవముగ కేమ్రను మరణింపవలెనని కోరినపుడు చక్రవర్తి యేల యన్యథాప్రవర్తింపవలెను? ద్రోహియగు సోదరునిపైఁ బగదీర్చుకొనుటకు మాఱుగా హుమయూను కనికరమును భ్రాతృవాత్సల్యమును జూపినప్పు డాతడు గుండె దిటములేనివాఁడని వారందఱును నిందింపసాగిరి. కేమ్రనుకన్న కొలఁది యపరాధములు చేసినవా రందఱును మరణశిక్ష విధింపఁబడినప్పు డనేక ఘోరకృత్యములు గావించిన యాతఁడేల మడియరాదు? అమీరులలో నొకఁడు లేచి, చక్రవర్తిని సమీపించి యిట్లు పలుకసాగెను.

“ప్రభూ! సోదరుఁడని కేమ్రనుపై దయఁ జూపరాదు. వీఁడు ప్రజలఁ బెట్టిన బాధలు వర్ణనాతీతము. వీఁడు రాజద్రోహియు భ్రాతృద్రోహియునై బెక్కు నేరము లొనర్చినాఁడు. దేవరసైన్యములఁ బీడించెను. మీ రాష్ట్రముల నాశముఁ జేసెను. మీ పాలనయందలి జనుల భయకంపితులఁజేసి పలువిధముల నవమానించినాఁడు. నీ సోదరుఁడగు హిండల్‌రాజకుమారుని మరణమున కితఁడే కారకుఁడు. నీరాజ్యమందుఁ గలిగిన సంక్షోభములకెల్ల మూలమితఁడే. ఇట్టి హంతవ్యులు బ్రతికియున్నచో మీ

రాజ్య మభివృద్ధిగాంచనేరదు. దేవర యభ్యుదయము గోరు మేమెల్లరమును, వీఁడు వధింపఁబడవలెనని తెలుపుచుంటిమి."

సభనున్న సామంతులెల్లరును క్రేమను యొక్క క్రౌర్యమును జవిఁజూచినవారే. వారందఱును నుద్రేకమును వెలియుబఱచుచు "ద్రోహి చావకతీర"దని బిగ్గరగ నైక్య కంఠమున నఱవసాగిరి.

అందులకుఁ జక్రవర్తి "అమీరులారా, మీరు వచించినదంతయు సత్యము. నా సోదరుఁడగు క్రేమను పలువిధములగు ఘోర కృత్యము లొనరించి, నాకును మీకును హాని యొనర్చినాఁడు. కాని యాతఁ డొనర్చిన మహాపాపముల కెల్లఁదగినఫలితమును నాతని యనుజుఁడనగు నే ననుభవించితిని. మకుటమును గోల్పోయి, తిన్నచో శయనింపక, పరున్నచోఁ గునుకక, దేశద్రిమ్మరినై పలువెతలపాలైతిని గదా?" అని సమాధాన మియ్యఁబోయెను. కాని యాతఁడు ముగించకుండగనె "మహనీయుఁడగు హుస్సెయిన్ కూలి సుల్తాను తనకుఁజిక్కి ఖైదీయైయుండగా క్రేమ నాతని నతిక్రూరముగ హత్య గావించలేదా?" యని యొక యమీరడిగెను. "గౌరవనీయుఁడగు టాబీజబేగ్‌ను చిత్రవధను గావించినదెవరు?" అని యింకొకఁడు గద్దించి యడిగెను.

సభామందిరమంతయుఁ గలకలముతో నిండెను. "క్రేమను చావకతీరదు" అను వాక్యము వినవచ్చెను.

హుమాయూను గద్దెనుండి లేచి బిగ్గరగా నిట్లనెను. "క్రేమను ప్రాణముల నేఁ దీయ వీలులేదు. మా జనకుఁడు బేబరు మరణించుచు నా తమ్ముల నెల్లప్పుడును రక్షించవలెనని నాకు శాసించినాఁడు. మరణించిన వారి యంత్యమనోరథము దీర్చుట నా విధి. కనుక క్రేమనునకు మరణదండన విధింపఁజాలను."

అమీరు లావాక్యములాలించి యేమియుఁ బలుకనేరరైరి. కాని చిఱచిఱలాడువారి వదనములం దసంతృప్తి గానఁబడుచుండెను.

చక్రవర్తి వెండియు నిట్లనియెను. "క్రేమను ప్రాణములఁ దీయింపనంటిని. గాని యాతని దుష్ప్రవర్తనకుఁ దగిన శిక్ష నాతఁడు పడయకపోఁడు." హుమాయూను మే నొక్కమాఱు కంపించెను. ఆతఁ డొక్కక్షణ మూరకుండి కంఠమును సవరించుకొనుచు, "క్రేమను ఇకముందు సేనలఁ బ్రోగుచేసి చక్రవర్తి నెదిరింపఁజాలఁడు. ఆతని కుట్రలుగాని మాయోపాయములుగాని యిక ఫలింపవు. కాబూలు పర్వతములం దతివైభవముతో నుదయించు సూర్యు నింక నాతఁడు గాంచనేరఁడు" అని వచించెను. అమీరులు వ్యాకులచిత్తులై యొండొరుల ముఖములఁ జూచుకొనసాగిరి. "చక్రవర్తి సోదరునకు విధింపఁబోవు శిక్ష యేమి? యావజ్జీవమాతని చెఱయందుంచునా? లేక ద్వీపాంతరవాసశిక్ష విధించునా?" అనివా రాలోచింపసాగిరి.

"రాజద్రోహియైన క్రేమనుయొక్క నయనములు పెఱికివేయఁబడును. నేటి సభ ముగిసినది" అని చక్రవర్తి పలికి, గద్దెను దిగి, అటునిటు జూడక, ఎవరితోను ప్రసంగిం

పక తిన్నగా రాజసౌధమునకుఁబోయి యదృశ్యుఁడయ్యెను.

చక్రవర్తిసోదరుఁడగు క్రేమను, భటులచే నప్రమత్తతతోఁ గావలి కాయఁబడుచున్న గుడారమున, నాందోళిత మనస్కుఁడై తన కర్మమునుగూర్చి దలపోయుచుండెను. అతఁడు చక్రవర్తికిఁ జాల జాబుల వ్రాసెను. వానియం దాతఁడు తాను జేసిన నేరముల నెల్ల నొప్పుకొని చక్రవర్తిని దయఁ గావుమని ప్రార్థించెను. హుమయూనుకు శైశవక్రీడల జ్ఞప్తికి రావించెను. సోదరులెల్ల రైకమత్యముతో నుండవలసినదను జనకునాజ్ఞ సూచించెను. తండ్రియభీష్టము నాతఁ డాదరింపనందులకుఁ గుందుచు, అన్నను జనకుమనోరథ మీడేర్పుమని బ్రతిమాలెను. కాని హుమయూను సమాధానమును వ్రాయజాలఁడయ్యెను.

తన యగ్రజుఁడు తన్ను క్షమించి విడుచునా? లేక తన మరణమునకై యెదురు చూచుచున్న యమీరుల సంతృప్తిబఱుప వధింప నాజ్ఞయిచ్చునా? సార్వభౌముఁడు దయాస్వభావుఁడు. ఐనను దన్ను బూర్తిగా క్షమింపఁజాలఁడు. మహాపాపము లొనర్చిన తన యట్టివానికి హుమయూను సంపూర్ణముగు ముక్తి నొసగినచోఁ దనకంతకన్న నెక్కుడు పరాభవము జరుగఁజాలదు.

అతఁ డెట్టి శిక్షనైన ననుభవింపకతీరదు. ఇఁక నాతడు చేయఁదగినది అల్లానామసంస్మరణమే. అతఁ డాదినమంతయుఁ బ్రార్థనయందు గడపెను.

రాత్రి పడినది. నిముసము లాతనికి యుగములుగఁ దోచెను. నిదురరాదు: ఆతనికిప్పుడు చావన్న భయముపోయినది. ఆతని కొక కోర్కె కలిగినది. తన సతీమణియగు షుజాచాక్ బీగమును గడసారి జూడ నాతఁ డభిలషించెను. తన పరిస్థితులు మాఱిపోవుచున్నవని క్రేమను గ్రహించి గేకర్ సుల్తానునొద్దకుఁ బోకపూర్వమే ఆమెను బుట్టినింటికిఁ జేర్చెను. పాప మా సాధ్వికిఁ దనకుఁ గల్గిన దుర్గతినిగూర్చిన వార్తయైన తెలిసియుండదు.

క్రేమను, తనభార్య జనకునింట సురక్షితయైయున్నందులకు, సంతసించెను. కాని యవసానమును జెందుటకు పూర్వ మాతడామెను జూడఁగలిగినచో నాతని మానస మూఱటఁజెందును. ఆమె పరమపతివ్రత. ఆమె యాతనితోఁ గష్టసుఖములఁ బాల్గొన్నది.

మఱునటిదినమున క్రేమను రాజాజ్ఞానుసార మంధుఁడు గావింపఁబడెను. వేదనఁ దెలియఁజేయు పలుకొక్కటియు నాతని నోటినుండి వెలువడలేదు. అనంతర మాతఁడు సార్వభౌమునిసన్నిధానమునకుఁ గొంపోఁబడెను సోదరునిగాంచినపుడు హుమయూను దుఃఖమును బట్టఁజాలక యశ్రులరాల్పఁదొడఁగెను. అగ్రజునిదయావిహీనతను క్రేమను నిందించలేదు. ఈవరలో నాతడు నిజసేనతో సత్యుత్సాహముఁ దెలియబఱచుచు జయభేరులతోఁ దిరిగిన యాపట్టణవీధులందు మాత్ర మీ దురవస్థ ప్రాప్తించిన పిమ్మట దీనుఁడై నడచిపోఁజాలఁడు గాన వీధులలోనికిఁ దరిమి వేయవలదని హుమయూనును బ్రార్థించెను.

క్షేమను జీవితమందు సంపూర్ణమగు మార్పుగలిగినది. అతఁ డౌన్నత్యపదవులఁ గోరఁడు. అతనికిఁక జయకాంక్షలేదు. అతని మేధ మాయోపాయముల నన్వేషింపఁ బూనదు. అతని హృదయమంతయు విషాదావృతమయ్యెను. పశ్చాత్తాపమాతనికి దుర్భర వేదనఁ గలుగఁజేయుచున్నది. అతఁడు మెక్కాకుఁ బోయినచో మానసమునకు శాంతి యొనగూడునని తలచెను.

కాని యాయంధుని మెక్కాకుఁగొని పోఁగల యాప్తులెవ్వరు? అతఁడు సిరిసంపదలతోఁ దులతూగు సమయమున నాతని స్తోత్రపాఠములఁజేసెడి వారిలో నొక్కఁడును నాతని మెక్కాకుఁదీసుకుపో ముందంజ వేయఁడయ్యెను. తుదకు రాజకుటుంబముపై భక్తిగౌరవములుగల షిల్మికోకాయను నాతఁడేగుదెంచి ముసల్మానుల దివ్యస్థానమునకు క్షేమనును దీసుకుపో నిశ్చయించుకొనెను.

క్షేమను, మెక్కాకు బయనమై పోవుటకు పూర్వము, తన కనుకూలవతియై మనసులో వర్తించిన భార్యతో సంభాషింప నభిలషించి యామెగలచోటికిఁ బోయెను.

ఆమెజనకుఁడు, సింధుదేశమున నొక పాలకుఁడు. అతఁడు తన యల్లునకు సంభవించిన యవస్థనుగాంచి కడుదుఃఖించి తన రాజభవనాంతరముల నివసించుచు జీవితశేషము నంతనుగడప నిచ్ఛగించెను.

ఆతని నిశ్చయమునుగాంచి క్షేమనువతీమణి తానుగూడ నాధుననుసరించి పోదునని తెలియఁజేసెను.

శైశవమునుండియు దివ్యప్రాసాదములందుఁ బెరిగి సుఖముల కలవడి పరిచారికలసేవలఁగొను నాకోమలాంగి పతితుఁడై యంధుఁడై కాలముగడప మెక్కాకుఁబోవునాధు ననుసరించి యెట్లు పోఁగలదు? ఆపెజనకుఁ డందుల కియ్యకొనఁడయ్యెను. 'నీవిల్లుకదలరా'దని యాతడు కుమార్తెకు త్తరు విచ్చెను. ఆమెయుఁ దనమనోనిశ్చయమును మార్చుకొన్నట్లగపడెను. క్షేమను జీవితమంతయుఁ దిరిగి ధ్వాంతమయమయ్యెను. ఆతని హృదయమున నూతనముగఁ జిగిర్చిన యాశాలత సమూలముగ బెకికివేయఁబడెను.

క్షేమను రాజ్యమును గోల్పోయెను. అతఁడు దారుణమగు శిక్షకులోనై, నేత్రములఁ గోల్పోయెను. ఐనను గర్మమనుభవింపక తీరదనుకొని యాతఁడు ధైర్యమును బూనెను. కాని భార్యనుగూడఁ గోల్పోవుచున్నాఁడని యాతఁడు గ్రహించినప్పుడాతని శోకమునకు మేరలేదు.

అతఁడు మెక్కాకు బయలుదేరిపోవలసినదిన మేగుదెంచినది. కడసారి యాతఁడామెతోఁ బ్రసంగింపఁగోరెను. ఆమె దుఃఖమగ్నయై యెవరిని జూడనభిలషించుటలే దను సమాధాన మాతనికివచ్చినది.

ముతుకగుడ్డల ధరించి, యాత్రికుఁడై, విశ్వసనీయుఁడగు షిల్మికోకాభుజము నాధారముగఁగొని, జేబరు సార్వభౌముని కుమారుఁడు మెక్కాకుఁ బయనమయ్యెను.

అతనికై నావనొకటి జనసమ్మర్దములేని ప్రదేశమున వేచియున్నది. అతఁడును పత్నీ కోశాయును నావలెక్కిరి.

ఆహా! ఏమిది? అతిదయార్ద్రహృదయముతో వచ్చి, యాతనికేలుపట్టి 'ధైర్యమును గోల్పోకుము' అని మృదుల కంఠస్వరమున బలుకునామె యెవరు? కొన్ని గడియలకుఁ బూర్వ మాతఁడు రాజ్యలక్ష్మితోఁ బాటు వీడిపోయిన దనుకొన్న ప్రేమరాజ్యలక్ష్మి యనఁదగు ష్యూకాక్ బీగము. "మనమిరువురము గలసి యాత్రకుఁబోదము. మన మిరువురముగలసి మెక్కాయందు శాశ్వతానందసౌఖ్య మనుభవింతము. ఇట్టి స్థితియందు మి విక్కట్టుల పాల్జేసి, నేను రాజప్రాసాదముల నతివైభవముతోఁ గాలము గడపుదు ననుకొంటిరా? మీ జీవితమునంగల సుఖములఁ బాల్గొన్న నేను కష్టములన్న వెఱతునా?" అని యామె పలుకసాగెను.

జనకుఁడు, ష్యూకాక్ బీగము మగని ననుసరించిపోవుచున్నదని గ్రహించి, యామెను గొనితెమ్మని సన్నిహితు నొక్కనిబంపెను. ఆమె యింటికిఁ దిరిగిపో నిచ్ఛగింపదయ్యెను. రాజున కాగ్రహము మెండయ్యెను. అతఁడు జనకుఁడు. అంతియకాదు! అతఁడు పాలకుఁడు! అతనియాజ్ఞ నామె ఉల్లంఘించెను. అతఁడు స్వయముగా నదీప్రాంతమున కేఁగుదెంచి, యామెను 'మరలిరమ్ము' అని యాజ్ఞాపించెను. అందులకామె, "తండ్రీ, క్షేమమునురాష్ట్రాధిపతివై, యఖండవైభవోపేతుడవై యున్నపు డాతనికి నన్నిచ్చి పరిణయముగావించితివి. ఈత డిప్పుడు పరిచారపరివృతుడు. ఈతని కిప్పుడు నాసాహాయ్యమవసరమే లేదు. ఇప్పుడన్న నీతఁడు పతితుఁడు. అంధుడు. ఎట్టివాఁడైన నీతఁడు నా నాథుఁడు. ఈతని యర్ధాంగినినేను—ఈతని కష్టసుఖముల బాల్గొనవలసినదానను. నామేన నుసురు లున్నంతకాల మీతని ననుసరించి ఈ యంధునకు నేత్రద్వయమునై యుపచారము సేతును" అని పలికెను.

ఆ సాధ్వీమణిపలుకు లామె జనకునకుఁ దలవంపులు దెచ్చినవి. అతడేమియు ననఁజాలక మరలిపోయెను.

ష్యూకాక్ బీగమును దాను బలికిన పలుకుల నెఱవేర్చుకొన్నది. ఆమె క్రమమును నొక్క క్షణమైన నెడబాసియుండలేదు. అతని వీడిపోయిన వైభవములగూర్చి యాతని కెప్పుడును జ్ఞప్తికిరానీకుండజేయ నామె ప్రయత్నించినది. అత్యుత్సాహముతో నాయువతి నాథుని కష్టములందుఁ బాల్గొన్నది. హేయమై దుర్భరమైన నాథుని జీవితమున కానందముగొల్పగలిగిన ష్యూకాక్ బీగము నారీలోకమునకెల్ల మార్గదర్శని యైనది.



# ప్రాగ్దేశపుస్త్రీల ప్రబోధము

శ్రీమతి యల్. సరస్వతీబాయిగారు

## ఈజిప్టు

ఈజిప్టులో మూడువందల సంవత్సరములనుండి పరదాలవెనుక బంధితులైయున్న స్త్రీలు నేడు విమోచనమునొంది సంతోషముతో సంచరించుచున్నారు. సంతోషావహమగు సూర్యకాంతి, యింపు గొలుపు పచ్చికబయళ్లు, శృంగారవనములు, అద్భుత దృశ్యములు, విందువేడుకలు గాంచి, అనుభవించి, ఆనందించు సౌభాగ్యము తరతరములనుండి ఈదేశపు స్త్రీలకు లేకుండెను. అట్టి దౌర్భాగ్యము నేడు తొలగిపోయినది.

## పరదాలు కూలుట

సుమారు 15 సంవత్సరముల క్రిందట ఒక యద్భుతమగు జాతీయావేశము ఈజిప్టును మొదలంట నూపివైచెను. వృద్ధులు, యువకులు క్రైస్తవులు, ముసల్మానులు అందఱు నీయావేశపూరితులై స్వార్థము, కుంచితస్వభావము, క్షుద్రలాభములను నిరసించి, ఈజిప్టుదేశ స్వాతంత్ర్యమునకు బూనుకొనిరి. ఈ ఆవేశమే స్త్రీలనుగూడ నావహించెను. విదేశప్రభువుల దుండగము, దేశీయప్రజల దాస్యము, జాతీయనాయకులశిక్షలు వారు మౌనముదాల్చి చూచుచు నూరకుండలేకపోయిరి. తుదకు జగులుల్ పాషాగారి నిర్బంధన సందర్భమున పురుషులతోబాటు స్త్రీలుకూడ తమ దృఢమగు అసమ్మతిని దెలుపుటకై దట్టమగు ఆచ్ఛాదనముల (Veils) ధరించి, గుంపుగూడి, వీధులలో నూరేగింపుజరిపిరి. పోలీసువారు వచ్చి యీ యూరేగింపును చెదరగొట్టిరి. కాని యా శుభదినమును మాత్రము స్త్రీలు మఱువలేదు. ఆనాటి ఆవేశము చల్లారలేదు. నాడు వీచిన స్వాతంత్ర్యవాయువు వారి యింద్రియములన్నిటిని లేపివేసెను. మూకీభావము వహించిన వారి చిరకాలపు కోరికలు, జీర్ణించియున్న వారి జాతీయభావము, ఒక్కుమ్మడి చెలరేగి వారిని శక్తిస్వరూపిణులుగ మార్చివేసెను. "ఇకమీదట మేము సాంఘికముగను, రాజకీయముగను దాసులమై యుండము" అని వారు దృఢసంకల్పము గావించుకొనిరి. దానితో వారి శృంఖలములు తెగిపోయెను. వారి కారాగారములు కూలిపోయెను. ఇంటిలో రాణి సంఘమున గౌరవాదరముల కర్హతగల వ్యక్తియని నాటినుండి పాటింపబడుచున్నది.

## నేడు

రానురాను తలనుండి కాళ్ళవఱకు వ్రేలుచు, శరీరాంగమును గప్పుచుండు బురకాలు వాడుకనుండి తొలగిపోయెను. ముఖమునుమాత్రము పూర్తిగ మరుగుపఱచు మూడుపొరల ఆచ్ఛాదనమును వారు ధరింప బూనిరి. ఇదికూడ క్రమేణ యువతులు విసర్జించి కండ్లగుపడునటుల, ముక్కుమీదనుండి మెడవఱకు నొక దళసరి, తెల్లని ముసుగును ధరింపమొదలిడిరి. నేడీ దళసరి ముసుగుకూడ మాని సన్నని మస్లిను మేలి ముసుగును ధరించుచున్నారు. ఆధునిక భావవైఖరి ప్రబలినవారి యిండ్లలో నీముసుగు కానవచ్చుట చాల అరుదు. రాజనగరులలోను, కచేరీలలోను, పూర్వాచారగృహములలోను, నీముసుగు మర్యాదకుగా నుపయోగించుచున్నారు.

## జనానా రమణులు

ఉన్నతతరగతులకు జెందిన పాషాలకుటుంబములలో పూర్వాచారదాస్యము చాలవఱకు విలోపించినది. ఆధునికవిశాలభావములు వీరిలో మెండు. ఈ తరగతి నారీమణులు నేడు పాశ్చాత్యస్త్రీలకెందును దీసిపోరు. వేషమందును, భాషాప్రవీణతలోను, తెలివితేటలలోను, విద్యయందును, విజ్ఞానమందును, పాశ్చాత్యరమణులతో దులదూగుచుందురు. వీరు ఇంగ్లీషు లేక ఫ్రెంచి ఉపాధ్యాయినులవలన బాల్యమున ఇంటిలోనే ఉత్తమమగువిద్య నభ్యసింతురు. తదుపరి యూరపులో పేరుగాంచిన యేవిద్యాసంస్థలోనో రెండు మూడేండ్లు గడపెదరు. అచ్చట నున్నంత

కాలము యూరోపియను సాంఘిక జీవనములో పూర్తిగ పాల్గొందురు. నానాటికి మారుచుండు వింతవింత ప్యారిసునగరపు వేషములను ఎట్టి సంకోచము లేక సంతోషముతో, సలక్షణముగ నవలంబింతురు. అచటి యద్భుత నాటక ప్రదర్శనములకు బోయి, పాశ్చాత్య గానము, నృత్యము, కళలనుగని, విని ఆనందించుచుందురు; సాంఘిక సమావేశములలోను, పమిష్టి నృత్యములలోను, పాల్గొనుచుందురు; సాయంకాలపు వేళ నదులపై నావలలో విహరించుచుందురు; ఉద్యానవన విహారములకు, కళాప్రదర్శనములకు, స్త్రీ పురుష మిత్రులతో బోయి సంతసించుచుందురు; ఇట్లు యూరోపియను జీవితము గాఢముగ ననుభవించి, దానిలోతు పాటును బాగుగ నెరుగుదురు. తదుపరి ఈజిప్టునకు బోయినతోడనే విదేశవేషము, భాష, వర్తనము విసర్జించి గృహమును తమ కార్యరంగముగను, బంధువర్గమును తమ సంఘముగను, సంసారమే పరమావధిగను నియమించుకొని, కాలము గడపుదురు.

### కెమాలుపాషా — షాఫౌదు

టర్కీలోని విచిత్ర సాంఘిక పరివర్తనము ఈజిప్టు స్త్రీల దృష్టిపై ఖరిని నిగూఢముగ మార్చుచున్నది. కెమాలుపాషా ఒక్కసారి పరదాలనూడదీసి, మునుగుల నెగురగొట్టి, బహు భార్యాపద్ధతి నణగద్రొక్కి, సాంఘిక జీవనమున సర్వతోముఖమగు స్వేచ్ఛ ప్రసాదించెను. ఈ నూతన విశాలజీవనము, నూతన స్వేచ్ఛ ఈజిప్టు దేశపు రమణులలో క్రొత్తకోరికలు, క్రొత్త యాశలు పుట్టించినవి. కెమాలుపాషా భావములు, ఆశయములు ప్రతి స్త్రీ హృదయములోను బహిరంగముగనో, రహస్యముగనో, మెలగుచున్నవి.

ఈజిప్టు దేశపు ప్రభువు షాఫౌదు, ఈ విషయమున భిన్నమగు అభిప్రాయమును కలిగియున్నారు. వారు స్త్రీల లోనిట్టి ఆకస్మిక పరివర్తనమునకు సమ్మతింపరు. క్రమేణ సంఘములోని మార్పులు జరుగవలెనని వారి యభిమతము. అందుచేతనే యాతడు తనరాణి మునుగుదీసి బహిరంగముగ సంచరించుటకు నియ్యకొనలేదు. ఇది తీవ్రవాదులకు నచ్చకపోయినను ఈజిప్టు దేశపు ప్రజాసామాన్యముయొక్క భావపైఖరి కనుగుణ్యముగనున్నది. ప్రజలను, క్రమముగా సంస్కారపద్ధతులతో బరిచయ మొనరించి, తాను మార్గదర్శకుడై యుండి అల్లనల్లన క్షేమమార్గమున, వారిని నడిపింపనీతని యభిమతము.

### నాయకులు

టర్కీలో తమ సోదరీమణులు గాంచినంతటి యభివృద్ధిని ఈజిప్టులోని స్త్రీలింకను బడయలేదు. కాని యందులకై మొక్కవోని యత్నములు జరుగుచునే యున్నవి. అవి యచిరకాలములో సఫలములు కాకమానవు. ఈ దేశపు వనితలకు నాయకురాలు మేడేము ఖుదాషీరావుపాషా. ఈమెయందు హృదయరంజకమగు వర్తనమును, విశాలమగు విజ్ఞానమును, ప్రబలమగు కార్యధురీణతయుం గలవు. ఈమె కైరాలో తన భవనమునకు మేధావంతులగు పురుషుల నాహ్వానించి అనేక ముఖ్య విషయములపై చర్చలు జరపుచుండును.

ఈజిప్టు వనితోద్యమమునకు మేడేము వకీఫ కార్యదర్శిని. కొలది సంవత్సరములక్రిందట ఈమె సిరియాలోని బేరూటు నగరమున అమెరికనులచే స్థాపింపబడిన విశ్వవిద్యాలయములో ప్రవేశించెను. ఇట్లా విద్యాలయములో జేరిన మొట్టమొదటి ముసల్మాను యువతి యీమెయే. అచ్చట తమ సహపాఠుల కెందును తీసిపోక నాలుగేండ్లు విద్య నభ్యసించి తదుపరి కొలంబియాకుం బోవ సమకట్టెను. కాని ఈజిప్టు ప్రభుత్వమువా రనుజ్ఞనొసగకపోవుటచే ఈజిప్టులోనే నివసించి స్త్రీల యభ్యున్నతికై పాటుబడుచున్నది.

### ఆశయములు

ఈజిప్టుస్త్రీలు తమ ప్రణాళికలో ననేక విషయములను జొప్పించియున్నారు. పురుషులతో సమానముగ బాలికలకుగూడ నిర్బంధప్రాథమిక విద్య గోరుచున్నారు; వారి దేశములోని అలఅజహారు విశ్వవిద్యాలయమును ఆధునిక పద్ధతులపై నడుపవలె

నరసాపురం లేడీసు క్లబ్బువారు
శ్రీమతి కస్తూరి కామేశ్వరమ్మగారికి వీడ్కోలునొసగుట



పూనాదగ్గరనొక ముద్రణాలయములో పనిచేయుచున్న హైందవవనితలు.



శ్రీమతి పుత్సల సుశీలాదేవిగారు

వీరు విజయనగరం యం. యం. స్కూలులో మూడవ ఫారమున చదువుచున్నది. ఈమె శ్రీ విద్యనుగూర్చి యిచ్చిన యుపన్యాసము గత సంచిక యందు ముద్రింపబడియున్నది. దీనికి ప్రథమ బహుమాన మియ్యబడినది. ఈమె వయస్సు 13 సంవత్సరములు.



శ్రీమతి వేపా సరోజినిగారు

నర్సాపూర్ ప్రోగ్రెసివ్ యూనియన్ వారి పరీక్షలో సీయము కొందటి తరగతియం దుత్తీర్ణురాలైనది. ఈమె భీమునిపట్నం ఉన్నత పాఠశాలయందు నాల్గవ ఫారములో చదువుచున్నది. ఈమె వయస్సు 12 సంవత్సరములు.

నని వాదించుచున్నారు; నడవడిలో పురుషులకును స్త్రీలకును ఒకే నీతి యుండవలెనని నిర్బంధించుచున్నారు; పురుషులు బహుభార్యలను వివాహమాడకూడదను శాసనమును మొన్నటి దినములలోనే సిద్ధపరచిరి. కాని కొరాను నలుగురు భార్యలను అనుమతించుటచే కొరానుకు విరుద్ధముగ నా చట్టమును శాసింపజాలరైరి. కాని అట్టి శాసనము బయలువెడలువరకు వేరొక భార్యగల పురుషునకు తమ బిడ్డలనిచ్చి వివాహము చేయమని తీర్మానించుకొని తదనుగుణ్యముగా వర్తించుచున్నారు.

## భారత దేశము

టర్కీ, ఈజిప్టుయందువలె మన దేశములోకూడ రాజకీయోద్యమమువలననే స్త్రీలకు ప్రబోధము కలిగినది. అఖిలభారతమహిళాసభలని ప్రతివత్సరము జరుగుచుండినను, వానివలన ఏ కొలదిపాటి విద్యావతులలోనో గాని తదితరులలో చలనము కలుగలేదు. కాని మొన్నటి సత్యాగ్రహమువలన స్త్రీలలో నిమిడియున్న శక్తులన్నియు ప్రజ్వలించి ప్రకటనమొందినవి. బొంబాయి నగరమునను, బార్డోలిలోను స్త్రీలు చూపిన ధైర్యము, దీక్ష, కార్యదక్షత, సహనశక్తి అత్యద్భుతములు "స్వరాజ్యమును చేరువకు గొనివచ్చి"రని గాంధిమహాత్ముడే వారిని గొనియాడెను.

అఖిలభారత మహిళాసభ కాక, ప్రతిరాష్ట్రములోను, జిల్లాలోను, నగరములోను, ఏదియో యొక మహిళాసభనుగూర్చి వినుచునేయుందుము. కాని సంవత్సరమున కొకసారి ఆడంబరముతో సమావేశమై యుపన్యాసములిచ్చి, తీర్మానములు సలిపి, వాటిని ప్రభుత్వమువారి కంపి తదుపరి నిదురబోవు మహిళాసభలవలన పామరజనుల కెట్టి లాభమును పొసగజేరదు.

అదియునుంగాక, ఈ సమాజములు నిర్మాణమందును, కార్యసరణియందును భిన్నభిన్నములై, అన్యోన్యసహాయము లేక బలహీనములై యున్నవి. కాన వీటినన్నిటిని ఒకే సంస్థక్రింద క్రోడీకరించి, నేడు భారతస్త్రీల హృదయములలో నుప్పొంగుచున్న ఆశయములను పీఠముగాగొని ఒక ప్రణాళిక సిద్ధముచేసి, కొన్ని సక్రమపద్ధతుల ననుసరించి, సంవత్సరము పొడుగునను భంగములేక కార్యము జరుగునటుల ఏర్పాటు చేయుట యత్యవసరము. ప్రతి పట్టణములోను స్థిరమగు సంస్థను నెలకొల్పియు, విరామము లేని ప్రచారము సల్పియు, విద్యాలయముల స్థాపించియు, కొఱతలేక వత్సరములకొలది కృషి సలిపిన గాని శతాబ్దములకొలది భరతసంఘమున పాతుకొని పోయిన గోషాపద్ధతి, బహుభార్యావిధానము, బాల్యవివాహము మున్నగు కీడులు నిర్మూలమొందవు.





# షేక్ హేండు ఉంగరము

శ్రీమతి వెల్లంకి శకుంతలా సరసాయమ్మగారు

పరీక్షలైన వెంటనే ఈలాగే రావలసిందని మానాన్నగారతనిపేర నొకకార్డు వ్రాసినారు. ఏప్రెలు అయిదవతేదీ సాయంకాలం అయిదుఘంటలబండిలో వచ్చెదనని ఆయను జవాబువ్రాసినారట. మానాన్నగారావార్త మాతో చెప్పడముతోటే మాకు చాలా సంతోషమువేసింది. నాగదిలోనున్న పట్లు అవి తుడిపించి, కొత్తపటాలుతో గదంతా అలంకరించేను. మార్చి 29 వ తారీకు నుండి ఏప్రెలు అయిదవ తేదీవరకు గడపడమంటే ఎన్నోవందలయేళ్లు గడుపుతే యెంత కష్టంగా వుంటుందో అంతకష్టంగావుంది. ఏప్రెలు అయిదవతేదీ ఉదయంనుంచి సాయంకాలంవరకు గడపడం మరీ కష్టమనిపించింది. సాయంకాలమైంది. మరీ ఆత్రుత లావైంది. ఏదో అర్జెంటుపనుందని నాన్నగారాదినముననే కేంపువెళ్లిపోయినారు. వచ్చే జట్కా ఒక్కటిగూడా మా యింటిదగ్గరనాగలేదు. ఎనిమిదిఘంటలుకొట్టేరు.

“అమ్మా! ఎనిమిదైంది, మరిరారు. ఇంట్లోకిరా, భోంచేసి పడుకొందాం. అప్పలస్వామిని వీధిలోకూర్చోమని చెప్పు”అని మాఅమ్మ పిలిచింది. లోపలికిపోలేను. వీధిలో కూర్చోలేను. మరొక అరఘంటసేపు వీధిగుమ్మంవద్దనే కాలక్షేపంచేశాను. ఇంకరారని నిశ్చయించుకొన్నాను. నేను మాఅమ్మ వడ్డించుకొని తింటున్నాము. ఎవరో తలుపు పిలచినట్లు వినబడింది. మాబంట్రోతు తలుపుతీసేడు. “ప్రసాదరావుగారు వచ్చినారా” అని అతనడిగేరు. “లేదుబాబు రాలేదు”అని అప్పలస్వామిచెప్పి పంపివేసినాడు. అడిగినవారతని స్నేహితులని నాకు తెలుసును. ఆయన వుత్తరంవ్రాసినారని అనుకొన్నాను. భోజనాలైనవెనుక వసారాలో మంచముమీద కూర్చొని మాఅమ్మ నేను మాట్లాడుకొంటున్నాము. “ఏకారణంచేత రాలేదో యీవేళ. ఒంట్లో కులాసాగావున్నదని వ్రాసినారా”అని మాఅమ్మ నన్నడిగింది. “మొన్న వ్రాసినవుత్తరంలో కులాసాగా యున్నట్లే వ్రాసినా”రని నేను చెప్పినాను. పదిఘంటలు కొట్టేరు. మాఅమ్మకు నిద్రవచ్చింది. నాకింకా నిద్రపట్టలేదు. “కమలా” అని పిలుపు నాచెవిబడింది. ఆశబ్దం నాకు చిరపరిచితమైనదే. ఆశబ్దం కర్ణామృతమైనది. మరల నాభావాలు ఒక్కమారుగా పైకిలేచినవి. మాఅమ్మను లేపించకుండా తలుపు గడియతీశాను. లోపల ప్రవేసించేరు. సామానంతా గదిలోపెట్టించాను. “మామయ్య లేరూ”అన్నారు. “కేంపువెళ్లినారు ఈదినమే. రేపు సాయంకాలానికి వస్తా”రని చెప్పినాను. “ఇంత ఆలస్యమేమి”అని అడిగినాను. “మాస్నేహితునియింటికిపోయి వస్తున్నా”నన్నారు. ఈవూర్లో అతనికిఒక్కరే స్నేహితుఁడు. అతడువచ్చి మాయింటిదగ్గర అడిగినాడు. ఆయనలాగ చెప్పుచున్నారు. నాకు కొంచె మనుమానంవేసింది. అనేకభావా లుదయించేయిగాని వానినెల్ల అణచుకొన్నాను. మాఅమ్మలేచింది.

"ఏమోయిపంతులూ! ఇంత ఆలస్యమైందేమి" అని పలుకరించింది, "పట్టుపంచ యిచ్చి వడ్డించమ్మా" అని మాఅమ్మ నాతోనంది. "ఇప్పుడే ఫలహారంచేసివచ్చేను, నాకాకలిలేదండీ" అని ఆయనన్నారు. "కొద్దిగా చల్లాఅన్నంతిను, లేకుంటే వేడిచేస్తుం"దని మాఅమ్మ మళ్లా అతనితో చెప్పిందిగాని అతను భోజనంచేయులేదు. "పదకొండు ఘంటలుకొట్టేరు వెళ్లి గదిలోపడుకోవోయి" అని మా అమ్మచెప్పింది. "చాలా ఉక్కగావుంది, వరండామీదనే పడుకొంటాలెం"డని ఆయునన్నారు. "మెరుపులు మెరుస్తున్నాయి, గదిలో చల్లగాగాలి వుంటుంది. లోపలే పడుకోవోయి"అని మా అమ్మ ఎంతచెప్పినా విన్నారుకారు. వరండామీదనే మంచమువేయించినాము. మా అమ్మ లోపలికిపోయింది చలివేస్తున్నాదనుకొంటున్న.

"నేను వ్రాసినవుత్తరం అందిందండీ?"అన్నా. "నాకు నిద్రవస్తున్నాది, నన్ను మాట్లాడించ"కని అన్నారు. "చెప్పే-లోపల నిద్రపోతుందా" అన్నా. "నేను చెప్పలేను." అని శాలువ కప్పుకొని పడుకొన్నారు. నాఊహాలకు మరికొన్ని తోడైనవి. ఎన్నడూ యిలాగలేదు. ఆయునతో మాట్లాడడాని కిదివరకు నాకు విసుగువచ్చేది. ఇప్పుడు పలుకే బంగారమైంది. ఆరాత్రి నాకు నిద్రలేదు. ఎన్నెన్నో భావా లుదయించినవి. ప్రయాణం బడలికవల్ల పడుకొన్నారని ఆభావాలను కొంత అణచుకొన్నాను.

తెల్లవారింది. కాఫీచేసి గదిలోనికిపట్టుకొనివెళ్ళేను. "కాఫీ చల్లారబోయునా" అన్నా. ఎలాగన్నా మాటాడించడాని కొకతెలివితక్కువప్రశ్న. "ఊ" అన్నారు. చల్లారపోస్తూ, "నావుత్తరం అందిందా"అన్నా. "అందింది కాని తిరిగి జవాబివ్వడానికి వేళలేనందున మానివేశా"నని అన్నారు. "మీనాన్నగా రెప్పుడువస్తా"రని అడిగేరు. సాయంకాలానికి రావాలన్నా. కాఫీతాగండన్నా. "నీవు వుత్తరంలో తెమ్మనివ్రాసిన వస్తువులన్నీ దొరకలేదు. దొరికినవితెచ్చా. తాళాలివిగో. సూటుకేసులో వున్నాయి తీసుకో"అని అన్నారు. నాకొక్కసారి మహానందంకలిగింది. నా వ్యతిరేకభావాలన్నీ అణిగిపోయినవి. కాఫీతాగేకచూదాం లెండిఅన్నా. కాఫీతాగేరు. "నీవుతా"గన్నారు. నేనూ తాగేను. సూటుకేసుతీసి ఒక్కొక్కటి బయుటకులాగ మొదలుపెట్టేను. "ఒకపేంటు,షర్టు"ఇస్తావా"అన్నారు. ఎంచియిచ్చేను.

ఇంకా పెట్టె తిరగవేస్తున్నా. అందులో సాముద్రికం పుస్తకం కనపడింది- ఇదెన్నాళ్లయి నేర్చుకొంటున్నారనిఅన్నా. "ఏదీ నీ చెయ్యిచూస్తా"నని చెయ్యి పట్టుకొన్నారు. "ఇదెపుడువచ్చింది? ఏదీవుంగరం చూదా"మన్నారు. తీసియిచ్చాను. "షేక్ హేండువుంగర"మెక్కడిదన్నారు. నేనేమీ జవాబీయులేదు. వుంగరాన్ని బాగాచూచేరు. నా మొగమువంక తేరిబారిచూచేరు, చిరునగవల్లా మూతి విరపుక్రిందమారింది. నిట్టూర్పువిడచి చేయివదలినారు. "తరువాతచూస్తా"ననిచెప్పేసి చేయివదలివేసినారు. చేయి

చూడండన్నా. వుంగరం నాదగ్గరపడవేసి గదివెడలిపోయినారు. పెట్టెతాళంవేసి నేను చావట్లో కూర్చున్నాను.

పదిఘంటలు కావచ్చింది. "అమ్మా మీఆయన స్నానంచేశారా" అని అమ్మఅడిగింది. ఇంకాయింటికిరాలేదమ్మా. అన్నాను. బంట్రోతును పంపమంది. ఎక్కడుంటారో తెలియదన్నా. నేను మాఅమ్మ ఇలాగమాట్లాడుకొంటుంటే ఎవరో ఒక అబ్బాయివచ్చి "ప్రసాదరావుగారున్నారా" అనిఅడిగినారు. "లేరండీబాబూ అని మా అప్పలస్వామిచెప్పేడు. "ఎక్కడికి వెళ్లినారో తెలుసునా" అనిఅడిగేరు. "తెలియదుబాబూ అతని కోసమే చూస్తున్నాం" అన్నాడు అప్పలస్వామి. "ఆయన వచ్చినవెనుక ఈవుత్తరం ఇచ్చి" అని ఒక వుత్తరంయిచ్చి ఆ అబ్బాయిపోయినాడు.

అప్పలస్వామి దగ్గరనుండి కవరుతీసికొని విప్పి చదివేను. ఇంగ్లీషున వ్రాసినారు. నాకు కొంచెమింగ్లీషువచ్చును. వుత్తరంలో, "ప్రొద్దున్న మనం ఒక్క ఘడియకూడా కులాసాగా వుండడానికి సమయం అయిందికాదు. గనుక పంద్రెండుఘంటలకు మీరు రావలయును. రాత్రి యిచటనే వుండవలయును." అనివుంది. క్రింది సంతకంచూచేను." ఇట్లు మీ ప్రియమైన శ్యామ్"అనివుంది. సంతకం, వుత్తరం చూడగనె గుండె ఝల్లుమంది. నా భావాలను మరింత పోషించినవి. ఆ వుత్తరంపట్టుకొని పరిపరివిధాల ఆలోచించుకొంటూ కూర్చొన్నా. "పదకొండుకావచ్చిం దింకారాలేదమ్మా" అంది మాఅమ్మ. లేదన్నా. ఇంతలో జోడుచప్పుడైంది. నన్ను పలుకరించకుండా పట్టుబట్టకట్టుకొని భోజనానికి వెళ్లినారు. మాఅమ్మ నన్ను భోజనానికి రమ్మంటే నాకు వికారంగావుందని చెప్పి గదిలోకిపోయి పడుకొన్నాను. భోంచేసి నన్ను మాటాడించకుండా గదిలో బట్టలువేసికొని మరల ఎచ్చటికో బయలుదేరినారు. ఆయనవెళ్లిన యింకో అరఘంటకల్లా యింకోవుత్తరం మరొక అబ్బాయి పట్టుకొచ్చేడు. అది చదివేను. అందులో "సాయంకాలం మనం మన ప్రియమైనశ్యామ్ తోగూడా షికారుపోదాం. గనుక మాయింటికి వెంటనే రావలసింది" అనివుంది. సంతకం, జాన్, అనివుంది. నాకు మరీ అనుమానం ఎక్కువైంది. పట్టుదలగల్గింది. ఆయనతో చదువుచున్న కిరస్తానీదానిపేరు కనుక్కోవాలని వుద్దేశం కలిగింది. మా లలిత అన్నకు తెలుసుకదా అని వాళ్లింటికివెళ్లేను. "ప్రసాద్" (లలితసోదరుడు) గదిలో లలితవుండడంచేత ఆగదిలోకివెళ్లేను. అతనిని "అన్నా" అని పిలవడమలవాటు. ఆయన దగ్గర నాకు చాలా చనువుగూడాను. మెల్లిగా అతన్ని దాని పేరుకనుక్కున్నా. దాని పేరు. శ్యామలాకన్య దాని తమ్ముడు పేరు జాన్. నేను ఇలాగమాట్లాడుతూవుంటే ఆయన ప్రక్కనుంచి రోడ్డుమీదనుండి వెళ్లుచున్నారు. ఆయన నన్నుచూచేరు. నేనాయన్ని చూచేను. నేనింటికివెళ్ళేసరికల్లా ఆయన ప్రయాణం సందట్లోనున్నారు. "సాయంకాలం మీమామగారినిచూచి వెళ్ళవచ్చులేవోయి"అని మాఅమ్మ అంటున్నాది.

"నేనింక ఒక్క నిముషముగూడ నుండలేనండి" అని ఆయన అంటున్నారు. "అప్పలస్వామీజట్కా తేవోయి" అన్నారు. "బాబూ సెలవలేకదా. మామయ్యగారువచ్చేక వెళ్ళవచ్చునులేండి" అని అంటున్నారు. మా అమ్మ బ్రతిమాలుతున్నాది. పెద్దగాలివాన వచ్చింది. ఎలాగో ప్రయాణం ఆగిపోయింది. మాఅమ్మ బ్రతిమాలడంచూస్తే నాకు పట్టరానికోపంవచ్చిందిగాని ఏమి అనలేదు.

సాయంకాలం నాన్నగారువచ్చేరు. అల్లుడువచ్చినారని మాఅమ్మ చెప్పింది. "ఏడమ్మా" అని నన్నడిగేరు. నేమాటాడలేదు. రాత్రి ఎనిమిదిఘంటలైంది వచ్చేరు. అల్లుడు మామ యిరువురు మాట్లాడుకొన్నారు. "ఇక్కడ రెండునెల లుండా"లని మానాన్నగారన్నారు. "నాకీ వూర్లోతోచదు. వుండడానికి బుద్ధిపుట్టలే"దని ఆయనఅంటున్నారు. మా నాన్నగారు కోపంపడ్డారు. అతను వూరుకొన్నారు.

రాత్రి భోజనాలైనవి. వసారాలలోనే మంచంవేయుమన్నారాయన. వద్దని నాన్నగారు గదిలో మంచమువేయించేరు. అల్లుడు నాన్నగారు కూర్చొని మాట్లాడుకొంటున్నారు. "నీ వుంగరంయిచ్చిందాపిల్ల" అని నాన్నగారతన్ని అడిగేరు. "ఏం వుంగరం" అన్నారతను. "అమ్మా వుంగరాలే"వని మా నాన్నగా రడిగేరు. ఇవ్వడానికి మనస్సొంప్పిందికాదు. కాని నాన్నగారడిగేరు కనుక ఒక వుంగరంయిచ్చే నాన్నగారికి. "రెండవదేదమ్మా" అన్నారునాన్నగారు "ఇదిగో" అని, వేలుదిచూపే. తీసివ్వమని నాన్నగారంటే యిచ్చేనునాన్నగారికి. 'మొన్న మీయిద్దరికి రెండు వుంగరాలుచేయించి వాటిమీద నీపేరు P. R. (పి. ఆర్.) అని చెక్కించేనుచూ"డని నాన్నగా రతనితోనన్నారు. ఆయన ఆ అక్షరాలుచూచి ఆశ్చర్యపోయేరు. కంగారుపడ్డట్టయినారు. మొఖం తెల్లబోయింది. ఏమీ నాకుతోచలేదు. వుంగరాలు రెండూ పట్టుకొన్నారు. "వెళ్ళి పడుకోవోయి" అని నాన్నగారు చెప్పిపంపివేసినారు ఆయన్ని. గదిలోకివచ్చి విచారిస్తూ ఒక్క ఘడియకూర్చొని "కోపగించుకోకు, నేను చాలా తొందరపడ్డా"నన్నారు. మాట్లాడలేదునేను. "మాటాడవా. తొందరపడ్డా.........."అనిఏమేమో అన్నారు. ఎవరుచేసినపని వారికి బాగానే వుంటుందన్నా. 'నేను తొందరపడ్డాను. ఇంకేమి చేసినాను" అన్నారాయన. "చెయ్యవలసినదంతా చేస్తూనేయున్నారు. ఇంకేమిచెప్పాలి? మానాన్నగారికి తెలియునంతసేపే... ...." అనిఅన్నా. "ఏముంది నేచేసింది" అన్నారు. కిరస్తానపుమతం చాలా మంచిదంట నిజమేనా అన్నా. ఏమతాని కామతమేమంచి దన్నారు. ఆమతంలో కలియడానికి చాలమందికి యిష్టం వుంటుంది. ఎందుకంటేధనం, స్త్రీముఖ్యంగా వుంటాయన్నా.

ప్రొద్దున్నే కాఫీత్రాగి గదిలోకూర్చున్నారు. నాన్నగారూ నేనూ చావడిలోకూర్చున్నాము. ఇద్దరు అబ్బాయిలు మాయింటికివచ్చి నాన్నగారికి నమస్కరించేరు.

"ఏమోయిశ్యామ్, ఓహో జాన్‌కూడావచ్చినాడా" అని నాన్నగారు వారిని పలుకరించేరు. నేను గదిలోకిపోయి వింటున్నాను అంతాను. "ప్రసాదరావుగారున్నారండీ" అని వారు నాన్నగారి నడిగేరు. నాన్నగారు ఆయన్ని పిలచేరు. ముగ్గురు చావట్లోకూర్చొని మాట్లాడుకొనుచున్నారు. "మేమిరువురము ఉత్తరాలువ్రాసితిమి. వచ్చినారుకారేమి నిన్న" అని వారడిగినారు. "నిన్న చికాకుగావుంటే అలాగ ఏటికిపోయినానండి. మీ వుత్తరాలు నాకందలేదండీ" అని ఆయనన్నారు. నావూహాలు గాలికి మేఘములెగిరిపోయినట్లు వారిమాటలతో యెగిరిపోయినవి. పదిన్నరకు వారు వెళ్లిపోయినారు. ఆయన గదిలోకివచ్చేరు. నాకు సిగ్గుభయంవేసింది. "క్షమించండి. నేనూ తొందరపడ్డా"నన్నా. "ఏంచేశా"వన్నారు. చెచ్చేసినానునా అనుమానంఅంతా. "నేనూ వుంగరం దాని మీదపేరు చూచి అనుమానంపడ్డా. ఆ అనుమానాన్ని మరింత దృఢపరిచింది నీవు మధ్యాహ్నం వాళ్లింట్లోనుండడం. కాని మీ నాన్నగారు వుంగరాలివ్వడముతోనే....." అన్నారాయన. "మానాన్నగారువారి నాపేర్లతోపిలవగానే......"అని వుత్తరాలిచ్చేను. "శ్యామసుందరాన్ని శ్యామ్‌అని. జగన్నాథాన్ని జాన్ అని ముద్దుకు పిలుస్తారుఅందరు. నిన్నరాత్రి జాన్ యింట్లో ఫలహారం చేశా"నన్నారు. గాలివానా పోయింది.

---

## తల్లి

శ్రీమతి పోతాప్రగడ రాజరత్నమ్మగారు

కన్నపాపని యుయ్యెల లోననుంచి
పజ్జనిలుచుండి యూపుచు పాటబాడి
నిదురబుచ్చెడి నప్పుడు నెమ్మనమున
జనని బొందెడి యానంద మదిలవంబె?

ఒడిని గూర్చుండి పాలను డడవిత్రాగి
నిముసమైనను గాకుండ నిదురఁదోగు
కన్నకొమరుని మోమును గాంచునట్టి
మాతపొందెడి సంతోష మదొలవంబె?

ఇంట బనులను జేయుచు నొంటిదగుట
తీరుబాటన నెఱుగని తరుణమందు
చిన్నిపాపడు పాలను చేపగోరి
చన్నులాసించుతరి మాత సకలపనుల

మఱచి బుడుతని యొడిజేర్చి పాణిబూని
శిరము దడవుచు కురులను చిక్కుదీసి
"ఎల్లవేళల నల్లరి పిల్లవాడ"
వనుచుబల్కెడిపల్కులో కలదుసుధయు.

# తోటమాలి

కృత్తివెంటి వెంకటసుబ్బారావుగారు, యమ్. ఏ.

సీ॥ విలుతురా? రసికహృద్వీథి సమోన్మాదాద్యతనవినిర్భిన్న కేతకీసుమమ్ము
పిలుతురా? భావసంవిత్ప్రియాసీమంతినీసూక్తిశామంతికాసుమాప్తి
నిలుతురా? ఘుమఘుమానిలదిశాప్రసృతిచేతోబహూకృతి మేల్ గులాబిజాతి
తలఁతురా? సరసహస్తతలాభిమతనవాంకూరసంతుష్టి మందారవృష్టి.

గీ॥ మచ్చులున్నవి మీయిచ్చహెచ్చుకోలఁది
రకములున్నవి మీనాగరకముకోలఁది
కలతురా గంప మీకోర్కెలుఫలింప
వలతురాతన్నివేదీఁ మీవలపుమీఱ

సీ॥ తెచ్చినాఁడ వసంతదివసాంతముల నితాంతలతాంతమల్లికాస్తబకములను
వచ్చినాఁడ నిదాఘభానుశాంతిని మేడలందు గామినులంద కుందములను,
ఇచ్చినాఁడను ప్రావృడీర్ష్యాభువిరహిదృగ్జాలమ్ములైన స్రగ్జాలములను,
గ్రుచ్చినాఁడ భుజంగకోటిసాన్వంతముల హేమంతశామంతికా సంతతులను,

గీ॥ మారుబేరమ్ముగాదిందు మాయలేదు
సొంతమడిపంట మెఱవుకాసంతలేదు,
ఒక్కనాటిదే? కలకాలముండవలయు,
మాటనచ్చినగొనుఁడు మోమోటవలదు.

# శంకరం పెళ్లి

ఎమ్. ఆర్. వి. కృష్ణరావుగారు.

టీ కప్పులు ముందరెట్టుకుని, సిగరెట్టు పీలుస్తూ 'పెళ్లి'ని గురించి ప్రస్తావిస్తున్నాం, రామూ, నేనూ.

* * *

'ప్రపంచంలో ఎక్కడైనా సరే, పెళ్లి రెండు రకాలు. మనలోవలె తల్లి దండ్రుల మారీధత్తున జరిగేవి ఓరకం. పాశ్చాత్యదేశాల్లో అమలులో వున్న వివిధతరగతి 'వూయింగు' వివాహాలు రెండోరకం. ఇందులో ఏరకానికి చెందంది మన శంకరం పెళ్లి' అన్నాడు రాము.

'ఏ శంకరం?'

'ఏరగవుటోయి. రిటైర్డు డిప్యూటీకలెక్టరు పంగ్రంగి సుందరంగారి కొడుకు? బి. యే.లో మన క్లాసుమేటు కూడాను.'

'అవును. జ్ఞాపకం వొచ్చింది. విశాఖపట్నంలో తాటిపర్తి నరసింహంగారి అమ్మాయిని పెళ్లాడాడు కాదూ! ఏరకానికి చెందకపోవడమేం!'

'అయితే నీకు దాని వివరాలు పూర్తిగా తెలియవన్న మాట!'

'పూర్తిగా ఏమిటి, అసలు తెలియదు. కాని ఆ పెళ్లినిగురించి వింతగా చెప్పుకున్నారు అంతా. ఆ వివరాలు నీకు బాగా తెలిసేవుంటాయి విశాఖపట్నపు వాడివి.'

'నేను వాడు ధన్నువిరా, లాకాలేజిలో క్లాసు మేటు కూడాను. పెళ్లిలోను చాలా చిత్రమైన పెళ్లిలే. చెపుతానువినుమరి. ఏరకమో నువ్వేనిర్ధారణచేసుకో.'

* * *

౨

తాటిపర్తి నరసింహంగారు విశాఖపట్నంలో పెద్ద వకీలు. మహారాణిపేటలో బీచివొడ్డున మంచి మేడవుంది. శ్యామల ఆయన ఏకపుత్రిక. పన్నెండేళ్ల ప్రాయంలో పెళ్లిచేద్దామని సంబంధాలకోసం వెదికారు, ఇల్లరికంవుండే అల్లుణ్ణి సంపాయిద్దామని. పిల్లని చూడ్డానికొచ్చిన ఓ పెంకిబుఱ్ఱ అది విని 'మీ అమ్మాయికి ఎవర్నైనా కుంటివాణ్ణైనా, గుడ్డివాణ్ణైనా చేస్తే మీ యింట్లో వుంటాడు' అన్నాట్ట. ఆయనకి ఆమాటలతో కోపంవచ్చి 'మా అమ్మాయికి పెళ్లే చెయ్య''నని దీక్షతో చదివించేశాడు.

పదునాల్గేళ్లకే స్కూలుఫైనలు ప్యాసయింది. మంచి తెలివైందిలే. రూపమో! రవివర్మ బొమ్మ! యింటరుకి వాళ్ల పినతండ్రి దగ్గరకి కాకినాడ వెళ్లి అక్కడ కాలేజీలో చదువుకుంది. ఆ రెండేళ్లు తల్లి దండ్రుల్ని వదిలివుండడం కొంచెం అలవాటయింది. 'అత్తారింటికి పంపినా యిల్లాగేవుండును. పెళ్లిచేసి వుంటే బాగుండును' అని విచారించి అప్పుడుకూడా ప్రయత్నించారు శ్యామలకి వివాహం చేద్దామని నరసింహంగారు— ప్రౌఢవివాహం. అనుకూలమైనది సంబంధం దొరకలేదు. శారదాబిల్లు అప్పటికింకా శాసనంకాలేదు. అమ్మాయి యింటరు ప్యాసయిందని తెలియగానే బి.యే. చదివించ నిశ్చయించారు. 'ఈలోపల శారదాబిల్లు శాసనం అవుతుంది. అప్పుడింత ప్రయత్నం అక్కర్లేకుండానే అవచ్చు వివాహం' అని శ్యామలని క్వీను మేరీసుకి పంపించారు, బి. యే.కి— మేం బి. యల్. లోకి వచ్చిన యేడన్న మాట.

మా పరీక్షలయిపోయి శలవులికి విశాఖపట్నం వచ్చేవరకూ శ్యామల పేరు వినడమేగాని, నేనైనా ఆమెను ఎప్పుడూ చూడలేదు. అంతవరకూ ఆవిడ పబ్లికు నోటీసులోకి (అనగా విద్యార్థుల దృష్టిలోకి తత్తుల్యమైన ఇతరుల దృష్టిలోకిన్నీ) రాలేదు. ఆ శెలవిలో బీచిపికార్లు చేస్తూంటే, ఫలానా అని తెలిసింది పైన వుదహరించినవారికి. అవి యూత్ లీగు రోజులు. అనగా దేశం అంతా యువజన సమితి వెఱ్ఱిలోపడిన రోజులన్న మాట. మా విశాఖ



చంటిపాపని వెంటగట్టుకొన్న
స్వీడన్ దేశపుయువతి.



“ మార్దవము-మనోజ్ఞత ”
అరబ్బీపడుచు.

ఇరువురు వరులును శ్రీ మునగాల రాజావారి పుత్రులు.

ఇరువురు వధువులు శ్రీ సి. కె. రెడ్డి, యమ్. యల్. సి., గారి పుత్రికలు.

మదరాసు క్వీను మేరీను కళాశాలలో పఠించుచున్నారు.



(ఎడమనుంచి కుడికై వరుస)

శ్రీయుత యస్. రామకృష్ణారెడ్డి, యమ్. ఎ. మునగాల కుమారరాజాగారు

శ్రీమతి కమలాదేవిగారు. శ్రీమతి సరోజిని దేవిగారు

శ్రీయుత యస్. గోపాలకృష్ణారెడ్డి, బి.ఎ. (కేంటబ్.)

పట్నంలోకూడా వొకటి ఏర్పాటుచేద్దామని కొందరు బయల్దేరి మీటింగుచేశారు. శ్యామలకూడా ఒక కన్వీనరు. ఆవేళ బాగాజ్ఞాపకంవుంది. ధాటీగా ధారాళంగా యింగ్లీషులో మాట్లాడేసరికి సభ్యులంతా ముగ్ధులై విన్నారు. ఆ వుపన్యాసంలో శ్యామల 'స్త్రీకి, తన జీవితంలో పురుషుడు తప్పనిసరియైనా పెళ్లి తప్పవచ్చు. కాబట్టి నా సోదరీమణులు, పెళ్లే ప్రధానంగా ఎంచుకోక దేశసేవకు ముందుకు రావాలి. సేవానిమగ్నులమైనయెడల వివాహం చేసుకోకుండానే శుద్ధమైన జీవితాన్ని గడపవొచ్చును' అని చెప్పింది. అప్పట్నుంచీ శ్యామల పేరు తెలియని విద్యార్థులుగాని, క్లబ్బు మెంబర్లు కాని విశాఖపట్నంలో లేరు. వాళ్ల సంభాషణలో ఎప్పుడో అప్పుడు ఆవిడ సంగతి రావలసిందే.

అప్రెంటీసు పరీక్షలయిపోగానే విశాఖపట్నం వొచ్చాం. శంకరం, వాళ్లనాన్నగారు రిటైరై ఆరోగ్యంకోసం విశాఖపట్నం వచ్చి మహారాణీపేటలో కాపురంవున్నారని చెప్పాడు. ఎక్కడున్నారో చెప్పు సాయంత్రం నే వొస్తానన్నాను స్టేషనునుంచి యింటికెడుతూ. తాటిపర్తి నరసింహంగారి యింటికెదురుగుండాను అన్నాడు.

'మంచి పొరుగే సంపాయించావురోయి!'

'ఏం? అల్లా అంటున్నావు?'

'ఏం, ఏమిట్రా! అదృష్టవంతుడవు! సముద్రంగాలే కాకుండా, స్త్రీగాలికూడా బాగా వేస్తుందిలే'

'ఎవరున్నారేంటి రా చుట్టుపక్కల?'

'వెళ్లవోయి! నీకే తెలుస్తుంది! కాని జాగ్రత్త సుమా!' అని నవ్వుతూ వెళ్లిపోయాను.

## 3

శంకరానికి పెళ్లి చేద్దామని వాని తలిదండ్రులకి అయిదేళ్లనుంచి సంకల్పం. 17వసంవత్సరంనుంచీ తమాషాగా ఎల్లాగో తప్పించుకుంటూ వచ్చాడు వచ్చిన సంబంధాలన్నీ చెదరగొట్టుతూ. ఒకపిల్లా నచ్చలేదనేవాడు. ఓపిల్లకి కళ్లు బాగుండలేదని, ఇంకో అమ్మాయి పొట్టిదని, ఓ లేమకి సంగీతంరాదని ఏవో లోట్లు ఎంచుతోండేవాడు తను మహాప్రపూర్ణుడైనట్టు. అందగాడు. లక్ష్మీపుత్రుడు. ఏంఅన్నా చెల్లింది. ఏకసుతుడవటంచేత బలవంతపెట్టలేకపోయారు సుందరంగారు నరసమ్మగారుకూడా.

విశాఖపట్నం వచ్చినవెంటనే, నేను అనకాపల్లి వెళ్లవలసివొచ్చింది. ఓవారం రోజులవరకూ అంచేత శంకరాన్ని కలుసుకోడానికి వీలులేకపోయింది. అనకాపల్లినుంచి రాగానే వాడింటికెళ్లాను. వీధిగదిలో కిటికీకెదురుగా కుర్చీ వేసుకు కూచున్నాడు. ఆమాటా, యీమాటా చెప్పుకుంటోండగానే 5-30 అయింది. 'షికారుపోదాం రా' అన్నాను. 'అరయితేగాని రానురా' అని తదేక దృష్టితో కిటికీలోంచి చూస్తున్నాడు. నేను ఓపక్కగా కూచోవడంవల్ల, వాణ్ణి అంత మైమరువజేసిన దృశ్యమేదో నాకు గోచరించలేదు.

ఏమిటోయి అల్లా చూస్తున్నావు?

'ఒరే! రాము ఇల్లారా!'

'.........................'

'ఆ అమ్మాయిని ఎరుగుదువా?'

'ఆ! శ్యామలా! విశాఖపట్నంలో ఆ విణ్ణెరగని వాడెవ్రా? వన్నె కక్కిన వనితరా!'

'ఒరే రాము! నువ్వింత ఫూల్ వి అనుకోలేదురా? కొంచెం కులాసాగా ఫ్రీగావుంటే మెడలెడతారు..........'

'శంకరం!'

'ఎందుకు?'

'నాకేసిచూడు!'

'..................'

'తిన్నగా............'

'ఎందుకోయి!'

నిట్టూర్పు విడువలేకుండా వుండలేకుండా పోయాను. చాలామంది 'ప్రేమ' అని వ్యవహరించేది ఒక జబ్బు. దాని చిహ్నాలు నిస్సంశయములు. దానితో బాధపడుతూన్న ప్రతివాడికి పత్తికళ వింతచూపు వస్తుంది. ఆచూపే శంకరం కళ్లలోను

కనబడ్డది. సర్వం తేట తెల్లమయింది.

'శంకరం!'

'ఏం?'

'ఈమధ్యన పెళ్లక్కర్లేదనే యువతీమణులు బయల్దేరారు తెలుసునా?'

'అయితే!'

'శ్యామల ఆ బృందంలో చేరింది.'

'అయితే పెళ్ళాడదంటావా?'

'నిన్నే?'

'నాకేమిరా! ఏంలోటో చెప్పు!'

'నీకేంలోటుందనికాదు. ఎవర్నీ పెళ్ళాడదట. ఆ అమ్మాయి'

'చూద్దాంకాదూ!'

'ఏమిటి? ఆ అమ్మాయిని పెళ్లాడదామనే'!

'ఆ...'

'శంకరం నీకుసుఖంగా బ్రతుకుదామని లేదురా?'

'ప్రేమించిన యువతిని పెళ్ళాడకపోతే ఇక సుఖమెక్కడనుంచి వస్తుందిరా!'

'ఇంకెవ్వరూ దొరకలేదు నీకు?'

'ఇంకెవ్వరూనా! శ్యామలఏదో దైవవిధివల్ల ఇంత కాలం పెళ్ళవకుండానుంది గాని అటువంటి రూపవతి విద్యావతి, లావణ్యవతి, సుగుణఖని దేవకన్య...'

"ఆగు ఆగు...ఆగు...చాలు ఇంక వినలేను. అన్నీ నిజమే గాని, నీగతి ఏమవుతుందో తెలుసునా? ఆవిడ ప్లాటుఫారం అలంకరిస్తే నువ్వుపొయ్యిలూదుతూ పిల్లల్ని సముదాయించాలి?"

'ఇల్లాఅంటావంటే నీతో చెప్పకపొయ్యేవాడినే!'

'చెప్పావుగనుకనే నిన్ను ఆ ఆడుసింగం పంజా దెబ్బనుంచి తప్పిద్దామని ప్రయత్నిస్తున్నాను. శంకరం! నామాటవిను స్త్రీలకు వోటింగు హక్కుకూడా వస్తే శ్యామల తప్పకుండా మినిష్టరవుతుంది. అపుడు నువ్వు ఏమవుతావో తెలుసునా? మిస్టర్ శ్యామలా?'

'ఏడిశావులెద్దు. ఎంత సింగాన్నైనా, మూడురోజుల్లో మచ్చిక చేస్తానురా?'

'నీ మొహం! నువ్వా! మొన్న ఇంటరుక్లాను తలుపుదగ్గిర కొందరు ఆడపిల్లలు అడ్డంగా నుంచుంటే వెళ్లే మొహం లేనుకు నే నొచ్చిందాకా ట్రంకుచేత పట్టుకు నుంచున్నవాడివి నువ్వా? శ్యామలని మచ్చిక చేసేది?'

'ఒరే! నీతో ఇంక నే జేం చెప్పను. పెళ్ళికే నిన్ను పిలవడం!'

'నిన్ను ఆవిడ పెళ్ళాడాలిగాదుటోయి!'

౪

శంకరం యింట్లో నాకు చాలా చనువు. మేం బి. యే. రాజమండ్రీలో చదువుతోన్నప్పుడు సుందరం గారు అక్కడే వుండేవారు. తరుచు వాళ్ళింటికెడుతో చాలా చనువుగా వుండేవాణ్ణి.

మేనెల మొదటివారంలో ఒకసారి వాళ్ళింటికెళ్ళాను. శంకరం ఇంట్లోలేడు. నరసమ్మగార్ని 'ఎక్కడికెళ్ళా'డని అడిగాను.

'నరసింహంగారి యింటికి'

"ఎంతసేపయిందండి?"

'ఒకగంట అవుతుంది!'

'పిన్నిగారూ......'

'..................'

"మీ అబ్బాయి వివాహం ఏమన్నా నిశ్చయించారాండి?"

"లేదు, నీ ఎరికలో ఏమైనా మంచి సంబంధాలున్నాయేమిటి?"

'లేవండి మొన్న మీవాడు నాతో నరసింహంగారి అమ్మాయిని......'

'నేనూ అదే కోరుతున్నాను. పెద్దపిల్లయితే అయింది. ఏవంకరా లేదు. ఎవర్నో ఒకర్ని పెళ్ళాడితే చూసి సంతోషిద్దామని వుంది.'

ఈమాటలువిని నిజంగా దిగ్భ్రమచెందానంటే నమ్మరే! మూడేళ్ళకిందట ప్రౌఢవివాహం అంటే మండిపడిపోయేవారు నరసమ్మగారు. శారదాబిల్లుని, దాన్ని ఆమోదించిన వారిని చెడతిట్టారు. అల్లాంటి స్త్రీ నేడు తన కొడుకు ప్రౌఢవివాహం చేసుకుంటా

వంటే కుతూహలం పడడం కాలమహిమే. మానవ జీవితంలో శంకరం, శ్యామలలాంటి తనయులు అపూర్వశక్తుల అని చెప్పాలి. వారు సాధారణంగా తలిదండ్రుల జీవితంలో అపురూపమైన మార్పులు కలుగజేస్తూంటారు.

'ఆ అమ్మాయిని మీరు ఎరుగుదురాండి?'

'ఎరక్కేమి? మేంయిదివరకు యీ వూళ్ళోవున్నప్పుడు కాంతమ్మగారింట్లోనే వుండేవాళ్ళం. ఈ మేడ ఈమధ్యన కొనుక్కున్నారు. గాని, వీరు పూర్వం వూళ్లోవుండేవారు. శ్యామల మంచిబుద్ధిమంతురాలు. అంతచదువుకున్నా గర్వం ఎక్కడా లేదు.'

ఇక లాభంలేదనుకుని 'శంకరంతోనే వొచ్చానని చెప్పం'డని వెళ్ళిపోయాను.

*

వచ్చిన నాలుగురోజులలోనే నరసమ్మ, కాంతమ్మగార్లు తమపూర్వ పరిచయానికి మెరుగుపెట్టారు. తరుచు వీరింటికివారు, వారింటికి వీరువచ్చి పోతూ వియ్యమందితేచాలాబాగుంటుందని వొప్పుకున్నారు. కాంతమ్మగారు ఒకరోజున శంకరంతో 'నాయినా మేం ఎన్నిచెప్పినా మామాట వినదు. పెళ్ళక్కర్లేదంటుంది. నువ్వేమైనా వొప్పించకలుగుదువేమో చూడు' అని శంకరంతో అందిట. మరునాటి సాయంత్రం నరసింహంగారు శంకరాన్ని, టీకిపిల్చి, శ్యామల్ని ఎరుకపరచారు. దొరికిందిగదాఅదను అని మనవాడు ఆనాటినుంచే వూయింగు మొదలెట్టాడు. అదోచక్కనిగాధ.

రెండోరోజున సాయంత్రం శంకరం శ్యామలయింటికి వెడితే కాంతమ్మగారు మేడమీదవుంది వెళ్ళమందిట. శంకరం మందహాసవదనంతో మెట్లు పిల్లిలాపైకెక్కి తలుపుకొంచెం వొత్తిగించిచూశాడు. శ్యామల కుర్చీమీదపడుకుని చదువుకుంటూంది. కాళ్ళ దగ్గిర చక్కని కుక్కొకటి కూచుంది. శంకరం నెమ్మదిగా లోపలికివెళ్లి 'నేను మీ చదువుకు భంగం కలుగజెయ్యడం లేదుగద!' అన్నాడు గద్దదంగా.

శ్యామల తలపైకెత్తి 'లేదురండి.' అని కుర్చీచూపించింది.

'ఇవ్వాళ ఎండ చాలా తీవ్రంగావుంది.'

'ఊఁ'.........అని శంకరాన్ని ఒకసారిపరికించి మళ్ళీ చదువు ప్రారంభించింది శ్యామల.

'నే వెడతాను. చదువుకు భంగం కలుగజేస్తున్నానుకాబోలు' అన్నాడురెండునిముషాలు కూచుని, సంభాషణ ముందుకు సాగకపోతే శంకరం.

'నేనూ వస్తున్నానుకిందకి. టీతాగివెడుదురుగాని' అని లేచి షెల్ఫుమీద కుక్కబిస్కట్లు రెండు తీసి మెట్లు దగ్గరకి పయనమయింది, కుక్కా, శంకరం వెంబడించగా. మెట్లదగ్గరకుక్క, శ్యామల చేతిలో బిస్కటు అందుకుందామని ఎగిరేసరికి 'హాయి'మని కసిరింది. ఆకసరుతో తోకవేలేసి శంకరంకేసి చూసింది శునకరాజం. శంకరం దానికేసిచూశాడు. మారుమాటాడకుండా ఇద్దరు శ్యామల వెనకాలమెట్లు దిగారు. శంకరం వూయింగులో ప్రథమాంకమిక ఇల్లా ముగిసింది.

తరువాత రోజూ వెడుతూండేవాడు నరసింహంగారింటికి శంకరం. శ్యామల్ని ఎంత అర్థంచేసుకుందామని ప్రయత్నించినా కొలుకువడ్డది కాదు. ఆమె నడత విసువుకి, కోపానికి తావిచ్చినా, ఆశకడమిచ్చేది. మొత్తంమీద ప్రియులుపడే బాధలన్నీ పడుతూ దినమొక యుగంగా గడుపుతున్నాడు రోజులు శంకరం

ఒకరోజున శ్యామలస్నేహితురాలు శంకరాన్ని చూపించి 'ఆయనెవరు! మీయింటికి రోజూవస్తూంటారు' అని అడిగిందిట. శ్యామల 'ఆయన మాయింటికెదురుగుండా కాపురమున్నారు. కుక్కలంటే చాలా సరదా. మా 'టామీ'తోను 'గ్రీటా' తోను ఆడుకోడానికి రోజూవస్తూంటారు' అని శంకరం వింటూండగా చెప్పిందట. మరునాడు వాళ్లింటికెళ్లకుండా మాయింటికొచ్చి, శంకరం నాకీసంగతి చెప్పాడు.

ఇకనైనా బుద్ధి తెచ్చుకు పెళ్లిచేసేసాలు మానెయ్యమన్నాను. శేషు వాళ్లింటికెడితే వొట్టన్నాడు. తరువాత రెండురోజులు తప్పకుండామాయింటికొచ్చాడు. మూడోరోజున మాయమయ్యాడు. పిమ్మటిదినం నేనెళ్లి మళ్ళీ ఏంజరిగిందని అడిగాను. "నిన్న శ్యామల మాయింటికొచ్చి, 'ఏమండీ రావటంలేదు? రెండురోజులనుంచి! వంట్లోనుస్తీగానుందేమో అనుకున్నాను సినీమాకి వెడదామా?' అని అడిగింది. ఒరే దానినడత నాకేమి అర్థంకావటంలేదన్నాడు.

'స్త్రీజాతేమాయ. స్త్రీనిపురుషుడెన్నడూ పూర్తిగాఅర్థంచేసుకోలేడు. అందులో ఆంగ్లవిద్యాగంధం కల్గిన ఆంధ్రస్త్రీ అసలే అర్థంకాదు. వాళ్లు స్టేజి మీద శకుంతలయినా, దైనికజీవితంలో మట్టుకు అద్భుతంగా, నటిస్తారు. ఏం చెప్పమన్నావు? ఆచిక్కు నువ్వే విప్పుకోవాలి' అన్నాను.

ఇంతలోకి వార్తాపత్రిక వచ్చింది. శంకరం అదుర్దాగా విప్పాడు, మద్రాసు విశ్వవిద్యాలయంవారి బి. యే. డిగ్రీ పరీక్షాఫలితాలుకోసం.

గబగబా, ఎగాదిగాచూసి ఫిలాసఫీ ఫస్టుక్లాసు, ఇంగ్లీషు సెకండుక్లాసన్నాడు.

'ఎవరు'

'శ్యామల'

ఆవార్తతో శ్యామల అందని మ్రానిపండయిందని సంతోషిస్తున్నాను.

* * *

'అబ్బాయి శంకరం! మా అమ్మాయి ఫస్టుగా ప్యాసయిందిట. నువ్వీవాళ మాయింటికి భోజనానికి రావాలి' అని కాంతమ్మగారు చేరెడు మొగంతో పట్టరాని సంభ్రమంతో శంకరంతో చెప్పింది. మళ్ళీ నా ఆశలు క్రుంగిపోయాయి. ఇంటికెడతా నని వచ్చేశాను.

౬

శంకరం శ్యామల ప్యాసయిందని తెలుసుకుని మొదట సంతోషించినా తరువాత కొంత దిగులుచెందకపోలేదు. పరీక్షపోయివుంటే తనువెళ్లి ఓదార్చడాని కవకాశంకలిగేది. సెప్టెంబరు పరీక్షకు అవసరంఅయితే (తప్పకుండాకలిగివుండునని వాడినమ్మకం) తను సహాయంచేసేవాడు. విధివశాన్ని సణుగుకొని లాభంలేదని గ్రహించి సాయంత్రం శ్యామలింటికివెళ్ళాడు. ఆవేళ ఏదో సందర్భంచేసుకు తనహృదయంలో ఇన్నాళ్లనుంచీ అణిచిపెట్టుకున్న కోరికని వెలిబుచ్చుదామనుకున్నాడు. శ్యామల డాబామీద పుస్తకం చదువుతూంది. టామీ, గ్రేటా కుర్చీదగ్గిర పడుకున్నాయి. శంకరం కుర్చీదగ్గిరకుచేరి అభివందనములు అన్నాడు.

'థాంక్సు',

'ఏమిటో చదువుతున్నారు! అంతా ప్రేమనుగురించిలావుంది!'

శ్యామల తల పైకెత్తకుండానే చిరునవ్వునవ్వింది.

'ఇవ్వాళ చెడఎండకాసింది. సాయంత్రం ఈగాలి లేకపోతే చాలా బాధపడుదుం.'

'ఊ' తల పైకెత్తకుండా.

శంకరం కొంచెం నొచ్చుకున్నాడు. దూరంగా ఇంకోకుర్చీవుంది, అక్కడకెళ్లి దాన్లో కూచున్నాడుచాలాసేపు. శ్యామల క్రీగంట కనిపెడుతూనే వుంది. 7-30 అయింది. శంకరంవచ్చి అరగంటవుతుంది. మళ్ళీ ఎవరూ మాట్లాడలేదు.

'టామీ!'

శంకరం అరువారాలలోను టామీకి ఆప్తబంధువయ్యాడు. అది తోకాడించుకుంటూ వాడిదగ్గిరకెళ్లింది.

'గ్రేటా!'

రాలేదు.

టామీకూడా గ్రేటాకేసిచూసింది. రమ్మనట్టు అరిచింది. గ్రేటారాలేదు. శంకరంకేసి దీనంగాచూచింది.

'జాతిలక్షణం' అన్నాడు టామీతో శంకరం. తరువాత బుజ్జగిస్తూ 'టామీ, గ్రేటాకు హృదయంలేదు. దానిదగ్గిర కెళ్లకింక'!

కిలకిలమని నవ్వింది శ్యామల.

'టామీ! కొందరు మానవులకే లేదే హృదయం.'

'హృదయముండని వారుంటారా?' అంది శ్యామల నవ్వుతూ, తలపైకెత్తి.

'కొందరికివుండే ప్రయోజనముండదు. అది ఆకాశపుష్పం, అందరాని చందమామ.'

'ఉహూ!'

'సహారా ఎడారి.........'

'సహారా ఎడారి కూడా ఒకప్పుడు జలధిలో ఒక భాగం అని భూగోళశాస్త్రజ్ఞులంటారు.—'

'అమ్మా వంట అయిందిట, అబ్బాయిగార్ని, మిమ్మల్ని భోజనానికి రమ్మన్నారండి.'

'భోజనానికి లేవచ్చువండి.'

'నా కివ్వాళ ఆకలిగా లేదు.—ఆ పున్నమచంద్రుణ్ణి సముద్రాన్ని చూచి ఆనందిస్తూ ఇక్కడే ఉండాలని వుంది.'

'వుండండి. నాకు ఆకలేస్తూంది' అని ఛంగున మెట్లుదిగి కుక్కని వెంటబెట్టుకు వెళ్ళిపోయింది. టామీకూడా వెంటబడ్డది.

పిట్టగోడమీద మోచేతిని పెట్టి గడ్డంక్రింద చెయ్యి వానుకుని, కొంచెంవంగి శూన్యంలోకి చూస్తూ హిమకరుని దూరుతూనిలబడ్డాడు శంకరం. క్రిందనుంచి కమ్మని వాసనలు వస్తున్నాయి. సాయంత్రం తాగింది రెండుకప్పుల టీ అయినా, మండువేసగిలో రాత్రి ఎనిమిదింటికి ఎవరి కాకలెయ్యదు? కమ్మతావుల నాఘ్రాణించిన ఎవరినోరూరదు?

వంటవాడువచ్చి 'అయ్యా భోజనానికి రమ్మంటున్నారండి అమ్మగారు, అని పిలిచాడు. వెడదామనే వుంది. కాని అభిమానం. శ్యామలచూపుతూపులు, ఎకసక్కెం ఓర్వాలి. 'రా'నన్నాడు. ఒకేవంక జఠరాగ్ని వేరొకవంక ప్రణయజ్వాల దహిస్తున్నాయి. దీర్ఘనిశ్వాసం ఒకటి విడిచాడు......భుజంమీద ఎవరో చెయ్యివేశారు. ఎవరా అని చెయ్యివేసినవరికి చల్లగా జిల్లుగా తగిలింది. వెనుతిరిగాడు. పూర్ణచంద్రుణ్ణి అపహసిస్తూన్న మందహాసంతో వెలుగొందుతోంది శ్యామలవదనం. కొన్ని వేల సంవత్సరాల నుంచీ అదిమిపెట్టబడి ఒక్కక్షణంలో భూగర్భంలోంచి పైకుబికే అగ్నిశిఖలాగ వాడిలోంచి బయల్దేరింది ఆవేశం. ఆ సుందరవిగ్రహాన్ని తనబాహులతలలో పెనవైచి పెదవులు ముద్దెట్టుకున్నాడు.

తొణకలేదు, బెణకలేదు, దృఢంగాను, నెమ్మదిగాను కౌగిలి సడలించుకుని 'చంద్రుణ్ణి సముద్రాన్ని చూసి కావలిసినంత సేపు ఆనందించొచ్చు. నేనూవస్తాను—భోజనం చేసిన తరువాత.'

..................................

మరువాడు నేనేయిచ్చాను శుభలేఖ అచ్చుకి. ఏరకంపెళ్ళో నువ్వే చెప్పాలి.

## ఎవతె ధన్యురాలు

కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

సీ॥ మాటమాటకుఁదేనె లూటలూరుచునుండు ముద్దుబిడ్డలతోడ మురియునెవతె,
తమపురోవృద్ధికై దగు విద్యలన్బొందు ననుఁగుకొమరులతో నలరునెవతె
చిలుకగోర్వంకల చెలువుంమకూతులల్లుండ్రచే మిన్నందుచుండునెవతె
పసుపుఁబారాణి క్రొంబసలీనుమైచాయ నిత్యకళ్యాణియై నెగడునెవతె
తే॥గీ॥ పూవునెత్తావిగూడినపోల్కి, తరణిఛాయయు న్నెడబాయనిబాయ, ననయ
మాత్మనాధునానుకూల్యంబు నందునెవతె యామెపో ధన్యురాలు ఈయవనియందు.

# యశోద-పుత్ర వాత్సల్యము

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

సీ. వ్రేపెలందులయిండ్ల వెన్న దిందువె? వారి కనుదృష్టిసోకదా కన్నతండ్రి,
పెద్దబూచిని దెచ్చిబెట్టి నిన్నటబిల్చి వెరపింతు రటబోకు వెఱ్ఱితనయ
అల్లరివాడవంచని కన్న వారిచే నాడికల్ మెండయ్యె ననుగుకుఱ్ఱ
కడుపేదవలె వారి పడుబంచలకుబోయి రట్టుపా ల్గానేల చిట్టిపట్టి
గీ. ఇన్ని నాళులు సుతులులేకున్న కొదువ! ఇపుడు నినుగూర్చిచింతలెన్నెన్నిగల్గె
ఏమిసేయుదు నింకనే నెందుబోదు । అగడుపడి చిన్నబోవగాదగునె కొడుక॥
ఉ. రట్టుపడంగ నీకుదగురా నగరా నిను వ్రేతలెల్లరున్
గట్టడివంచు దూర వినగా మది గాఱియలందసాగె నీ
వట్టుల రావుసేయ ననువా మనవారలు గేలిసేయరా
పట్టిరొ యిట్లుసేయ సబబా నగుబా టగుగాదె పుత్రకా॥
సీ॥ అతి దుండగీడు నీసుతుని దండించెదనని జెప్పిపోయె గయ్యాళియొకతె
ననుబుగ్గలను బట్టి నులిమిపైచెదనంచు పంతమాడుచుబోయె పడతియొకతె
బూచిదెచ్చితి నేడు బుడుతనిబట్టియ్య వాని దెమ్మనిపల్కె వనితయొకతె
తగుబుద్ధిజెప్పి నీతనయుని మాయిల్లు జేరనియ్యకుమంచు జెప్పెనొకతె.
గీ. ఏమిజేసితి పొరిండ్ల కెవుడుబోతి । అంతకంతకు నీ రావు లధికమయ్యె
వారిపొక్కిడి మెండయ్యె నూరిలోన । నడుమ నత్తాడగానయ్యె నామనంబు॥
సీ॥ వెన్నదొంగిలితంచు వ్రేపెలంది యొకర్తు తంటనీపై జెప్పె తనయ మొన్న
పాల ముచ్చిలితని చాలకోపముబూని నేరమొక్కలతాంగి నిన్న జెప్పె
మీగడ వారింట మెక్కివచ్చితివని నేడు నీపై నొకర్తు చాడి దెచ్చె
పెరుగుకుండలనెల్ల విరుగగొట్టితివని యిప్పుడొకతె సుద్దిజెప్పెచనియె.
గీ. కొంటెగోపాలుడవటంచు గొల్లలెల్ల । ఊరకే నిను బలుమారులుప్పతింప
మొరుగవే వెఱ్ఱి తండ్రి; నీ తెరగుజూచి! కన్నకడుపు సహించునా? చిన్నతనయ॥
ఉ. చోరుడవంచు నిన్ను గనుచో వినుచో బరివారలెల్లరున్
సారెకు దూరువారు బెలుచన్ బలు:చందములన్ కుమార నీ
కౌర యిదేటిమారు తనయా వినయాన మెలంగరాదె నీ
వేరిని జేరకింక వినవే నిమేవేడెద జిన్ని పుత్రకా॥

# చెరుపకురా—చెడదవు

శ్రీమతి వి. యం. రత్నమ్

గోపాలరావు కలెక్టరు కచేరిలో హెడ్ క్లర్కు. అతను తన అర్ధాంగియగు సుందరితో తన నూతన గృహమందు దినముల వెళ్ల బుచ్చుచుండెను.

మోహనుడన్నా, గోపాలుడన్నా సీతమ్మకు సమాన ప్రేమయే. అంత మాత్రము చేత వారిరువురికి కూడ తల్లియందు సమాన ప్రేమయుని, భక్తి దయ యున్నదని భావించుట తప్పు. అసలు సంగతియేమిటంటే తల్లిని చూస్తే మన హెడ్‌క్లర్కు గోపాలునకు ఒళ్లు మండుతుంది. తల్లి పూర్వకాలపు మనిషి. తానో నవీన నాగరికతా సాంప్రదాయకుడు. సుందరి సంగతిచెప్ప నక్కఱలేదు. మొత్తముమీద కొడుకు కోడండ్లు యిద్దరికి సీతమ్మమీద యిష్టంలేదు. ఆమె వారికి కనపడకూడదు. ఆమెను వాళ్లిద్దరూ బాధించడంలో వకరికొకరు తీసిపోరు.

గోపాలరావుయిల్లు విశాలమయినది. ఆ యింట్లో వకమూల సీతమ్మ మోహనుడు వుండేవారు. మోహనునకు తల్లియందు బహుప్రేమ,కాని యేమి చేయకలడు. తనకా యింకా నౌఖరీలేదు. అందుచేత మోహనుడు పాపం యేమిచేయగలడు? అప్పుడప్పుడు తను తల్లితోపాటు, అన్నగారియొక్క వదినగారి యొక్క ఆగ్రహమునకు గురియై తిండికూడ లేకుండావుండేవారు. కన్నతల్లి, తమ్ముడు అని పిసరంతైన అభిమానం మన హెడ్ క్లర్కు గోపాలునికిలేదు. ఎలాగో పార బాటున వాళ్ళని యింట్లో వుండనిచ్చేవారు. యెందుచేతనో తెలుసునా! తన వుద్యోగపు దర్జాకు లోపంకలుగుతుందేమోనని వాళ్ళు పైకిపోతే.

సీతమ్మ గోపాలుని ముఖమైనా చూడడం అవకాశంలేదు. చివరికెలాగో వకరోజు కొడుకును చూచుటకు నిశ్చయించింది. మోహనుడు "అమ్మా! వద్దు వద్దు...వాళ్లిద్దరు రాక్షసులు" అని యెన్ని చెప్పినావినక గోపాలుని గదివద్దకువచ్చి పిలిచింది. జవాబు లేదు. మళ్ళీ వకమాటు తలుపుతట్టి "గోపాలం" అని పిలచింది.

సుందరి యీవాళ చాలాహడావిడిలో వుంది. కలక్టరుగారు కుటుంబముతో విందు కుడుస్తారట. అందుచేత సుందరి యిల్లంతా బాగా అలంకరించి, తాను చక్కనిచుక్కలా శృంగారించుకుని, వంటలక్కడు వంటగురించి ఆర్డర్లుయిచ్చి యింక చేయాలిసింది యేమిటా అని ఆలోచనలోయుండగా యీ నిర్భాగ్యపు సీతమ్మ పిలుపు, తలుపుమీద చరుపు వక సారి వినబడ్డాయి. సుందరి మొహం యేదో పట్టుకున్న దానిమొహంలా తయారయింది. పట్టలేనికోపం వచ్చింది. ఇహ పూరుకోక "అబ్బా! యీ పాపిష్టిదానితో వేగలేకుండాయున్నాను. పనిపాట చేయలేని యీ ముసలిదానిని, యీ అరవై యేళ్ల పాతపంజరంలాంటిదానిని, మొహంచూస్తే తుమ్మల్లో పొద్దు కూకినట్లున్న యీశని గ్రహాన్ని అత్త అత్తఅని చెప్పుకొనుటకుకూడ సిగ్గవుతూంది. ఇంటికి వీరాలంతా వచ్చేవేళ పసికట్టి పగ పట్టునట్లు వచ్చింది. దీనిని తక్షణం తరిమెయ్యాలి."అనితోకత్రొక్కినతాచులాలేచి

"యీవాళ మాదొరగారు భార్య విందుకు వస్తారు. నువ్వు యిక్కడ కనపడితే బాగుండదు. త్వరగా వెళ్లు" అని అరిచింది.

"ఒక్కసారి మా గోపాలంతో మాట్లాడి వెళ్ళిపోతాను. మీగదిలో నాకేమీ పనిలేదు. నాకేమీ అక్కర్లేదు తల్లీ" అని దీనంగా అంది అత్తగారు. పాపం అమాయికురాలు. యిప్పటి అత్తగార్లంటిందయితే వక నాటకం నడిచేదే రోజూ. కాని సుందరి అత్తగారి మెడపట్టుకుని గెంటివేయబోగా పాపం గోపాలం అడ్డంవచ్చి "యీ ముసలిదానికి మంచిచెడ్డా తెలియదు. తను యిలా మన దగ్గరకు వస్తూంటే మన దర్జాకు లోపమని యెరగదు. యెన్నిసార్లు బుద్ధిచెప్పినా యింతే. అయినా, గట్టిగా దెబ్బపడకుండా మట్టుకు జాగ్రత్త పెట్టుకో" అని చెప్పను. దానిపైని సుందరి "నాయింటికి గొప్పవారందరూ వస్తూంటే యీ నిర్భాగ్యురాలు వారికంటపడితే నాకు తలవంపుగా వుంటుంది" అని సీతమ్మను లేవమనెను. "నేనేమితప్పు చేసేనే సుందరి? నా మీద యెందుకు యీకోపం" అని సీతమ్మ కళ్ళనీళ్లు పెట్టుకుంటూ అడిగెను. "ఇక సుందరి కోపం పట్టచాలక "నీవు కొడుకునుకని నాకు అత్తగారగుటే గొప్పబుద్ధి తక్కువపని" అని కసరికొట్టింది. "దాని ననవలసినపనేముంది. మన బంగారం మంచిదయితే అన్నట్లు మా గోపిగాడికి బుద్ధివుంటే యీగండుతనం వుండకపోను. పసుచు కాపురం చిదుకులమంట అన్నట్లు నాకొడుకులోకువ కనిపెట్టే యిది నన్నింతబాధలు పెడుతూయున్నది. వద్దు వద్దని యెంత చెప్పినా వినకుండా వచ్చినందుకు నాకు శాస్తి అయింది" అని యేడుస్తూ తిరిగి మోహనంవద్దకి వచ్చింది. "ఎందుకు యేడుస్తావు. నేను చెప్పిన మాట విన్నావా? వారు అంతకన్న యెక్కువ చేస్తారనుకున్నావా! ఇంక మనం యిక్కడవుండలేము. వాళ్లు వుండనియ్యరు. యేదైనా దోవ చూడా"లని మోహనం తల్లి నోదార్చెను. సీతమ్మ కొడుకుతో "నాయనా! యెప్పటికయినా యిక నీవే నా దిక్కు. వాడి డబ్బుకోసం కాకపోయినా వాడిని విడవలేక యిన్నాళ్లు బాధపడ్డా. ఇంక చాలు. భగవంతుడున్నాడు. ఇక్కడ నుంచి లేచిపోతే యేదోయింతలోకాన్ని మంచి చేసుకుని బతకొచ్చు" అని సమాధానం చెప్పింది సీతమ్మ.

సుందరమ్మగారి యింటివద్ద కారు వచ్చి ఆగింది. గోపాలరావు చిరునవ్వుతో కలెక్టరుగారికి 'షేకుహేండు' యిచ్చి లోపలికి తీసుకెళుతూంటే, సుందరి సావిత్రమ్మగార్ని రెండు చేతులతో షేకుహేండు చేసి తిప్పుకుంటూ పెరటిదార్ని లోపలికి దోవ చూపింది. వారందరికీ కొంతసేపు యిష్టాగోష్టి అయినాక వడ్డనలు, భోజనాలు ఆరంభం అయేయి. కలక్టరుగారి భార్య సావిత్రమ్మగారు వూరుకోలేక "అవడ్డించే ఆవిడ మీ అత్తగారేనా? పాపం వక్కర్తే వంట అంతా చేసింది. మీరుకూడా మడి కట్టుకోకపోయేరా" అని అన్నది. నిజానికి వడ్డించేది వంటలక్క. అత్తగార్ని వక చిన్నగదిలో పెట్టిపైకిరావద్దని చెప్పింది. మరిప్పుడు సమాధానం చెప్పాలిగా సావిత్రమ్మగారితో.

అందుచేత యిలాఅంది "అయ్యో నాకు అంత అదృష్టమా. మా అత్తగారుపోయి 5 నెలలయింది. పెద్ద దిక్కులేక చాలా యిబ్బంది పడుతున్నాము. ఆవిడ బతికి వుండి నన్ను కూర్చోపెట్టి యిలా చాకిరీ చేసే పత్తానికి మాకు విచారమేవుండదు. ఇంతకు ఆమె అదృష్టవంతురాలే."

ఇదంతా నమ్మింది సావిత్రమ్మగారు. ప్రస్తావన మార్చింది. కొంతసేపటికి భోజనా లయేయి. తర్వాత మాటల సందర్భంలో సుందరమ్మ యిల్లు చూడాలనుందని సావిత్రమ్మగా రంది.

దీనితో సుందరి భుజాలు మందరగిరి వరకు పొంగేయి. తన సిరి, సంపద అంతా దొరసానిగారికి చూపడం ఆరంభించింది. ఆమెకు చాలా గర్వం. ఎంత డబ్బున్నా, యెందరు నౌఖర్లున్నా, గర్వింపకూడదన్న సంగతి, యీ వయస్సు, యీ డబ్బు అంతా అబద్ధం అని తెలియనిస్థితిలోవుంది పాపం! ఆ సంతోషంలో తన యింటియందు ఒకమూల చిన్న గదిలో తన అత్తగారు వున్న సంగతికూడ మరిచిపోయి వరసగా గదులు, హాలులన్ని ఆవిడకు చూపిస్తూ యీ చిన్న గదిదగ్గరికి దయచేశారంతా. బెంగతో గుడ్లనీరు తుడుచుకుంటున్న ముసలిది, ఓదారుస్తున్న మోహానం కళ్లబడ్డారు.

"వీరెవరు?" అని సావిత్రమ్మగారు ప్రశ్నించింది.

"మే మెవరైతే మీకేమమ్మా! మీ కేం ఆరుస్తారా. తీరుస్తారా!"

"అల్లా కాదమ్మా! అడిగేను మంచి చెడ్డ. చేతనైతే చేస్తాను. లేకపోతే విచారిస్తాము. మీ సంగతికాస్త చెప్పడం ధర్మం గాదూ" అని అంది కలక్టరుగారి భార్య.

"మీకు విందు చేసినవారు నా పెద్ద కొడుకూ కోడలూ నమ్మా! నా అవస్త యేమని చెప్పను" అని మెల్లగా అంతా చెప్పింది. మన సుందరి సావిత్రమ్మగార్లు వకరికేసి వకరు చూచుకున్నారు. సావిత్రమ్మగారి మొహాన్న ఆశ్చర్యం కనిపిస్తూంటే రెండో ఆవిడ ముఖం కందగడ్డ లాగయింది. అక్కడికి పాపం ధైర్యం తెచ్చుకుని ఆమె "అత్తే అది పిచ్చిదండి. అంచేతే గదిలో పెట్టేము" అని సావిత్రమ్మగారితో అంది. ఇంతవరకూ వచ్చేక సంగతి దాగుతుందా? దొరగార్కి వారి భార్యకు యీ చిన్న దొరగారి వారిదొరసానిగారి సంగతి తెలిసింది. కలక్టరుగారు భార్యాకూడా మంచి యింటివారు. మంచి హృదయం గలవారు. చాలా విచారించేరు. సమయం కనిపెట్టి మన మోహానానికి నౌఖరీ యిప్పించేరు. మోహానం తల్లి వేరే హాయిగా కాపురం చేస్తూవుంటూన్నారు. కొంత కాలానికి మన సుందరిప్రభ యింట్లో యెవరు లేకపోవడంవల్ల తన తాబేదార్లమీద పడి అక్కడినుంచి దొరగారి నోటీసులోకి వెళ్లింది. గోపాలానికి యింటికి దారి చూపించేరు వక చిన్న లంచపు కేసులో.

"మోహానం! అనుభవంమీద కాని యేమి తెలియదురా."

"అన్నయ్యా! జరిగినదానికి చింతించకు. హాయిగా కృష్ణా, రామా అనుకో కూర్చుని. తక్కింది నేనే చూస్తాను."

# ఆత్మసమర్పణ

శ్రీమతి పోలాప్రగడ సత్యకళా దేవిగారు

౧

మండువేసవికాలము. రోహిణి కార్తి. మధ్యాహ్నం పన్నెండుగంటలు కావస్తోంది. చలపతిరావు సావిట్లో మంచంమీద పడుకుని భగవద్గీత చదువుతుం టున్నాడు. ఆరవై సంవత్సరా లుంటాయి. నెరిసి పోయిన చిన్నపిలక చివరముడివేసుంది. పొడుగ్గా పెరిగిన గెడ్డం. గెడ్డంలో మాత్రం లెక్కకి ఒకటి రెండు నల్లవెంట్రుకలు కనపడతాయి. ముడతలు పడ్డ నుదుటిమీద గంధాక్షతలు బొట్టు పెట్టుంది. సులోచనాలకు ఒకవైపు తాడు కట్టుంది.

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥"

అని పైకి తడుముకుంటో చదువు తున్నాడు. ఎందుకోకాని అప్పుడప్పుడు గుమ్మంవైపు చూస్తు న్నాడు. పుస్తకం పక్కని పెట్టి, 'అమ్మాయీ! కాసిని మంచితీర్థం తెచ్చిపెట్టవే' అని కేక వేసేస రికి, నలభై సంవత్సరాలలోపు పూర్వసువాసిని లోప ల్నుంచి రాగిచెంబులో మంచినీళ్ళు తీసుకొచ్చి యిచ్చింది. 'అమ్మా సుబ్బూ! సు వ్వింకా మడి విడ వలేదుటే? అన్నాడు.

సుబ్బు—ఏదీ- నాన్నా! రామం పొద్దున్న పోయిన పోవటం ఇప్పటికింకా అన్నానికి రాలేదు. అత్తయ్యకీ కుర్రాళ్ళకి అన్నం పెట్టాను. నేను వాడికోసం కనిపెట్టు కూచ్చున్నా.

చల—అయ్యో! ఇంకా రాలేదూ? ఈచెవిగాడ్ని ఆచెవికి కొడు తూంది. చద్దన్న మైనా తిన్నా డా-వాడు?

సుబ్బు—ఇవాళ చద్దన్నం మిగల్లేదు. పోనీ కాసిని గింతేసి వండిపెడతానురా నాయనా అంటే, ఏదో ప నుందని తొందరగా వెళ్ళిపోయాడు.

చల—ఎండాకాలంలో సుఖపడతారు గదా అని సెలవ లిచ్చినా మనవాడికి కష్టపట్టం తప్ప దాయెను! బడి వున్నరోజులే నయ మనిపి స్తున్నాయి. ఏవో రెండుముక్కలు చెప్పొచ్చి పదిగంటలకింటికొచ్చేవాడు. ఇప్పు డావున్న గోడూ చెడింది.

సుబ్బు—గాంధీగారేదో చెప్పారని 'అపూలిలో దిగి పోయాడు. మనమాట వినిపించుకుంటున్నాడా యేమన్నానా!

చల—ఏమిటో - రొవడిపెట్టే వాడి కానందం. పోనిద్దూ. వాడికేమీ తెలివి లేకుండా సంసార బాధ్యతంతా వాడినెత్తిన పడిపోతుంది. సెల వల్లో నైనా వాణ్ణి ఖులాసాగా తిరగనియ్య. ప ట్టప్పుడు లేనే లేదు. నలుగు రైదుగురి పొట్టలూ వాడి రెక్కలమీద ఆధారప డున్నాయి. నే నుండి కూడా ప్రయోజనం లేకుండా పోయాను. అని అంటూవుండగా చలపతిరావుగుంటలుపడ్డ కళ్ళు నీళ్ళతో నిండి పోయినాయి.

సుబ్బు—వూరుకో నాన్నా! నీకు మతే మన్నా పోయిందా యేమిటి? మొగపిల్లాడు కుటుంబపో షణ చెయ్యటం యివాళ కాకపోతే రేపైనా నేర్చుకోవలసిందే. దైవం చల్లగా చూసి వాడి కడుపున నాలుక్కాయలు కాస్తే పెద్దసంసారం అవదూ? ఇప్పట్నుంచీ యీమాత్రం ప్రయోజక త్వం వుండటం మంచిదే.

చల—అమ్మా! గోపాలా న్నయినా పంపించవే. పిల్చుకొస్తాడు.

సుబ్బు—ఎక్కడికని పంపించనూ? ఎక్కడికెళుతు న్నావురా అని నే నడిగినా చెప్పకుండా వెళ్ళి పోయాడు.

చల—అడుగో! మాటల్లోనే వచ్చాడు. నాయనా! వెయ్యేళ్ళాయుర్దాయం. ఇంతపొద్దెక్కిందాకా రాలేదేం-నాయనా?

రామారావున కిరవైమూడేళ్ళున్నాయి. కొంచెం పొడగరి. దృఢమైన శరీరం. సామాన్యమైనరూపం. క్రాపింగ్ (Cropping) తల. ముఖమంతా చెమటబిందువులతో నిండి రొండకొట్టుంది. పైమీది ఖండువా తలుపుపైన వేసి తల్లి తీసుకొచ్చి యిచ్చిన చల్లనినీళ్ళు ముఖంపైనీ కాళ్ళపైనీ పోసుకుని తాతగారి మంచందమీదకువచ్చి కూర్చున్నాడు.

చల—(లేచి కూర్చుని రామారావు తలపైని నిమురుచు) నాయనా! ఎండకొట్టి పోయావురా. ఇంత సేపటిదాకా యేం చేస్తున్నావురా?

రామా—కొన్ని అవసరమైన పనులు చూసుకుని కొట్టుదగ్గిర పికెటింగ్ (PicKetting) చేస్తూ కూర్చున్నా. వా డొచ్చేదాకా కూచోవలసి వచ్చింది. అంచేత ఆలస్య మయింది.

చల—నాయనా! ఎండలో గిరత్తుతుందిరా యిలా తిరిగితేనూ. నీమీద ప్రాణాలు పెట్టుకున్నాం. రవంత వొళ్ళు వెచ్చబడితే దిక్కూ మొక్కూ మన కీలస్త్రీలో. పోనీ గాని, లోపలి కెళ్లి అన్నం తినిరా. ఆతర్వాత మాట్లాడు కుందాం.

రామారావు చొక్కా విప్పి లోపలి కెళ్ళాడు. చలపతిరావు ముక్కుపొడుం ఒకపట్టు పీల్చి, చిటికేసి, మరకలతో నిండిన అంగోస్త్రంతో తుడుచుకుని పక్కమీదికి మెల్లిగా వొరిగాడు.

"భక్తాపాయభుజంగగారుడమణీ"

అన్నశ్లోకం మెల్లిగా చదవటం ప్రారంభించాడు. ఒక్క నిముషంలోనే కళ్ళు మూతలు పడిపోయి చిన్న గురక ప్రారంభించాడు. పది పదిహేను నిముషాలవరకూ అలా నిద్రపోతూ వున్నాడు. ఇంతలోకే రామారావు లోపల్నుంచి చేతు లంగోస్త్రంతో తుడుచుకుంటూ సావిట్లో కొచ్చి గోడపక్కని చాపమీద కొచ్చి కూచుని, 'గోపాలం! చెక్కముక్క తెచ్చి పెట్టరా?' అని కేక వేశాడు.

గోపాలరావుకు పదిపదకొండేళ్ళకంటె యెక్కువుండవు. అక్కడే కూర్చుని పలకమీద పుస్తకాలు తీస్తూ పెడుతూ వున్నగోపాలరావులేచి లోపలి కెళ్ళి పోకచెక్క తీసుకొచ్చి, 'ఒరే అన్నయ్యా! నాకూడా సగంముక్క యిస్తా నంటే నీచేతి కిస్తా, లేకపోతే నేనే తినేస్తా-నీ కివ్వకుండా!' అన్నాడు.

రామా—అరవకు తాతయ్య లేస్తాడు. నువ్వు అమ్మనడిగి యిం కొకటి తెచ్చుకో.

గోపా—ఇం కొక టడిగితే అమ్మ తంతుంది.

రామా—పోనీ-నువ్వే తీసుకోరా.

గోపా—కొట్టి తీసు కొస్తాను.

అని తలుపుసందున పెట్టి నొక్కి రెండుముక్కలు చేశాడు. ఇంతలోకే బటానీగింజలు నములుతూ వీధిలోంచి లోపలి కొచ్చి 'ఒరే! నా కేదిరో-చెక్కముక్క?' అని చెయ్యి చాపాడు-కామేశ్వరరావు.

గోపా—ఒకముక్క అన్నయ్యకిచ్చాను. ఇదే వుంది నాదగ్గిర. అమ్మ నడిగి తెచ్చుకో.

కామే—అది నా కిచ్చి నువ్వే అడిగి తెచ్చుకో.

గోపా—అబ్బా! మహాదొడ్డదానవు! తినగలవా-నాచేతిలోంచి తీసుకుని?

కామే...విరి చియ్య.

గోపా—ఈకాస్తలో ఏం విరుగుతుంది?

కామే—ఇలా తే, కొరుకుతా.

గోపా—బెధవకానా! ఒకమూల బటానీలు మింగుతూకూడా చెక్కముక్కకోసం యేడుస్తావేం?

కామే—ఒరే అన్నయ్యా! చంపేస్తా, నా కివ్వకపోతే.

రామా—ఆఁ! ఏమిట్రా అది? తిట్టుకోటం కూడా మొదలు పెట్టారు!

ఈగడబిడతో చలపతిరావు లేచాడు. లేచి కూచుని:—

చల—ఏమి టర్రా ఆ అల్లరి?

గోపా—చూడు తాతయ్యా! కామిగాడు కొట్టబోతున్నాడు.

కామే—కామిగాణ్ణిట్రా-నేను నీకు? (అని దవడమీద ఒకటి అంటించాడు.)

గోపా—ఓరి కుంకమ్మా! నేను యీడ్చి కొడితే వొక్క దెబ్బ కాగలేవు-తెలుసునా?

రామా—(నవ్వుతూ లేచి) దెబ్బ లాడుకోక మీ రేం కావాలో అమ్మ నడిగి తెచ్చుకోండి.

అని యిద్దర్నీ లోపల దిగబెట్టి సావిట్లో కొచ్చి కూర్చున్నాడు — రామారావు. కొంతసేపటికి సుబ్బమ్మ కూడా వచ్చి గుమ్మంలో కూర్చుంది.

చల—అమ్మా! భోజనం అయిందా?

సుబ్బ—ఇప్పుడే అయింది. ఇంకా చెయ్యార లేదు. ఇంతపొద్దెక్కే దేం సయిస్తుంది? చెపితే విన కపోవటం కాని కాకిలాగ అరిచిందని బడి తిరగట మెందుకు చెప్పు! ఇప్పుడు మళ్లీ వెడ తావు!

రామా—ఇంకా రెండు కాలేదు. రెండింటి కెళ తాను.

సుబ్బ—ఎవరో నీవంటివాళ్ళు తిరుగు తున్నారు. కాని యిం కెవ రైనా యింట్లో మొహం వీధిలో పెడు తున్నారా-యీ యెండల్లో?

రామా—నావంటి వాళ్లే కాదు. పెద్ద పెద్ద సామంతులే కష్టపడు తున్నారు. ఎండ మొహ మెరగని సుకుమారులు కూడా కష్టపడు తున్నారు-ఈప రిస్థితుల్లో.

సుబ్బ—వాళ్ళకీ నీకుమల్లే మతి పోయుండాలి.

రామా—ఇటువంటి సమయంలోనా, సుఖపట్టం. పొద్దున్న టిఫిను (Tiffin) పదిగంటలకి భోజనం మళ్ళీ మధ్యాహ్నం టిఫినూ ఆరగించి పట్టెవేళ్ళ తడికల చాటున పడుకో మని చెప్పటం లేదు గాంధీ. నిద్రాహారాలు లేకుండా కష్టపడి తమ జీవితాలని ధారపోస్తున్నవా రున్నారు. వాళ్ళందరికీ మనపాటి ఆలోచన లేకేనా?

చల—కాదురా-నాయినా! నీవొళ్ళు తిన్నగా కాపాడుకో మనిరా-దాని వుద్దేశం. అంతే కాని నీమీద దానికి పగపాడిట్రా పెట్టివాడా!

సుబ్బ—దిగుదిగు మనేవారే కాని తోడురికేవా రుంటారా? ఇంకోడికి చెప్పటాని కందరూ పెద్దలే.

రామా—ఇం కోరు చెప్పట మెందుకు? జాలిగుండె గల ప్రతివాడూ దిగుతాడు.

సుబ్బ—వాళ్ళందరితో నువ్వు సమానమా? వున్నవాళ్లా తిరిగినా యింట్లో జరిగిపోతుంది. నువ్వా నాలుగు రాళ్లూ సంపాయించి తీసుకొస్తే నే కాని యింట్లో జరగ దాయెను. నువ్వీపనిలో తిరుగుతున్నా వని చెప్పి ఆకాస్త వుద్యోగం తీసేస్తే మనగ తే మవుతుం దప్పుడు?

రామా—నేషనల్ స్కూల్ (National School) కాదూ? పని తీసెయ్యరు లే. బెంగెట్టుకో కమ్మా.

సుబ్బ—ఏం చెయ్యను! నీఖర్మ మల్లా వుంది. తండ్రి పోవటం. చిన్నతనంలోనే సంసారం నెత్తిన పట్టం. ఎంతవాడి కడుపున పుడితే నేం! చివరకి నీకు కష్టం తప్పింది కాదు. ఆముసలావిడ కొడుకు చచ్చిపోయి ఈ మూడుతప్పలనీ చూసుకుని ఆవిడ కాలక్షేపం చేస్తూంది. చచ్చి చచ్చి ముగ్గురు పిల్లలు బత కొచ్చేటప్పటికి నువ్వు సంపాయించి పెడితేనే కాని అన్నం లే కుండా చేశాడు భగవంతుడు!

రామా—ఇద్దరు తమ్ములూ ఎదిగి చదువుకుంటే మ నన్న మెవరు తింటా రమ్మా. నేను కడుపు కట్టుకు నైనా వాళ్ళ నిద్దరినీ వృద్ధిలోకి తీసుకొస్తాను. ఎల్లకాలం కష్టా లిలానే వుంటాయా?

చల—చూశావుటే అమ్మా! ఎలా చెబు తున్నాడో! నాతండ్రీ! నాఆయుర్దాయంకూడా పోసుకుని వెయ్యేళ్ళు వర్థిల్లు నాయనా! వా డొట్టి అమాయకుడే పాపం! వాడి నేమీ అనకే నువ్వు.

సుబ్బ—నే నెందు కంటాను నాన్నా? అల్లా కాకి లాగ తిరి గొచ్చి రెండు మెతుకు లన్నా తినలేదు. సయించక యిటూ అటూ తోసేశాడు-పెట్టిన కాస్తన్నమునూ. తనికి కాస్త ముక్కులో పడిశం పడితే గుమ్మం తొక్కి చూసేవా ళ్ళెవళ్ళయినా వున్నారా? ఆడదాన్ని-ఎన్ని తంటాలు పడ్డా నేను పడాలి. ఇదంతా నచ్చ చెప్పిన సామంతులంతా రొవరిదారిని వారు వొత్తికించుకుని వూరుకునే వారే, ఎవరి కెవరు సాయపడుతారు?

చల—పోనిద్దూ! సాధించకు వున్న నాలుగు ఘుళ్లూ మువాడివి.

రామారావు తల్లి కేమీ జవాబు చెప్పలేదు. వింటూ వూరుకున్నాడు. చాలా సేపటివరకూ అవి డనోరు మూతపడలేదు. ఒక అరగంట గడిచిన తర్వాత రామారావు లేచి చొక్కా వేసుకుని కాసిని మంచినీళ్లు తాగి పైమీద ఖండువా వేసుకుని వీధిలో కెళ్ళిపోయాడు.

౨

సుబ్బమ్మ రాట్నం ముందు పెట్టుకుని నూలు వొడుకుతూ కూచుంది. చిక్కి సగ మయింది. డొక్కలు రెండూ అంటుకుపో యున్నాయి. చూపులో నీరసత్వ మెక్కువగా కనపడు తూంది. కొంతనూలు ఆనుకు పోసి వుంది. పక్కనే యేకులు దొంతర పెట్టుంది. సుబ్బమ్మ పెదవులు పొడారుకు పోతున్నాయి. రాట్నం వొడకటం ఆపి కాస్త నీళ్ళతో నోరు తడుపుకుంటూ 'నీవంట్లో ప్రాణ ముందా యేమన్నా నా ? కాస్సేపు చాలించి పడుం వాల్చకో నాన్నా!' అన్నది.

చల—నువ్వు మట్టుకు సుఖపడుతున్నావు టే? అమ్మా! ఏదో యిద్దరం కష్టపడితే ఈయేకులు వొడుకటం అయిపోతుంది. ఆ తర్వాత వెన్ను వాల్చుకోవచ్చు.

సుబ్బ—(కళ్లనీళ్లతో) కొరా! యెంతగతి పట్టింది! ఈ నూలమ్మి డబ్బులు తెచ్చుకుంటేనే గాని పూటకి టికాణా లేకుండా పోయింది!

చల—"కలిగెడు నెంతవారికిని కష్టము లొక్కొక వేళ" అని చెప్పినవాడు వెఱ్ఱివాడా? అమ్మా! ఏంచేస్తాం? ఓర్చుకోక తప్పదు. మనమే యిలా అనుకుంటున్నాం. వా డెంత కష్టపడుతున్నాడో జైల్లో? వాడు తీతపురాళ్లు తెచ్చి నన్నాళ్లూ సుఖంగా గడిచిపోలా?

సుబ్బ—వాడూ కావలసినంత బాధపడుతూ నేవుంటాడు. ఏం చెయ్యగలడు?

చల—అమ్మా! యెన్నాళ్లో లయినట్టుందే. నా వెఱ్ఱివాయిన్ని చూసి. పెద్దముండావాణ్ని కదా అమ్మా! నా డొచ్చేసరికి వుంటానో వుండనో? నీ తాతయ్య నిన్ను చూడాలని కలవరించాడని చెప్పమ్మా వచ్చిం తర్వాత.

సుబ్బ—(కొంగుతో కళ్లు తుడుచుకుని) అలా అనకు నాన్నా! అసలే మతిపోయి యేడుస్తున్నాను. తండ్రి ప్రాణం వూరుకోలేక నే కాదూ! అల్లా నాతో సమానంగా కష్టపడుతున్నది? నీ కేమై నా వోపికుండి తంటాలుపడుతున్నావా?

చల—అమ్మా! నేనుండిమాత్రం యేం వుపయోగిస్తున్నానే? వొక్కకూతుర్ని పిల్లల్ని పోషించలేని వ్యర్థుణ్ని అయిపోయాను గదా—అమ్మా! మొన్న కుఱ్ఱాడు మజ్జిగపొయ్యమని అడిగినప్పుడు నువ్వు లేదంటే కడుపు తరుక్కుపోయింది. కుఱ్ఱవెధవ రెన్నాళ్లు తింటా రాగొడ్డుతిండి—చల్లా చమురూ లేకుండాను? ఏం చెయ్యను? ఏ పని చెయ్యటానికీ అశక్తుణ్ణయిపోయాను.

సు—కడుపునిండా అన్నముంటే చల్లా చమురూ మాట చూసుకోవచ్చు. ఆ ముసిలావిడ నాకంటె తెంగపెట్టుకు కుళ్లిపోతూంది. మూడుకాళ్ల ముసిలాళ్లు దిక్కులేక నాదగ్గిర పడుంటే వాళ్లను కూచోపెట్టి పట్టెడు మెతుకు పెట్టలేకపోతున్నాను. పెద్దవాడవు. నువ్వేం చెయ్యగలవు—నాన్నా? భగవంతు డిలా యెన్నాళ్ళు కష్టపెట్ట దలచుకున్నాడో?

చల—ఎవడు చేసుకున్నంతా వా డనుభవించవలసిందే కాని భగవంతు డేంచేస్తాడు! ఏదో వాడు సుఖంగా తిరిగొస్తే అంతే చాలు. 'కలిమి లేములు కావడికుండలు.' ఎల్ల కాలం వొక్క తీరుగా యే కోటీశ్వరుడికీ వెళ్లదు.

సుబ్బ—ఆ యినుకోలధికార్ల కయినా తోచలేదు కాబోలు! వాణ్ని మట్టుకు వుంక్కించి పంపిం

చేసి ఎవరిమట్టుకు వారు హాయిగా కూచున్నారు. ఏదో వాళ్లకి తోచినసాయం వాళ్లు చేస్తే చన్నీళ్లకు వేణ్ణీళ్లు లాగుండును. మన వాళ్లయితే మట్టుకు—తమరి బాగు చూసుకోటమే గాని ఎదటివాడి బాగుచూసేవా డేడీ-యీ మాయయుగంలో?

చల—మనకంటె హీనంగా వున్నవాళ్లెంతమందున్నారో—లోకంలో! అమ్మా! వొకడిదగ్గరింత డబ్బుందంటే అర్థమేమిటి? కొంత మంది కడుపులు అన్నం నీళ్లు లేక మాడిపోతున్నాయన్నమాట. ఇప్పటి రోజుల్లో వొకడి మంచి చెడ్డలు వొకడు చూడడమ్మా. పక్కింటివాడు పస్తులు మాడి చస్తున్నా పొరుగింటివాడు వినిపించుకోడీకాలంలో. అలావుంది ప్రపంచం!

సుబ్బ—వున్నవాడు లేనివాడికి సాయంచేస్తేనేమో? కట్టుకుపోతారా—డబ్బు?

చల—ఆపాటి జ్ఞానముంటే యికనేం? బాగేపడును దేశం.

సుబ్బ—నారాయణమూర్తీ! లోకంలో దరిద్రబాధ మాత్రం పగవాడికైనా వొద్దు.

చల—తప్పించుకోట మెవరితరము? ఎవడికై వచ్చినప్పుడు వా డనుభవించాలి.

సుబ్బ—పోనీ—నాన్నా! నువ్వికలే—నడుం నొప్పెడుతుంది. ఈనాలుగూ నేను వొడికేస్తాను.

చలపతిరావు కొంతసేపు వడికి కదురుకు చుట్టిన నూలు అసుకు పొయ్యటం ప్రారంభించాడు. అలా ఒకపావుగంట గడిచింది. సుబ్బమ్మింకా నూలు వడుకుతూనేవుంది. పుస్తకాలు చేతపట్టుకుని కామేశ్వరరావూ గోపాలరావూ లోపలికొచ్చారు.

సుబ్బ—నాయినా! అప్పుడే నాలుగయిందా? వచ్చేశారు!

గోపా—నాలుగు దాటిపోతూంది కూడాను. అమ్మా! తాతయ్యల్లా పడుకున్నాడేమే?

సుబ్బ—ఏమిటో! నడుం నొప్పెట్టి మంచమ్మీది కొరిగారు. పెద్దతనం గదా నాయినా? మీరు చిన్నవాళ్లు కదా అని యేదో వాపిసికి తంటాలు పడుతున్నాడు. వొంట్లో వూపిరుండదా—అర్థాన్నమా?

కామే—అమ్మా! ఆకలవుతూంది. ఏమన్నా పెట్టవే.

సుబ్బ—ఏం పెట్టను నాయినా! దురదృష్టవంతులై పోయారు.

కామే—అన్నమైనా సరేనే.

గోపా—ఇప్పు డేమన్నం రా? రాత్రి కన్నం వండినప్పుడు తిందుగానిలే.

కామే—మధ్యాహ్నం కడుపునిండలేదే—అమ్మా!

సుబ్బ—వంటింట్లో కాస్తన్నం మూతపెట్టించాను. ఇద్దరూ పెట్టుకు తినిరండి.

గోపా—నువ్వు తినరా—నా కొద్దిప్పుడు.

సుబ్బ—నువ్వమట్టు కెప్పుడో రెండు మెతుకులు తిన్నావు. ఇద్దరూ తినిరండి—అంతకన్న నేనేం పెట్టగలను నాయినా మీకు?

గోపాలరావూ కామేశ్వరరావూ లోపలికెళ్లారు. చలపతిరా వొకనిద్ర తీసి మంచమ్మీదలేచి కూర్చుని "అమ్మా! అయితే నూలు నాచేతి కివ్వవే. పాలి గంగన్న కిచ్చొస్తాను" అన్నాడు.

సుబ్బ—వాడు రాడూ! నాన్నా! నువ్వెళ్లట మెందుకు?

చల—ఏమో! వా డొస్తాడని నమ్మకమేమిటి? ఇవాళ రాకపోతే రేపనుకుంటాడు. మనదా వాడిదా అవసరం?

సుబ్బ—చివరకి మన స్థితికంటె వాడి స్థితే బాగుంది. ఇల్లాంటిదశ పడుతుందని నేను కల్లోకూడా అనుకోలేదు!

చల—అమ్మా! క్షణాని కొచ్చేది మనకు తెలియదు. ఇదంతా ఆపరమాత్ముడి చిద్విలాసం—తల్లీ! మన మేం చెయ్యగలం?

సుబ్బ—అయితే నువ్విప్పు డెళ్లవలసిందే?

చల—ఏదో వోపిక తెచ్చుకుని, నాలుగడుగులే కాదూ? తీసుకెళ్లి యిచ్చేస్తే తీరిపోతుంది.

సుబ్బమ్మ ఆనూలు విచ్చలకింద చుట్టి చలపతి రావుచేతి కిచ్చింది. చలపతిరావు బట్టలో చుట్ట పెట్టి చంకకింద పెట్టుకున్నాడు.

సుబ్బ—బల్లా అవీ తిరుగుతూవుంటాయి. గోపా లాన్నికూడా పంపిస్తానుండు నాన్నా!

చల—ఆఁ! ఎందుకు లేవే? మరేం పరవాలేదు.

(ఇలా అంటూండగానే)

"గోపాలం!" అని పిలిచింది సుబ్బమ్మ. గోపా లం తల్లిదగ్గిరికొచ్చి నుంచున్నాడు.

సుబ్బ—తాతయ్యతోకూడా వెళ్లమ్మా.

గోపా—తాత య్యెందుకే రావటం? నే నిచ్చొస్తాను నూలు.

చల—కాదు నాయినా! నీకు తూనిక సరిగ్గా తెలియదు. నన్నే రెండు మూడు మాట్లు మోసపుచ్చాడు. వాతోకూడా రా నువ్వు.

"అయితే పద" అంటూ గోపాలం గుమ్మం దిగాడు. చలపతిరావు లావుపాటికఱ్ఱ కుడిచేత్తో పట్టుకుని మెల్లిగా మెట్లు దిగాడు. గోపాలం ముందూ, చలపతిరావు వెనకా నడవటం ప్రారంభిం చారు. వాళ్లిద్దరూ ఆవీధి దాటిందాకా విచారం సూచిస్తున్న కళ్లతో వాళ్లవైపు చూస్తూనేవుంది సుబ్బమ్మ. వారు దృష్టిపథాన్నుండి దాటిపోయిన తర్వాత ఒకమారు దీర్ఘంగా నిట్టూర్పువిడిచి లోపలి కొచ్చింది.

## 3

రామారావు సావిట్లో గోడపక్కగావున్న మంచమ్మీద పడుకునివున్నాడు. కొంచెం దూరంలో నులకమంచమ్మీద చలపతిరావు దిగాలుపడి కూర్చు న్నాడు. రామారావు ముఖం తెల్లగా పాలిపో యింది. శల్యావశిష్టుడైయున్నాడు. కళ్లు నిస్తేజంగా వున్నాయి. దుప్పటీ కప్పుకొని చలపతిరావు వైపు తిరిగి పడుకునివున్నాడు.

చల—నాయినా! ఇప్పు డెలావుందిరా వికారం?

రామా—(హీనస్వరంలో) కొంచెం వయమే.

చల—జావ కాచమంటావా?

రామారావు మాట్లాడలేదు.

చల—అమ్మాయీ! ఇలా రావే ఒకమాటు.

ఈపిలుపు వినబడి లోపలినుంచి సుబ్బమ్మ ఆదుర్దాగా సావిట్లోకి వచ్చింది.

సుబ్బ—ఏం! మళ్లీ జెళ్లిపోయిందా?

చల—లేదు కాని జావ కాచి తీసుకొస్తే పుచ్చుకుని కళ్లు మూసుకు పడుకుంటాడు. చాలా నిస్త్రాణగావుంది వాడికి.

సుబ్బ—(రామారావు ముఖంమీద వంటిమీద చెయ్యివేసి చూచి) జరం కొన్నగింజ వేస్తే పేలగింజలా వేగుతూంది. నిన్నటికంటె యెక్కువైనట్టుంది.

చల—(లేచివచ్చి చూచి) వుందికాని వాడిక్కడి కొచ్చిన రోజున మరీయెక్కువగావుంది.

సుబ్బ—(కళ్లనీళ్లతో) ఇదంతా నా పాపం. వొక రోజుకంటె వొకరోజు అసలే తెలివితేటా లేకుండా పోతూంది! కుర్రాడింటి కొచ్చాడన్న సంతోష మేముంది? ముందుగా రెండు కొరివి పెడుతున్నారా అనుకున్నాను. ఇంత జబ్బు చేసిందనుకోలేదు. వైద్యు డేమన్నాడు? నాన్నా!

చల—ఏదీ! ఇవాళ మళ్లీరాండే! నిన్ననే చెప్పాడు. అన్నం మాత్రం పెట్టొద్దని. కామిగాడికైనా పంపించాలి ఆయనింటికి.

రామారావు మగతగా కళ్లు మూసుకుని పడుకున్నాడు.

సుబ్బ—మన కీవూళ్లో దిక్కా మొక్కా అని నేను మొదట్నుంచీ మొత్తుకుంటూనేవున్నా. మన సంగతి కనుక్కునే నాథు డేడీ—యిప్పుడు? మనకండ లేదురా నాయినా, నువ్వన్నిటికీ వరుగులెత్తకురా అని చిలక్కు చెప్పినట్టు చెప్పాను.

చల—సరే గాని, వాడి జావసంగతి చూడు—ముందు.

సుబ్బ—ఇంట్లో పాలేవీ? కామమ్మగారింటికెళ్లి అడిగాను. మధ్యాహ్నం కాఫీకి సరిపడ్డ పాలే వున్నాయి, పొద్దున్నే అడగలేకపోయారా అంది ఆవిడ.

చల—అయితే మరి పాలెక్కడ దొరుకుతాయి?

సుబ్బ—ఈ చుట్టుపక్కలవారి కెవరికీ పాడిలేదు.

చల—ఈ రోజుల్లో కాఫీలు తాగనివా రెవరూ? ఎవరింట్లోనైనా కాసినిపాలు దొరక్కపోతాయా?

సు—వాళ్లు కాఫీలు మానుకుని మనకి పాలుపోస్తారా?

చల—అదేమిటే? అమ్మా! లోకమంత గొడ్డుపోయిందటే? జబ్బు చేసినవాడికి కాసిని పాలచుక్కలు పొయ్యమంటే పొయ్యరటే—అమ్మా?

సుబ్బ—నేను రెండుమూడిళ్లు వెళ్లి అడిగొచ్చాను. వాళ్లు మాయింట్లో లేవని చెప్పారు స్పష్టంగా. నాకు ప్రాణం చచ్చిపోయింది. ఆఖరికి వాడికి జావలోకి పాలుకూడా కొని తెచ్చుకోలేనంత దరిద్రపు కొంపైపోయింది. ఏం చెయ్యను? ఎలా కాచను—జావ?

చల—అయ్యయ్యో! ఇంత విపరీతకాల మేమిటే? ఒకపూట కాఫీ తాక్కపోతేనేమో? సరే, యేం చేస్తాము? కొంచెం పల్చగా నీళ్లతోనైనా కాచుకురా. కాస్త వుస్పైనా యివ్వొచ్చు. ఆలస్యంచేసిన కొద్దీ నీరసం రాదూ—వాడికి?

సుబ్బ—నాయనా! ఎలా వుందిరా?

రామారావు కళ్లు విప్పి చూచి వూరుకున్నాడు. నిస్త్రాణవల్ల వూరికే చెమటలు పోస్తున్నాయి.

చల-ఇంకా చూస్తావేమిటే! వాడికి నీరసమొస్తూంది. త్వరగా కాచి తీసుకురా.

సుబ్బమ్మ లోపలికెళ్లింది. రామారావు మళ్లీ కళ్లు మూశాడు. చలపతిరావు మతిలేనివాడులా కూర్చున్నాడు. ఇలా రెండు మూడు నిముషాలు గడిచాయి. గోపాలం లోపలికొచ్చాడు.

గోపా—ఇదిగో! ఈ పొట్లంలో మాత్రలు. రాత్రి కొకటీ, రేపొద్దున్నొకటీ వెయ్యమన్నాడు—వైద్యుడు.

చల—ఎప్పు డెళ్లావురా నువ్వు?

గోపా—అమ్మ పంపించింది.

చల—ఇంకా సంగతులు చెప్పాలనుకున్నాను. నాతో చెప్పకుండా యెందుకెళ్లావు?

గోపా—ఏమో! అమ్మ పరిగెత్తుకుంటూ వెళ్లి రమ్మంది.

చల—పోనీ- అయన్ని ఒక్కసారి రమ్మనలేకపోయావా?

గోపా—నేను రానక్కర్లేదు- ఈ మాత్రలు వెయ్యమని చెప్పాడు.

చల—ఏమిటో! నీకు సరిగా చెప్పటం చేతకాలేదు.

గోపా—అయ్యో! నేను చెప్పకేం? సరిగానే చెప్పాను. "జబ్బా యేగానీలేదు గాని రోజుకు ముప్పయిమూడుసార్లు రావాలి. నేను రావటమే మీకు చులాగ్గా కనపడుతూంది!" అని విసుగుదలగా మాట్లాడాడు.

ఇంతలోకే సుబ్బమ్మ లోపలినుండి జావతో వున్న గిన్నె తీసుకొచ్చి మంచందగ్గిర పెట్టి, "నాయనా! లేచి కూచుంటావా?" అంది.

రామా—(మెల్లిగా) ఊఁ.

రామారావు మెల్లిగా "ఊఁ" అన్నాడు కాని లేవటానికి శక్తిలేదు. ప్రయత్నించి చూచి లేవలేక వూరుకున్నాడు. సుబ్బమ్మా గోపాలం నెమ్మదిగా లేవదీసి పట్టుకుని సుబ్బమ్మ రామారావు తలని తన గుండెలకి జేరవేసు కూర్చుంది. గోపాలం జావ గిన్నె నోటి కందిచ్చాడు. కొంచెం పుచ్చుకుని తక్కినది వదిలేశాడు రామారావు. సుబ్బమ్మ రామారావు మూతి తుడిచి మళ్లీ పడుకోబెట్టింది. కొంత అది పుచ్చుకోటంతోటే కాస్త నిస్త్రాణ వదిలింది రామారావుకి.

సుబ్బ—ఈకాస్తా కళ్లు మూసుకుని గొంతుకలో పోసుకో నాయనా!



రంగిరేజుకళ



కులాలకళ




కలంకారికళ



స్వర్ణకారిళక

రామా—అంహాం! ఇక తాగలేను.

కామేశ్వరరావు ఆటలతో అలిసిపోయి యింట్లో కొచ్చి కూర్చున్నాడు.

సుబ్బ—ఏమిరా! యెక్కడికి పోయావు?

కామే—ఎక్కడికీ వెళ్లలేదు. వీధిలో నేవున్నా. ఆగిన్నెలో యేముందేఁ? అమ్మా!

సుబ్బ—గోధుంజావ కాచి తీసుకొస్తే కాసినిచుక్కలైనా తాగలేదు అన్నయ్య!

కామే—పోనీ. నా కివ్వవుటే అమ్మా అది!

గోపా—అన్నిటికీ నీకు నాకే నేమిట్రా? అన్నయ్యని తాగనియ్యి.

రామా—(ఆయాసంతో) నాకొద్దురా.

కామేశ్వర్రావు గిన్నె యెత్తిపెట్టుకుని పుచ్చుకున్నాడు. రామారా వొకమారు తమ్ముని ముఖం చూశాడు. కళ్లు నీళ్లతో నిండిపోయాయి. ఒకమాటు రెప్పలు మూశాడు.

సుబ్బ—నాయినా! ఆయాసపడుతున్నావేమిరా? వైద్యుణ్ని పిలుచుకు రమ్మంటావా!

రామా—(ఆయాసంతో) ఆయన్ని తరుచుగా తీసుకొస్తే మనమే మివ్వగలం?

సుబ్బ—ఏం చేస్తాను- నాయినా? తప్పుతుందా!

రామా—ఊఁహూఁ- వద్దు.

మళ్లీ వమనం వెళ్లిపోయింది. ఆయాసం అధికమయింది.

సుబ్బ—(కంగారుపడుతూ) ఒరే గోపాలం! వైద్యుణ్ని వొకమాటు చప్పున తీసుకురారా- బాబూ!

చల—అంత కంగారెందుకే? బక్క పేగులుమీద జావ తాగేసరికి ఆయాసం వచ్చినట్టుంది.

రామారావుకి ఎగశ్వాసెక్కువైపోయింది.

సుబ్బ—(ఏడుస్తూ) నాయినా! వొళ్లు పాడుచేసుకోకురా అని నేను బతిమాలితే వినిపించుకున్నావు కావు కదా! ఎంతట్లో ముంచుకొచ్చిందో!

రామా—(తల్లివైపు చూచి) పరవాలేదు. (అని అనలేక అనలేక తెముల్చుకుని అన్నాడు.)

కాని ఆరాటం యెక్కువైంది. తల ఇటూ అటూ విసరటం ప్రారంభించాడు.

చల—(గుడ్లనీరు గుక్కుకుంటూ) నాయనా! అదేమిట్రా! (అన్నాడు గద్గదస్వరంతో).

ఇంకా యెక్కువైపోతూంది ఆయాసం—రామారావుకి.

సుబ్బ—మాకేం చెప్పావు—నాయినా! (అని యేడవటం ప్రారంభించింది).

చల—నాయినా! కొడుకులు కొమ్ములు లేక నీ చేతిమీదుగా వెళ్లిపోవా లనుకుంటున్నానురా. రామం! నాగతేమిటి నాయినా! అని మంచం దగ్గిర కూలబడ్డాడు.

రామారావు ఏమో చెప్పటానికి ప్రయత్నించాడు కాని చెప్పలేకపోయాడు. తల్లిని తాతగారిని మాత్రం ఒకమారు కళ్లు విప్పిచూశాడు. కళ్లనీరు బుగ్గలమీదికి కారింది. ఏమన్నా మాట్లాడుతాడేమోనని నిశ్శబ్దంగావున్నారు ఇద్దరూనూ. ఎదురుగావున్న గాంధీపటంవైపుచూచి చేతులు బలవంతంగా యెత్తి నమస్కారం చేశాడు.

సుబ్బ—మాతో మాట్లాడవు నాయినా! మాకూ నీకూ ఋణం తీరిపోయిందా! ఇకనించి నా సంతానం యిద్దరేనా? (అంటో బావురు మంది.)

చలపతిరావుకూడా ఆడదానిలాగ ఏడవటం ప్రారంభించాడు.

సుబ్బ—నా తండ్రీ! నువ్వు అతిగారాబంగా చూసిన నీతమ్ముళ్ని నే నెలా పెంచను? నాయినా రామం!

రామారావు కన్నీటితోనే జవాబు చెప్పాడు. ఏకధారగా బుగ్గలమీదినుంచి కారుతున్నాయి. మళ్లీ ఒకమారు తాతగారివైపూ తల్లివైపూ చూశాడు. ఇరువురికీ నమస్కారం చేశాడు. ఇదే తుదినమస్కారం అన్నట్లు భావం కనబడింది కళ్లలో. చేతులు రెండూ గుండెలమీద నేవున్నాయి. రామారావు కళ్లు వాలిపోయాయి.

# సంస్మృతి

శ్రీ కుటుంబరాయశర్మ

౧

అది సుముహూర్తమో! మఱితదన్యమొగాని, కుమారుపై ప్రియం
వదయగునాదుతల్లి తరువాతను రెండవతల్లివైన నీ
పదము లమాయికమ్ము పసివాసనవల్చెడు మన్మనస్సునన్
కుదురుగహత్తికొన్న వివిగో! మయినమ్మునపైని ముద్రికల్

౨

పినవయసప్పుడే చెఱిపివేసినఁబోవలెగాక, యిప్పుడెం
తని ప్రయతించినన్ చెదరునా? మనయిర్వురి పూర్వజన్మలం
దున కరుణంపుటల్లికలుదుయ్యక నుండగవేసికొన్న ము
ద్రణముల నీడలివ్వి,—అచలమ్ములుమానస దర్పణమ్మునన్॥

౩

మునుపు పరస్పరమ్ముకనుమోడ్చితిమే! హృదయాల, నెన్నియో
దినములుగాలభించెనవి దివ్యశివంకరవేళలున్ తమం
తనె నినమొన్న నప్పుడు ముదంపు మహస్సుచిగిర్చిపూచెనా
మనమునకష్టకానన తమఃప్రభ లెంతయువాడుఁదేరఁగన్॥

౪

అనుగతలోకబాంధవుని యస్తమయంబున సుప్త్యవస్థలో
మునిగెడు భూతరాశికది మోహముమూడుచుకాళరాత్రి. నీ
కును-మఱినాకునో! అది, రగుల్కొనుకారుణికచ్ఛవిచ్ఛటల్
గునిసెడుజాగ్రదింద్రియపు కుల్యలతోడి యుషఃకటాహముల్॥

౫

తడఁబడు ప్రేమగుండెలు పదమ్ములలోనికి క్రుంగుపడ్డ, ఆ
చిడిముడిచేతిచేడ్పడిన చేతము వెండియుఁగూర్చికొంచు, నే
నడుగులలోన నడ్గులిడుసంతటి నెమ్మదితోడవచ్చి నీ
కడ జడిమమ్ముఁబడ్డనడకన్ నిలుచుంటిన యేమెఱుంగకన్

౬

ఇటులనిలంబడంగ గతియించు యుగాలునుకూడ నాయెడన్
చిటికలయట్లె తోచుటయుచేతను కాలమె! లెక్కఁదప్పె నం
తట, మెయితాకెఱింగి కనుదమ్ముల తొంగలిఱేకుఱెప్పలన్
బొటబొటనశ్రువారితుటుమ్ముల్ మణులై యురలన్ వెలార్చితిన్॥

౭

అనవరతంబు నీకొఱకునై పలుజాడలఁజూచిచూచి, మెం
దును నినువచ్చురాకను కనుంగొనఁజాలకఁబోయి, యుబ్బరిం
చిన, తరచైనతెప్పల విశీర్ణత చీలికవార్చసోగలా
కనుల సగంబువిచ్చితిని, కాని కనంబడవయ్యె చూపులన్।

౮

భావపరంపరల్ పరుగు వారఁగఁ దెంచెడు మానసమ్ము నం
దే విషయమ్ముఁగూడ నిదమిద్ధమటంచును నిర్ధరింపగా
బోవఁగ పాలుపోవక, కవుంగిట దూఱుదునా! నమస్క్రియా
పావితుఁడౌదునా! యనువివాదము రేఁగ నధోముఖుండనై,॥

౯

ఇల్లునువాకిలిన్, కడకు నిష్టజనమ్మును మాతృభూమి వ్రే
పల్లియుఁగూడవీడి-కనుపాపలుచిల్లులు వోవునట్టు లి
ల్లిల్లును, పల్లెపల్లియల నెవ్వరికోసరమొక్క-పెట్టు చిం
తిల్లుచు త్రిమ్మరన్ వలసితిన్-తుదకట్టిడినిన్ను గాంచితిన్॥

౧౦

నేనువిముగ్ధుఁడై, నిలువునీరయి, నిస్తిమితేంద్రియజ్ఞుఁడై
మానసముతోఁడనిల్బడిన మాపటిజాముల దాటులందునన్
కానఁగలేకపోయితిని, గాని ననున్ కనుఁగొంటి వీవు-లే
దేనియునాపదంబులకి వెక్క-సిపూజలవన్నెచిన్నియల్?

౧౧

నేరక యేరికోరితివి, నేనొక దేవుఁడనంచు నెంచి—కా
శ్మీరహారిద్ర చిహ్నములచేత మదీయపదద్వయమ్మునన్
కూరిచినావుపూజల నకుంఠితభక్తిని, ఖేదవార్నిధుల్
జోరనపొంగిరా, కడవపోతలు కాళులఁగ్రుమ్మరించుచున్॥

౧౨

కొలుకులనీరునిండ, కనుఁగొంటి మదీయముపాదసన్నిధిన్
తలనిడిమ్రొక్కు-వెట్టునిన్ను తత్క్షణమందున లేవనెత్తి; చిం
తలఁగనుదూలెదన్ హృదయతాపముఁ దీర్చికొనంగ; కౌగలిం
తలఁదలఁబెట్టి నీభుజలతాయుగళంబును కంఠమందునన్॥

౧౩

బిగియుగనొత్తఁబోయితి గుభీలునఁ నాపయి నున్న నీదు భ
క్తిగుణముతువచ్చి, నాదయిన కేవలముగ్ధత చిన్నబుచ్చ, ఓ
రగ భవదీయ పాదయుగళంబునకుఁ బ్రణమిల్లునంతలో
బిగికవుఁగింట బందిగము వెట్టితివప్పుడు నన్ను రాధికా!

౧౪

సోలిన అంగసంధులకు సోకెను గాఢసుషుప్తిమూర్ఛ “ఈ
శ్లాఘ్యవపుల్లైనలోకు లెదిరైనను నెంతురుగాక! జన్మజ
న్మాలకు దైవమీవె!”అను మాటలఁగూర్చిన మేలుకొల్పు రా
గాలకు తేలిపోయె గమిఁగట్టిన నిద్దురమబ్బు దొంతరల్

౧౫

అగుఅతుంపు రేయి మనయందొకదీర్ఘపు కౌఁగిలింతయై
సాగిచనెన్ — నినుఁ విడిచి సాగితిలోకభయాన, నంతలో
వేగురుఁబోకగూరి కనువేదురు సైపనిలోక మంతకున్
వేగమెనాకునా మనకవియ్యమువచ్చెను. క్రుంగిపోయితిన్.

## నా ఊహ—కావ్ కావ్!!

కె. ఆర్. కృష్ణశాస్త్రిగారు

ఊరిబయటనుగూర్చుండి యోర్పుమీర
కావుకావుమటంచును కరుణపుట్ట
యార్తిగోనియును యేడ్చెదవమ్మనీదు
మూర్తినెవ్విధి నిక్కట్లుముసిరెచెపుమ!
గృహమునకువచ్చినీ వహరహముమాదు
పెరటియందున్న తాటికొబ్బరులనెక్కి—
మనుజసంచారమెటనైన మసలుచున్న
జూచియరచెదు “కావంచు”చోద్యముగను.
ఇండ్లమీదనుగూర్చుండి యెగిరిమరల
చెట్లమీదకునేగియు చివుకుమనుచు,
అలసటనకుండ దేవాలయంబుఁజేరి
యరవనిడెదీవు కారణమునుగ_లెనె?
కాకివచ్చెను గనుడంచుగర్వమునను
అల్పమతులెంతొ “హుంహం”చునడలగొట్టి
వారిమూర్ఖత నవ్విధిఁ వరలఁజేయ
నెంతురీయిల యెరుగకవింతగాను.
భానునుదయాద్రిబోడజూప వానితోడ
నేకమైయేగుదెంతు వనేకమైన
గిరులదిరుగంగ నస్త్రాద్రికరుగుదనుక;
బిడ్డపాపలు లేరయో పిచ్చితల్లి!
ఎరుకగలెను కాకమా! ఎంతజ్ఞాని
మునుపెనీయొద్ద? తెలియంగనోరులదర మె?
మసలగావంగనిద్ధరి మనుజకోర్కి
గాదుగాదంచు; దైవమున్ గావుమనెదొ?
ఏహ్యమనినిన్ను నెంతురీయిలను బ్రజలు;
అహహ! దెలిసెనునాకిప్పు డందముగను
హీనవై తేమి? మముమించు జ్ఞానివీవ
“కావదైవంబెయిల”నంచు గరవుదమ్మ!

# లక్ష్మి

శ్రీమతి తాయి రోజా కృష్ణవేణి గారు

౧

నభోమండలాన తారలు మిలమిల లాడుతున్నాయి. చంద్రుడికోసం ఎదురు తెన్నులు చూస్తూ పిల్లవాయువులు పచ్చని పైరులమీదనుండి సుగంధ పరిమళాన్ని వెదజల్లుతూ శరీరాల్ని పరిపింపచేస్తున్నాయి.

అప్పుడే భోజనంచేసి తమలపాకులు నములుతూ 'రామూ' అని పిలిచాడు వెంకటస్వామి వీధిలోకొచ్చి.

"ఎందుకు నాన్నా పిలిచారు?" అంటూ వచ్చాడు రాము.

"రామూ! నీతో ముఖ్యంగా ఒక సంగతి మాట్లాడదలచుకొన్నాను. ఇక నేను బ్రతికినంత కాలం బ్రతుకబోను. ఏదో నీవు పెండ్లి చేసుకొని కాపురం చేస్తుంటే చూచి ఆనందించాలని ఉంది. ఏమంటావు."?

రాము మౌనముద్రాంకితుడై వింటున్నాడు.

"నాయనా! లక్ష్మికీ నీకూ ముడిపెట్టేస్తే నా మనస్సులోని ఆందోళన తీరిపోతుంది. దాని తల్లి చనిపోయ్యేటప్పుడు నీకడుపులో పేసుకొని జాగ్రత్తగా చూచుకోమని అప్పగించింది నాకు. చూడు లక్ష్మి బాగుంటుందికూడా. నీవు లక్ష్మిని వివాహం చేసుకోవటమే నేను అపేక్షిస్తున్నా."

రాము నిరుత్తరుడైపొయ్యాడు. అలాగే ప్రతిమలాగ కూర్చున్నాడు.

"రామూ! నీ ఇష్టమేమిటి?"

"నాన్నా! ఏమి చెప్పేది. నా కంఠంలో ప్రాణముండగా లక్ష్మితో నా వివాహ మసంభవం."

"ఏం! ఎందువల్ల?"

"ఏమో నా కిష్టంలేదు. లక్ష్మిని నేను పెండ్లియాడను."

తండ్రి కోపం మితిమీరిపోయింది. ఇంత వ్యతిరేకంగా మాటలు ముదురుతా యనుకోలేదతను. వాగ్ధోరణి గంభీరమైపోయింది.

"నీవు చాల నిర్భయంగా మాట్లాడుతున్నావు. నా మాట రాజశాసనమనుకో. నీ కొకనెల గడువిచ్చాను. ఆలోచించుకొని నా ఇష్టప్రకారం నడచుకొన్నా సరే. లేనియెడల ఈ ఇంట్లో అడుగుపెట్టడానికైనా నీ కధికారంలేదు."

పాపం! ఈ సంభాషణంతా వింటూంది లక్ష్మి ప్రక్క గదిలోనుంచి. ఆమె నేత్రాలు అశ్రుపూరితమైపోయినాయి. ఆ అమాయికబాల తనలోనే ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లింది.

౨

వెంకటస్వామి బందరువద్దనున్న గూడూరులోని మోతుబరి రైతులలో ఒకడు, అతనికి నలుబగి ఐదు సంవత్సరా లుంటాయి. చాల పట్టుదలమనిషి. కోపం వచ్చిందంటే తలలు తలలు బ్రద్దలుకొట్టే రకం. విశేషభాగ్యవంతుడు. కావలసినంత భూమి పుట్రా ఉన్నాయి అతనికి. పొలాలప్రక్కనే ఉన్న పెంకుటింట్లో అతని నివాసం లక్ష్మి రాములతోటి. రాము కొడుకు, లక్ష్మి మేనకోడలు అవుతారు అతనికి. లక్ష్మి శైశవావస్థవీడకముస్నే ఆమె తల్లి నిర్మలపరంజ్యోతిలో కలసిపోయింది. అందువల్ల వెంకటస్వామే ఆమెను పెంచి పెద్దదానిని చేశాడు.

అతడు తరుచు ఈవిధంగా తలపోసేవాడు 'లక్ష్మిరాముల్ని భార్యాభర్తలను చేస్తాను'.

మామ మనోద్దేశము తెలుసుకొని లక్ష్మి గాఢంగా ప్రేమించింది రామునీ. కాని రాము లక్ష్మివిషయమై తలపెట్టనే లేదు ఇరువురు ఒకచోటనే పెరగడంవల్ల.

3

దినాలు అతితీవ్రగతితో గడచిపోయాయి. గిర్రున తిరిగివచ్చింది నెల. తిరిగి అదే జవాబు రాము దగ్గరనుంచి. నాటినుండి రామునీడన్నా పడలేదా ఇంటిమీద.

* * *

'లక్ష్మి'

'ఎందుకు మామా?'

"ఆ వినపడే బాజాబజంత్రీలు ఏమిటో తెలుసునా?"

"తెలీదు, ఏమిటీ?"

"రాము పెండ్లట ఇవ్వాళ లక్ష్మయ్య కూతురు సీతతో"

లక్ష్మి తెల్లబోయింది. అప్రయత్నంగా ఆమె నేత్రాలనుంచి రెండు కన్నీటి కణాలు జారినాయి.

'లక్ష్మీ! జరిగిందేమో జరిగిపోయింది. నీవు రామువిషయం తలపెట్టవద్దు. నా ఆస్తికంతా నీవే అధికారిణివి. నీవు రాముతోగాని సీతతోగాని మాట్లాడినా ఈ ఇల్లు నీదికాదు."

మామ రామువిషయమై చాల క్రూరత్వంగా నున్నాడని విచారించింది లక్ష్మి.

"నేను ఈ ఆస్తికి ఎలా ఉత్తరాధికారిణి నవుతాను. ఇదంతా అనుభవించవలసినవాడు రాము. ఎన్నటికైనా మామ మనస్సు మారవలెను. ముమ్మాటికి మారుగాక" అని తన మనస్సును దిట్టపరచుకొంది లక్ష్మి, మామ అక్కడనుంచి వెళ్లిపోయిన తరువాత.

* * *

"మామా"

"........."

'మామా'

"ఆఁ"

"మరి......"

"........."

"మన రాముడికి కొడుకుపుట్టాడట."

"ఆఁ"

"నే నొకసారి వెళ్లి చూసొస్తా"

"ఏమిటీ!!"

"..........."

"ఏమిటీ?"

"వాళ్లింటికి వెళ్లి చూసొస్తా"

"ఆ నాటి సంగతి మర్చిపోయావా? ఇక ఇలాంటి ప్రసంగాలు నావద్ద లేవద్దు."

పాపం! లక్ష్మి హతాశురాలై గిర్రునతిరిగి లోపలికి వెళ్లిపోయింది కళ్లనీళ్లు తుడుచుకొంటూ.

౪

శీతకాలం సమీపించింది. పనివాళ్లు విసుగు విరామంలేకుండా పొలాల్లో పని చేస్తున్నారు. తక్కిన పనివాళ్లతోపాటు పని చేస్తున్నాడు రాము పొట్టపోసుకోడానికి. ఎంత అగర్భశ్రీమంతుని కొడుకయితే నేమిటి. విధివ్రాత ఎవరు తప్పిస్తారు!

* * *

మధ్యాహ్నము రెండవుతుంది. లక్ష్మి మొదలు నరికిన కదళీతరువువలె నేలకూలి భోరున విలపిస్తూంది. కారణము రాముకు జ్వరమువచ్చి అకాలమృత్యువు వాతపడడమే.

పాపం! ఆరోజంతా ఏడుస్తునే ఉంది లక్ష్మి. కాని వెంకటస్వామి, కొడుకు మరణవార్త విని ఇంచుకన్నా చలించలేదు.

* * *

రాము చనిపోయి నాటికి వారమౌతుంది.

లక్ష్మి కేమితోచిందో కాని హఠాత్తుగా సీత ఇంట్లో ప్రవేశించిందానాడు మామకు తెలియకుండా. నూతనవైధవ్య దుఃఖంతో క్రుళ్లి క్రుళ్లి కృశించియున్న సీతను చూచేటప్పటికి లక్ష్మి నేత్రాలు జలపూరితఘటా లయిపోయినాయి. ఒక్క అదుటున సీతను కౌగలించుకొంది. ఇద్దరూ భోరున విలపించారు చాలసేపు. ప్రక్కనే ఆడుకొంటూన్న ముక్కుపచ్చలారని పసిసిసువు ఇద్దరి ముఖాలు చూచి వెక్కి వెక్కి ఏడువసాగాడు. లక్ష్మి ఆ పిల్లవానిని చేతుల్లోకి తీసుకొని ఓదారుస్తూ "నాయనా! ఇంత చిన్నతనంలోనే పితృవియోగమా నీకు. పాపిష్టి దేవుడికి ఎంత నిర్దయో" అంది.

సీత ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తునే ఉంది.

'సీతా! విచారించి ఏమి లాభం. ఊరుకో.'

......................

"ఎందుకు వెక్కి వెక్కి ఏడుస్తావు"

'లక్ష్మీ, నా బ్రతుకే ఏడ్పు బ్రతుకయింది. ఏమి చేయను అసహాయనై ఉన్నా.'

'నేను ఈ క్షణంవరకు మామ మాటకు వ్యతిరిక్తంగా నడచుకోలేదు. ఇప్పుడు నడుచుకోవలసి వచ్చింది మీ స్థితిగతులనుబట్టి ఆలోచిస్తే. సీతా! నిన్నూ నీబిడ్డనూ మామదగ్గరకుచేరిస్తేగాని నా హృదయంలోని బరువుతగ్గదు. మీ కష్టాలకన్నిటికి నేనే కారకురాలనని నా అంతరాత్మ ఘోషిస్తూఉంది. ఇవ్వాళ మామదగ్గరకు తీసుకెళ్లుతా పిల్లవాణ్ణి. ఏమంటావు? జరిగిందంతా మర్చిపోయి వాణ్ణి ఆశీర్వదిస్తే చాలు.

"లక్ష్మీ! మాకొరకు ఎందుకు నీవు శ్రమలపాల పడకు. వద్దు వద్దు."

సీత వద్దంటున్నా వినకుండా పిల్లవాణ్ణి ఎత్తుకొని వెళ్లిపోయింది లక్ష్మి పొలాలగట్ల వెంబడి.

వెంకటస్వామి తరుచుపొలానికి పొయ్యే దారిలో ఒక గట్టుమీద కూర్చొంది లక్ష్మి పిల్లవాణ్ణి వొళ్లో పెట్టుకొని. వెంకటస్వామి ఆదారినే పొలానికి వెళ్లాడు. లక్ష్మి కూర్చొన్న గట్లవైపు చూడనే లేదు.

భాస్కరుడు పడమటికొండ గర్భంలో చొచ్చాడు. పనివాండ్లు కోతపని ముగించుకొని ఎవరి ఇండ్లకు వాళ్లు వెళ్లిపొయ్యారు. అంధకారం నలుపక్కలా గాఢంగా అల్లుకొన్నది.

లక్ష్మి నిరాశరాలై వెళ్లిపోయింది.

మరునాడు సాయంత్రము. లక్ష్మి పిల్లవాణ్ణి వొళ్లో పెట్టుకొని కూర్చొంది అస్థలంలోనే. వెంకటస్వామి పొలానికి వెళ్లుతూ లక్ష్మిని చూచాడు.

"లక్ష్మి నిన్నటినుంచి ఎక్కడున్నావు? ఆ పిల్లవా డెవ్వరు?"

"మామా! ఈ పిల్లవాడు రాము కొడుకు."

"ఎందుకు వెళ్లావు అక్కడికి? వెళ్లవద్దని చెప్పలేదూ"!!

"నన్ను ఏమి చేసినాసరే. కాని ఈ పసిబిడ్డని మాత్రం ఆశీర్వదించు"

"లక్ష్మీ! ఇది నీవూ సీతా కలసిపన్నిన పన్నుగడ. నా ఆజ్ఞ ఉల్లంఘించావు కాబట్టి ఇకమీదట నా ముఖం చూడొద్దు. పిల్లవాణ్ణి నేను తీసికొన్నా వెళ్లు" అంటూ పిల్లవాణ్ణి ఎత్తుకొని వెళ్లిపొయ్యాడు. పిల్లవాడు లక్ష్మివైపు చేతులుసాచి దీనంగా ఏడ్చాడు వెళ్లిపోతూ. లక్ష్మికి చాలసేపు వినిపించింది ఏడ్పు. కాని పోనుపోను వినిర్మలవాయుతరంగాలలో లీనమై చివరకు వినిపించనేలేదు.

లక్ష్మి అక్కడే కూర్చొని గంటసేపు ఏడ్చింది, జరిగిపోయిందంతా తలుచుకొని.

భాస్కరుడు పడమటికొండ గర్భంలో చొచ్చాడు. కోతపని ముగించుకొని ఎవరి ఇండ్లకు వాళ్లు వెళ్ళిపోయారు. నలుప్రక్కలా గాఢాంధకారం అల్లుకొన్నది. లక్ష్మి ఆగాఢాంధకారంలోపడి సీత ఇల్లు చేరుకొంది.

"లక్ష్మీ! ఏమి జరిగింది? నాబిడ్డడేడీ?" అని ఆత్రతగా అడిగింది సీత.

లక్ష్మి జరిగిందంతా సంగ్రహంగాచెప్పేసింది.

"సీతా! నాకెన్ని ఇక్కట్లు వచ్చినాసరే నా ప్రయత్నంమాత్రం విడువను. పద—మామకాళ్లమీదపడి నీబిడ్డతోపాటు నిన్నుకూడా సంరక్షించమని వేడుకొంటా: అలా నా ప్రార్థనమన్నించకపొయ్యాడా ఇద్దరము ఇక్కడేఉండి జీవితయాత్ర ఏలాగోలాగ గడిపివేస్తాము బాబు పెద్దవాడయి మనకిద్దరికి సహాయపడేవరకు."

ఇద్దరూ బయలుదేరి వెంకటస్వామి ఇంటికి వెళ్లారు. సావిట్లో తాతవొళ్లోకూర్చొని కిలకిలనవ్వుతూ ఆడుకొంటున్నాడు పిల్లవాడు. తల్లిని లక్ష్మిని చూచేటప్పటికి కేకలువేస్తూ తాతముఖముకూడా వాళ్లవైపు త్రిప్పాడు.

లక్ష్మి పరుగెత్తుకొనివచ్చి మామ పాదములపై వ్రాలి "మామా ఆమె నీ కోడలు. ఈబిడ్డడే నీమనుమడు. వీళ్ళిద్దర్ని రక్షించడం నీవిధి. రాము నీమాట జవదాటాడు. నిజమే కాని ఈమె అమాయికురాలు. ఈమె భర్తకు విధేయురాలై తన విద్యుక్తధర్మం చక్కగా నెరవేర్చుకొంది. జరిగిపోయిందంతా మర్చిపో. వీళ్ళని సంరక్షించే భారము నీపైనున్నది. తిరస్కరించడం నీకు ధర్మంకాదు" అన్నది.

లక్ష్మి మాటలు వినేటప్పటికి వెంకటస్వామి మనస్సు నీరయిపోయింది. తనతప్పు ఇప్పటికిగ్రాహ్యమయిందతనికి. కళ్ళనిండా నీరు గిర్రున తిరిగింది. "లక్ష్మీ! చేతులార చంపుకొన్నా నారాముణ్ణి. నాకోపమే ఇంతపనిచేసింది. సీతా! మీకష్టాలకి నేనే కారకుణ్ణి. సీతా—లక్ష్మి—మీరిద్దరూకూడా ఇక్కడే ఉండండి" అన్నాడు. అతనికి దుఃఖము ఇంకఆగలేదు. గంటసేపు బిగ్గరగాఏడ్చాడు రాముని తలచుకొంటూ.

వాడు పెండలుకొని నలుగురు ఆయింట్లో సుఖంగా కాలక్షేపంచేస్తూ ఉండిపొయ్యారు.

లక్ష్మికి ఎన్నోమనువులు వచ్చాయికాని వాటినన్నిటిని తిరస్కరించివైచి అవివాహితగానేఉండి పోయింది.

# పూలమాల

బొడ్డు బాపిరాజుగారు

చల్లనివేళ తావివెదజల్లెడి యీ తెలిమల్లిమొగ్గల
ల్లల్లన మాలగూర్చి సకియా! చిరునవ్వులు తెచ్చికొందు రం
జిల్లినమోవికిన్ ; హృదయసీమను మున్ననుకోక యవ్వె యు
త్ఫుల్లములయ్యె ఏమధురపుందలపుల్ తమిసిగ్గు రేపుచున్ ?

మెత్తనిచేతబట్టుకొని మెల్పుదగన్ సవరించి దానిపై
న త్తరువుల్ గుబుల్కొన దయారొనరించుచు నార్ద్రనప్రమో
దోత్తుగజట్టి భద్రముగనుంచినదానవు చిత్తమందు రే
కెత్తిన ప్రేమవాంఛ ముకుళించిన కన్నుల జాలువారగా॥

కోమలి! తొంగిచూచునదిగో నెలబాలుడు నీ యలౌకిక
ప్రేమరసార్ద్రభావలహరీ భరితమ్ములు సోయగంపు గం
దామరలు ;—ఏటికే యటు లనారతవీక్షణమాలికల్ దిశా
స్తోమములన్ రచించెదవు, చూపవె నీయెదలోని చోద్యముల్ !॥

పెరిగిన తారలట్లు మదిబెంపగునారట, మల్కడై నచో
దిరిగి నిగుడ్తు చూపులను దేపకు దేపకు; నీ నిరీక్షకై
యిరవగునోమునోచుకొనె నే సనమోహసముగ్ధమూర్తి ? నా
డెరుగడొ యేమొకాని, యిటులింతకు రెక్కలతోడ వ్రాలడే!

కమ్మని యూర్పుగాడ్పులకు గందిన నీనగుమోవి యేలవ్య
ర్థమ్ముగ మూగనోములకుదార్ప ; అదేకనుచుండె వీణ, గా
త్రమ్మును మేళవించుచు సుధల్ విరియం బలికించు ప్రేమగీ
తమ్ముల; ఏకుమారపృషదశ్వుడొ తా చెవిజేర్చువానికిన్

పుష్పవల్లితేనెలో పొరలించు వాయుకిశోరమ్ములందించు సూడిదలును
చిగురుమేతల గొంతువగ రెక్క కలకంఠ మాలపించెడి ప్రాతయేలపాట

తెలినీట నోలాడి తేలాడు తొగకన్నె బిలువగా చుక్కల తెఘుకుసైఁగ
వలపులజిక్కి పచ్చలమేడ కేరాణి పోతపోయుచునున్న లేతనవ్వు

జిలుగురంగులచీరల గులుకులొలుకు
నాకుచిలుకలు నెరపు లాస్యమ్ము గలసి
అతనియందునిబద్ధమౌ సఖలదృష్టి
దోచు కొనజూచు పోలికదోచునబల!

ఊరిన రాగమాధురుల నుబ్బిన నీ విమలంపు డెందమం
దేరినగోర్కులం బరిమళింపగ గ్రుచ్చినలీల మల్లికా
హారముగూర్చి యాతని బ్రియమ్మగునట్టు లలంకరింపగా
గోరికబోలు! ధన్యుడెయగున్ అత డీ ప్రణయార్చనమ్మునన్.

తెలియగవచ్చె నీమనసు తెల్లముగా గనుసన్నలందు వ
ర్తిలుమగ డెంతయేని తరితీపుల కూరిమినించుచుండ ని
చ్చలు వలపుంబచేళిమను సంతసమే పనిగాగనుంటి, వెం
దులకయి యింతతొందర యిదోయికవచ్చెడి వేళయయ్యెనే!

రేకరేకున దేనెలు ప్రాకులాడ
పువ్వుపువ్వున వలపులునివ్వటిల్ల
గూరిచినమాల్య మనుభవదూరమగునె?
అదిగొ కాలిచప్పుడు; పోదునమ్మ శుభము!

## పల్లెపిల్ల

గవిని వెంకటకృష్ణయ్య గారు

సీ॥ తాటంకఘటితరత్నప్రభాజాలంబు చెక్కుటద్దాలపైఁ జిందులిడఁగ
భ్రమరాలపంక్తులం బరిహసించు కుటిలకుంతలాల్లుబ్బుల గునిసియాడ
కమనీయ కరకంఠకాంచనాభరణముల్ కర్ణపేయంబుగా ఘల్లురనఁగ
కుందనపుంజాయ నిందించు మైదీపస్వేదాంబుధారల వెల్లివిరియ
తే॥ గీ॥ కూటిదుత్తనునెత్తిపైఁగుదుట నిలిపి
యాతపాతిశయంబున కదరిపడుచు
తడవుమెండాయె ననువంతఁ దండ్రికడకుఁ
బరుగుపరుగునఁ జనుచుండెఁ బల్లెపిల్ల.

సౌభాగ్యవతియగు కల్పలతకు—

నెచ్చెలీ! కల్పలతా! నీయజ్ఞానమింత మేరలు మీరుచున్న దేమి! నీకంటెయు కాసులపేరును అమ్మివేయుదువా? అవి రెండును విక్రయించినచో యిప్పుడు బంగారము మిక్కిలి ప్రియముగానున్నది కావున వేయి రూపాయలకు తక్కువలేకుండ వచ్చునా? అవి యేఅయ్యకైన వడ్డీకిచ్చి నాలుగేండ్లూరుకొనిన అవి అసలునుమించునా? అప్పుడు బంగారమునకుగూడ వెలతగ్గుటచే యింతకంటె అధికముగా నగలైన చేయించుకొందువా లేకున్న సుక్షేత్రమువంటి నాలుగైదుయెకరముల పల్లపుభూమినైన నకొందువా? కొని దానిపై ప్రతివత్సరమునచ్చు అయివేజుతో యేడాది కొక్కనగను చేయించుకుందువా? మంచిది నీఊహాలన్నియు చక్కగా ఫలించినచో నిది లాభసాటిబేరమే సందేహము లేదు. కాని నీఊహాపంచాంగము చదువగ నాకు పక్కున నవ్వువచ్చినది. నీవంటి చదువుకొనినవారిలోనే యింతటి అజ్ఞానలు ఆశాపూరితలు ఆకాశహార్మ్యములు నిర్మించువారు ఉన్నప్పుడు ఇక నితరులనుగూర్చి అనుకొననేల? నీఊహాలన్నియు చదువ పంచతంత్రములోని పేలపిండిబాపనికథ జ్ఞాపకమువచ్చి నాలోనేను నవ్వుకొంటిని. కల్పలతా, మన ఊహాలన్నియు సత్యముగా జరిగిన చక్కగనేయుండును కాని తానొకటి తలచిన దైవమొకటి తలచుట మన అనుభవములోఉన్న విషయము. వడ్డీకిచ్చువారొకటి తలచి యిచ్చుచుండ తీసికొనువా రొకటి తలచి తీసికొనుచుందురు. పుఱ్ఱె కొకబుద్ధి జిహ్వ కొక రుచియని లోకసామెతగాని ఈకాలములో ఒక్కొక్కపుఱ్ఱెకు వేలకొలది బుద్ధులు. "వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహ కురు నందన బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోవ్యవసాయినామ్" అనిచెప్పినట్టుగా మన అవ్యవసాయపుబుద్ధులిట్టివి. ఇట్టిబుద్ధులునమ్మి ఒడలి మీది నగలనువిక్రయించి వడ్డీకిచ్చుట చేతివానినివిడిచి కాలివానిని పట్టినచందము కాదా. కొంచెము నిదానముగాయోచించుము. నీయొడలిపైనున్న పచ్చనిపసిడి నమ్మి నీవు తీసికొనునవేమి? కాగితములు (కరెన్సీనోట్లు). ఆకాగితములిచ్చి నీవువ్రాయించుకొనునదేమిటి? కాగితము (ప్రామిసరీ నోటు). ఆకాగితములవలన నీకు వృద్ధిపొందునవేమి? కాగితములు. ఆకాగితములు అధికమైనచో వారు నీకిచ్చునదేమిటి? కాగితము (ఐ.పి.) ఇంతతో ఆటకట్టు. పైగా ఈవ్యవహారమంతయు అగుటకు నీయొంటిమీద మిగిలియున్న పుస్తెయు పూసయుగూడ తెగనమ్మవలయును. వడ్డీఆశ మొదలుచెఱచు ననిసామెత. స్త్రీకి యిరుపార్శ్వముల ఆస్తికి హక్కులేదు. సొంతసంపాదనాశక్తిలేదు. ఇక యేనాటినుండియో వచ్చుచున్నది వివాహకాలమందు ఏదియో కొంతసొమ్ముపెట్టు సదాచారము. ఇదిగూడ మనస్త్రీలకు మోటు, మొగవారికివెగటు అగుచో చెప్పెడిదేమి? ఇటీవల మన గృహలక్ష్మిలో బంగా

రమా? బ్యాంకా? అను విషయముపై జరిగిన తర్కవితర్కములు నీవును చూచియుందువు. దీని కింతచర్చయేమని నేనానాడు వాని నిగూర్చి ప్రస్తావింప మానితిని. కాని నీవు ఈ విషయమై ప్రస్తావించుటచే నేను చెప్ప వలసివచ్చినది. ఆవివాదములో కొందఱు స్త్రీలుగూడ బ్యాంకులోవేసికొనుట మంచి దనిరి. మఱికొందఱు నగలుచేయించుకొనుటయే యుత్తమమనిరి. ఈవిషయమై వివాదములుచేసిన వారిరువురును సహేతుకములగు కారణములనేచూపి తమవాదములనుసమర్థించుకొనిరి. ఏయుద్దేశముతో యోచించువారి కా యుద్దేశమును సమర్థించుకొను కారణములు దొరకకపోవు. కాని నేనుమాత్రము స్త్రీలకు నగలు అవసరములేదు, బ్యాంకియే మంచిదనువాదమును సమర్థింపజాలను. స్త్రీ ఆభరణములను నిమిత్తమాత్రముగా మోయుచున్నదేగాని యివి నిజముగా పురుషులవే.ఇవి, కేవలము స్త్రీల యలంకారములుగా నిలిచియుండక అనేక సమయములలో అనేక సాంసారికకష్టములకు అక్కఱకువచ్చుచున్నవి. నీకు కొంచెము ఓపిక యున్నచో మన యిరుగుపొరుగుస్త్రీలనే మనకు పరిచయులగు మిత్రురాండ్రనే అడిగి చూతుము. 'మావారికి కొండంతరోగము రాగా మెడలో నాను అమ్మి వైద్యునికిచ్చి మందునిప్పించినా'నని ఒక యిల్లాలనును. తన పెనిమిటి కేదో వ్యవహారపుచిక్కురాగా కంటె తాకట్టుపెట్టి సొమ్ము తెచ్చియిచ్చి పరిష్కారము చేసుకున్నామని మఱియొక యిల్లాలుచెప్పును. 'నాఒంటిమీఁద నగలమ్మిగా మావాడికిబియ్యే చెప్పించిన'దనును, మఱియొకగృహిణి. 'ఈనగలునాల్గు ఉండబట్టిగా సంపాదించేమగవాడు పోయినా బిడ్డలూ నేనూ యింత మానుషముగా బ్రదుకుచున్నా'మని మఱియొక మానవతి జవాబుచెప్పును. మఱియొకసాధ్వి 'నానగలునాల్గు తీసి కోడలికి పెట్టి పిల్లవానికి పెండ్లిచేసినా'మనును. వేఱొక భాగ్యశాలిని 'శిస్తువసూలువాళ్ళు వచ్చి గొడ్డూగోదాజప్తుచేసి పరువుతీయుచుండగా మెడలో నాల్గుకాసులుండగా తాకట్టుపెట్టి ఆశిస్తుచెల్లించి మర్యాదదక్కించుకొన్నా'మనును. ఎన్నియని చెప్పవచ్చును. ఈ గృహస్థజీవితములో డబ్బు యిబ్బంది బహువిధములుగానుండును, అది యెప్పుడు ఏ తీరునవచ్చి యెదుర్కొనునో చెప్పజాలము. అట్టి సమయములందెల్ల స్త్రీయొడలిమీఁది నగలే శరణ్యములై యిట్టిగండగత్తెరలనెల్ల దప్పించుచుండును. ఒకమాఱు నేను మాబంధువులయింటికి వెళ్లితిని. ఆ యింటి యజమానుని కెవరో షావుకారు కార్పణ్యముమీఁదనో, కావలసియో కాని నూటయేబదిరూపాయలకు వారంటు తెచ్చెను. వారు పేదవారుకారు. కాని ఆనాడు పెట్టెలో చిల్లిగవ్వలేదు. జవాను ఆగృహస్థును అటునిటు కదలనివ్వలేదు. ఇంట ఆలగోడు బాలగోడు. 'ఏమే' అన్నాడు పెనిమిటి. గృహిణిగ్రహించినది—చటుక్కున పెట్టె తీసినది. ఏదియో పమిటకొంగు చాటున పెట్టుకొని పొరుగింటికి పెత్తనమునకుపోయి నళ్లిపోయినది—నిముసములో వచ్చినది. పెనిమిటిచేతిలో గలగల కుమ్మరించినది. అతడు

విముక్తుడైనాడు. నాకు ఆశ్చర్యమయ్యెను. నగలలో గల విలువ ఆనాడు విశదితమయ్యెను. ఈవిధల యొడలిమీది నగలవలె ఆపత్సమయమున నక్కఱకు వచ్చునదేదియు గాదనుకొంటిని. మఱియు నివి స్త్రీలకంటె పురుషులకే యెక్కువ ఉపయోగపడునట్లున్నదే అనుకొంటిని. బ్యాంకిలో నిల్వచేసిన రొక్కముగాని, వడ్డీకిచ్చిన డబ్బుగాని పొలములో పండినగింజలు గాని యీవిధముగా సాయపడగలవా? ఈవిధముగా స్త్రీలయొడలిమీద నగలు భద్రపఱచుకొనుట స్త్రీలకంటె పురుషులకే అవసరమేమో అనిపించినది. ఇట్టి పెరటికల్పకము, కొంగుపసిడి, యగు నీసొమ్ములు పెట్టుకొను నాచారమును రూపుమాపి మేనిసొమ్ములు యొలిచి దీపపు సెమ్మెలవలెనుండి వానితో వడ్డీవ్యాపారము చేయనెంచుటయు, బ్యాంకిలో నిల్వచేయ దలంచుటయు వెఱ్ఱియోచన యని నాకుతోచుచున్నది.

స్త్రీలు నగలను ధరించు ఆచారము నిన్న నేటిది గాదు. యుగయుగములనుండియు స్త్రీలు నగలు ధరించుచున్నట్లు ఎన్నియో దృష్టాంతములు గలవు. సమస్త రాజభోగములు పరిత్యజించి సీతాదేవి పతివెంట సాంద్రారణ్యములలో సంచరింప వచ్చినప్పుడుగూడ నగలను ధరించియేయుండెననియు, రావణు డామెను అపహరించి వినువీధిని గొనిపోవునప్పుడు తన జాడ తెలియుటకై సీత తన నగలను తీసి ఋశ్యమూకాద్రిపై చరించు వానరుల ముందు పడవేసెననియు, సీత పోకడను గుర్తించుట కవియే ఆధారమయ్యెననియు మనము రామాయణమున చదివియుంటిమి గదా. ఒక సీత యేమి! మన ప్రాచీనగాథలలో స్త్రీలను వర్ణించునప్పుడెల్ల వారితో బాటు వారి యలంకారముల వర్ణననుగూడ మనము చదువుచుంటిమి గదా. ప్రాచీనచిత్రములను తిలకించినను ప్రతి స్త్రీబొమ్మయు నగలతో నిండియేయుండును గదా. కాన అతి ప్రాచీనమును స్త్రీల సౌందర్యమును ఇనుమడింప జేయునదియు, ఆపదలయందండయై ప్రోచునదియునగు నీ యాచారము సులభముగా నిరసింపదగినది కాదు.

మఱియు పాశ్చాత్య స్త్రీలను మదినిడుకొని ఆధునికులు దీనిని నిరసించుచున్నారు. ఆ పాశ్చాత్యస్త్రీలుగూడ ఇప్పుడిప్పుడు ఆభరణములను ధరించుచున్నారు. అట్టిచో మనవారికి బ్యాంకీపిచ్చియేల?

ఇది యిట్లుండ గడచిన వత్సరము మన భరతదేశమునుండి 120 కోట్ల రూప్యముల విలువగల బంగారు విదేశములకు ఎగుమతి చేయబడినది. ప్రపంచమునందలి సమస్త వస్తుసముదాయములో విలువగలది బంగారు. దీనికంటె విలువైనవి రత్నాదులున్నను అవి నాణెములుగా వినియోగింపదగినవి కావు. కాన సర్వదేశములందును బంగారము గరిష్ఠప్రమాణముగా నెన్నబడుచున్నది. మన దేశమునందు చలామణియగు ఏ కరెన్సీనోటు నిచ్చినను, ఏ యితర నాణెమును ఇచ్చినను మనము మఱియొక దేశమునుండి ఒక్క చిన్న సూదినైనను కొనజాలము. అదే బంగారమగుచో అది

నాణెరూపమున నుండకపోయినను ఒక వస్తువును కొనగలుగుచున్నది. కావుననే యే దేశము విశేషముగా బంగారమునుకూడ బెట్టుచున్నదో ఆ దేశము భాగ్యవంతమైనదిగా భావింపబడుచున్నది. ఇట్టి యమూల్యమై లక్ష్మీప్రదమైన బంగారము కడచిన కొలదిమాసములలో మన భారతదేశము నుండి విశేషముగా నెగుమతి చేయుబడుచున్నది. ఈ బంగార మెచ్చటిది? మన దేశపు శ్రీమంతుల గృహములలోనున్న పాతరలనుండి త్రవ్వబడినదా? లేక దొరతనమువారు విరివిగా చలామణి చేయుచున్న సువర్ణనాణెములా? కాదు. ప్రతి స్త్రీయొక్క యొడలిమీదను ఆచారము ననుసరించి యున్న కొద్దిపాటి బంగారమే, షాహుకారులు మెక్కువ ఖరీదు ఆశజూపి పరిగొనేరి నట్టు లేరగా లభించినదే. చేత కాసు లేదు. వస్తువులకు ధరలేదు. ఎక్కడ చూచినను పెద్దమ్మ తాండవమాడుచున్నది ఈ స్థితిలో తమ యొడలిపై నున్న కాసంత పసిడిని గూడ కాజేసికొనినచో మన హిందూస్త్రీల వంటి తెలితక్కువ పెద్దమ్మ లెవ్వరులేరని నలువురు నవ్వుదురు. బంగారము చాల ప్రియమైనది గాన ఇప్పుడు నగలను అమ్మి కొని బంగారము చౌకయైనతరువాత కొని లాభము తీయవచ్చునను వెర్రితో బొందున పసుపుకొమ్మును కట్టుకొని మెడలోని పుస్తెను గూడ మనవాళ్లు అమ్ముచున్నారే గాని యీ నిలువుదోపు స్త్రీలకు దేశమునకు గూడ అమంగళకరము. కావున నీవు నీ నగలను విక్రయించుట నా కింతమాత్రము సమ్మతముగాదు. సుడిగాడ్పులు విసరినప్పుడు వాని తీవ్రత తగ్గువఱకు పథికుడు ఏ యింటి వాకిటనో నిల్చి తలదాచుకొనినట్లు ఈ డబ్బుకక్కుర్తి దినములలో నీవు నీకున్న నగలను విక్రయింపక, విపరీతపు ధరకు బంగారు కొని, క్రొత్త నగలను చేయించుకొనక యోపికపట్టియుండుము

బ్యాంకులు మునుగుచున్నవి. శ్రీమంతులు దివాలా తీయుచున్నారు. పంటలు శిస్తులనే చెల్లింపజాలకున్నవి. ఈ విషమస్థితిలో స్త్రీలు తమవద్దనున్న బంగారము నిట్లు అమ్ముకున్నచో ఇంతకంటె మఱి మాలిన పని యేమున్నది? దేశనాయకు లిదే ఘోషించుచున్నారు. వినపడుటలేదా?

భావపురి
6-1-33

శారద

## లోక భాంధవుడు

శ్రీ వేంకట వీరరాఘవులు, కవితాసమితి

లోకబాంధవు డనుచు బల్కుదురదేల
నిర్దయాత్ముని, ఆ ద్యుమణిని జనాళి?
తనకరాళాంశువుల లోకతతుల మాడ్చి
గాసిపెట్టెడు రవి లోకకంటకుండు
కాడె? గాంధిమహాత్మ! దీక్షను వహించి
స్వీయ సౌఖ్యమ్ములను తృణప్రాయముగను
వీడి, మానవ లోకాభివృద్ధికొఱకు
రక్త మాంసములను సమర్పణమొనర్చి
నేడు నిరశనవ్రతమూను నీకె భువిని
లోకబాంధవుడన జెల్లుగాక! ఇంక.

# గర్భవతులు

డా॥ దువ్వ శేషగిరిరావుగారు (శ్రీ సోదర సమితి)

సాధారణముగ గర్భమును దాల్చిన స్త్రీలలో బహువిధములగు రోగము లుత్పన్నములగుచున్నవి. ఇందులకు రోగోత్పత్తి యొక్క కారణమైనను ముఖ్యముగ గర్భవతులగు స్త్రీలు తాము గర్భమును ధరించినది మొదలు ఆహారపదార్థములు సేవించుటయందును, దుస్తులు ధరించుట మొదలగు దైనందినకృత్యములయందును జాగ్రత్త వహింపక తమ యిచ్చవచ్చిన రీతిని ప్రవర్తించుటయే కారణము. గర్భమును ధరించిన నాటినుండియు నీ దిగువ వ్రాసిన విధముగ ప్రవర్తించిన అనవసరములగు రోగములు జనింపనేరవు.

## గర్భమును ధరించినది మొదలు ముఖ్యముగ గమనింపదగిన విషయములు

1. ఆహారము:—ఆహారము బలమునిచ్చునదిగను, మితముగను, త్వరితముగ జీర్ణమగునట్టిదిగను యుండవలయును. ఆహారపదార్థములను బాగుగా నమలి మ్రింగవలయును. భోజనసమయమందు ద్రవపదార్థములను అనగా మంచినీటిని మిక్కిలి విస్తారముగ గాక మితముగ త్రాగవలయును. అదియును చల్లని నీరే అయియుండవలయును. ఎందువలన ననగా చల్లనినీటియందు త్వరగా జీర్ణముచేయు గుణమున్నది.

సాధారణముగ నితరసమయములకంటె స్త్రీకి గర్భమును దాల్చినపు డెక్కువ యాహారము కావలయునని చాలమంది తలంచుచుందురు. అది పట్టి పొరపాటు. తల్లి ఎక్కువతిండి తినినచో గర్భమునందలి శిశువు ఎక్కువ బలముగానుండుననెడి యూహతో గర్భము దాల్చిన కాలమందు స్త్రీ లెక్కువ యాహారము సేవించుట కలదు. అందువలన గర్భవతికి నుపకారమునకు బదులు అజీర్ణము మొదలగు రోగము లుత్పన్నములై అపకారమునే కలుగజేయును. మసాలా పదార్థములును, మసాలావేసి వండిన మాంసాహారము, చిక్కని పులుసుకూరలు, బలుహెచ్చుమును కలుగజేయు పదార్థములు, రాత్రులందు వేళతప్పి ఆలస్యముగా భోజనము చేయుట మొదలగునవి మానవలెను. బాగుగా ఉడికించి వండిన మాంసాహారము (అవసరమైనవారికి), సరిగ ఉడికించి వండిన కూరగాయలు, బాగుగా పండిన పండ్లు మొదలగునవి సేవించుట చాలమంచిది. అజీర్ణమును కలుగజేయు పదార్థములు మలబద్ధమును కలుగజేయు వస్తువులును, మత్తుపదార్థములును, "టీ" 'కాఫీ'ని పూర్తిగ వర్జింపవలయును. లేనిచో ఒకానొకప్పుడు తల్లికిని శిశువునకును కూడ ప్రమాదము కలుగవచ్చును.

మన హిందూ ఆచారముప్రకారము సాధారణముగ గర్భిణీ స్త్రీలకు సూడిదలు మొదలగునవి పెట్టుచుందురు. అదియును గాక సూడిదలందు పెట్టు పదార్థములన్నియు నించుమించుగ అజీర్ణమును కలుగజేయు పదార్థములే అయియుండును. సూడిదలు పంపుట కేవలకోరకేదైనను కొందరు స్త్రీలు ఆ పదార్థములను మోతాదుగ నొకటి రెండు తిని యూరకుండుటకు బదులుగ అదేపనిగ వాటిని తిని అజీర్ణము మొదలగు రోగములకు గురియగుచుందురు. ఇది జాగ్రత్తగ గమనించవలసిన విషయము.

2. దుస్తులు:—గర్భము ధరించిన కాలములో దుస్తులు ధరించుటలోకూడ గమనింపదగిన విషయమే! వివాహాది శుభకార్యములకు పోవునపుడును, నాటకాది వినోదస్థలములకు పోవునపుడును సాధారణముగా దుస్తులను బిగువుగా ధరించి వెళ్లుట యాచారమైనది. ఉడుపులను బిగువుగ కట్టుకొనినచో అవి కడుపుపై నెక్కువ బరువును మోపియుండును. అటులుండుటవలన, దినదినాభివృద్ధిని గాంచవలసిన పిండమునకు, నది సహజముగ పెరుగుట కాటంకము కలుగును. అందువలన లోనిపిండమునకును తల్లికిని కూడ ప్రమాదము సంభవించవచ్చును.

గర్భమును దాల్చినది మొదలు సాధారణముగ గర్భాశయముయొక్క నడిమికొలత నగటున రెండంగుళములు మొదలు పదునాలుగంగుళములవరకు పెరుగును. అట్టిదానిని బట్టను గట్టిగ బిగించి కట్టుకొని

పెరుగుట కాటంకము కలుగచేయుట యెంత ఘోరమో యోచింపుడు. అదియునుగాక బట్టను గట్టిగ బిగించి కట్టుకొనుటవలన, గుండెదడ, అజీర్ణము, కాలేయపుజబ్బు, మలబద్ధము, శ్వాసావరోధనము, రక్తముమిరయుట, కష్టతరమైన దగ్గు, మోకాళ్లు మోచేతులు ఉబ్బుట మొదలగు ననేక రోగములుత్పన్నములగును. దుస్తులను యెంచుకొనుటలో కూడ ఆయా ఋతువులకు తగినవిగనుండవలయును, వేసవికాలములో మిక్కిలి ముతకదుస్తులను, శీతకాలములో అతి పలుచని దుస్తులను ధరించరాదు. శరీరమునందలి యేభాగమునకును యెక్కువ బరువు నిచ్చునట్లు దుస్తులను ధరించరాదు. కాళ్ళును, గర్భమును వేడిగానుంచుకొనుచుండవలయును. లేక అవి తడిచు చల్లగానుండినచో తలదిమ్ము లేక గర్భస్రావము కలుగవచ్చును.

పరిశ్రమ:—గర్భవతియగు స్త్రీ యారోగ్యవంతురాలుగనుండుటకును, సుఖప్రసవమునకును, శిశువు ఆరోగ్యవంతముగనుండుటకును, పరిశ్రమ (Exercise) చేయుట ముఖ్యావసరము. మంచి గాలిలో నడచుట మిక్కిలి యుపయుక్తమైనది. పరిశుభ్రమగు గాలిలో నడచుటవలన శరీరమందలి కండరములన్నియు బాగుగా వృద్ధినందును. మరి యే యితర పరిశ్రమవలనగాని యటుల జరుగనేరదు. వేసవికాలములో కంటె శీతకాలమందలి నడకపరిశ్రమ మరియు నుపయుక్తమైనది. అటుల నడచుటవలన, నిప్పుదగ్గర కూర్చున్నప్పటికన్న యారోగ్యవంతమును, శాశ్వతమునగు వెచ్చదనము శరీరమునకు కలుగును. ఆ పరిశ్రమయు ఉదయమున నే భోజనమునకు ముందు చేయుట మంచిది. పరిశ్రమ శరీరమున కారోగ్యము నిచ్చునదియేగాక మనమున కుల్లాసము నిచ్చునదిగకూడ నుండవలయును. చాలదూరము నడచుట, ఎక్కువ గాలి వీచు సమయములందు షికారు పోవుట బరువు వస్తువుల నెత్తుట మొదలగు నాయాసమునుకలుగజేయు కఠినపరిశ్రమలు చేయరాదు. అటుల చేయుటవలన రక్తస్రావములు కలుగుట, గర్భస్రావము కలుగుట, గర్భాశయము క్రిందికిజారుట మొదలగు కష్టములు కలుగుచుండును. గుర్రపుబండిపై షికారు పోవుటకూడ అంతశ్రేయస్కరమైన పరిశ్రమ కాదు. పరిశ్రమ చేయుట కొకవేళ వీలులేకపోయినచో పరిశుభ్రమగు గాలి విస్తారముగ వచ్చుగదిలో కూర్చుని యుండుట మేలు.

మధ్యాహ్నము భోజనమైనపిదప నిదురించుట కొందరి కలవాటు. ఆనిద్దుర ఎక్కువకాలము కాకుండ మితముగ నుండవలయును. గర్భవతిగానుండు రోజులలో వినోదములగాంచుటకొరకు పోవుట, విందులకు పోవుట మొదలగునవి మానుట మంచిది. విచారము, కోపము, ఆద్రైన్యము మొదలగు మానసికోద్రేకముల నెంతమాత్రము కలిగియుండరాదు. ప్రతిదినము చలినీరుతోగాని, గోరువెచ్చని నీళ్ళతోగాని స్నానము చేసి వెంటనే పొడిగుడ్డతో శరీరమును బాగుగా తుడుచుకొనుచుండవలయును. పైనియమములను జాగ్రత్తగ గమనించినచో గర్భవతులగు సోదరీమణులు సుఖముగ ప్రసవించుటయేగాక ఆరోగ్యవంతులగు శిశువులను గాంతురు. (రైట్సురిజర్వుడు)

# వసంతము

శ్రీమతి పీరుభొట్ల రామలక్ష్మమ్మగారు

మొన్న మొన్నటిదాక మోడులై పడిదేకు మ్రాకులెల్లఁజివురు టాకుదొడఁగె
చెట్టుకొమ్మలనెక్కి చివురుటాకులమెక్కి కోయిలల్ హాయిగాఁ గూయఁదొడఁగె
మనమునవిసువుచేమరచిన మిధునంబు రతికేళియనిన సంభ్రమముఁగనియె
వాద్యఘోషప్రభావంబుచే నడెదికొల్ మూఁడై దుగూడి మారోన్మ్రియసాగ
గారడీఁడుచేయు కనికట్టొకోయని
ప్రజలనూస మోదవార్ధిదేల
ఎంతలోనజగము నింతగాజేసెను
సృష్టికర్తమహిమ జెప్పవశమె !

# ఏ క్షణ మెట్టిదో !

శ్రీ రాజా వాసిరెడ్డి. శ్రీ రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద్ బహద్దర్ గారు

ఏనాటికోరికయో ఆనాడు నెరవేరినది. ఆమె జీవితము నాటితో ధన్యమైనది. ఆమెదుఃఖతిమిరమును పటాపంచలొనరించినది నవ్వువెన్నెలను విరియజిమ్ము ఆబుడుతనిమోము. ఎన్ని జన్మములనుండియో ఈ బాంధవ్యముండినట్లు ఆమె తలచెడిది ; ఇట్టి తల పేలయుండవలసివచ్చెనో ఏ హృదయమున కెరుక ?

అది వెన్నెలరాత్రి. రేవానదిచిరుతరంగములపై చిందులుద్రొక్కుచున్న దొకనావ. సమీపమునందున్న దేవళమునందు జరుగనున్న మహోత్సవమును వీక్షింప నేగుచున్నారు కాబోలు జను లా నావయందు క్రిక్కిరిసియుండిరి. నావయం దొకమూల తన నోములపంటయగు కుమారుని ఒడియందుంచుకొని ప్రకృతిసౌందర్యమును విలోకించుచున్న దాపడతి. నావకు రెండవకొనయందున్న యువతియొకతె తన బాలుని నడుమువరకు నదియందు చలినీట ముంచి కలకల నవ్వించెను. అదిగాంచి ఆపడతియొడియందున్న బాలుడు తల్లివైపు తలద్రిప్పి బోసినవ్వులు నవ్వుచు నీటిని తొంగిజూచుచు అమితసంతోషపడుచున్నాడు. అదిచూచిన దా కన్న తల్లి; ముచ్చటదీర నా బాలుని నీటముంచి లేవనెత్తబోయినది;—సాధ్యపడలేదు; ఏదియో జలచరము బాలుని పాదములను గట్టిగా నీటియందు బట్టినది ! ! ఆమె వేఱొకసారి ప్రయత్నించినది, నావ ఆవైపునకు ఒరిగిపోయినది ; అందున్న జనులెల్లరు హాహాకారము లొనర్చిరి.—ఆమె బాలుని విడిచిపెట్టదు—జనులెల్లరు వదలుమని కేకలువైచిరి—కన్నకడుపు—స్వయంకృతాపరాధము—వదలు టెట్లు ? ఆమె వేరొకసారి బాలుని లాగ బ్రయత్నించినది. నావ మరల నీరు పోసికొనినది ; జనులందరు గగ్గోలుపెట్టిరి. ఒకవైపు ఆర్తులగు జనుల ఘోష, వేరొకవైపు కన్నతల్లియొక్క కడుపుమంట. ఒకటి సత్వరము శాంతపడవలయును, వేరొకటి వెంటనే రక్షింపబడవలయును. ఆమె చేయిజారిపోవుచున్నది. నావయందు మరల కలకలము ; జారిపోవుచున్న చేతికి మరల జతగూర్చినదా కన్నతల్లి ; వేరొకతూరి బ్రయత్నించినది. నావయందు మరల గగ్గోలు చెలరేగినది.—ఆమె జీవితమునందలి సర్వసౌఖ్యములతోపాటు ఆమె చేతియందలి చేయి జారిపోయినది.—"శ్యామవియత్తలమున జాబిలిదోనె" మునిగిపోయెను.
—కారు చీకట్లు జగమెల్ల గ్రమ్ముకొనెను.

# పాకకళ

## — మైసూరుపాకం —

మూడుశేర్ల పంచదారను వెడల్పు మూతిగల యినుపమూకుడులోయుంచి కొలదిగా నీరుకలిపి, ప్రొయ్యిమీద యుంచవలెను. పంచదార పాకము వచ్చిన తరువాత ఒక అర్ధశేరు మంచి శెనగపిండి అందుంచి త్వరితముగా కలుపుచుండవలెను. ఈ రెండును కలిసి జారుగాయున్నప్పుడు 4 శేర్ల నేయి తీసుకొని ఒకఘడియ కలుపవలెను. ఒక పళ్లెమునకు నేయిరాచి దగ్గర సిద్ధముగాయుంచుకొని, పంచదార, శెనగపిండి, నేయి బాగాకలిసి ముద్దకట్టు సమయమున అందాపాకము పోయవలెను. తరువాత గడ్డకట్టిన తరువాత ముక్కలుగా కోసి వాడుకొనవలెను.

వి. రామలక్ష్మమ్మ.

## — బూడిద గుమ్మడికాయ మురబ్బా —

బాగా ముదిరిన బూడిద గుమ్మడికాయ తెచ్చి పైన చెక్కుతీసి సన్నగా తురుముడు తీసి ఒక పాత్రలో వేసి కొంచము నీళ్ళుపోసి పొయ్యిమీద పెట్టి వుడకపెట్టవలెను. బాగా వుడికినపిమ్మట దింపి ఒక సన్ననిగుడ్డలో వేసి నీళ్ళులేకుండా పిండి ఒక పాత్రలో వేసి వుంచుకొనవలెను. పొయ్యిమీద పాత్రపెట్టి దానిలో పంచదారవేసి లేతపాకము పట్టవలెను. లేతపాకము వచ్చిన తరువాత ఆ గుమ్మడికాయ తురుము లందులోవేసి బాగా కలపవలెను. 4 లవంగాలు కొంచము పన్నీరు ఇందులో వేసి కలిపి దింపవలెను. బాగాచల్లారిన పిమ్మట అందులోవేసిన లవంగాలు తీసివేసి ఆమరబ్బా గాజుబుడ్లలో వేసిన యెడల బాగాయుండును.

మరకాని తాయారమ్మ.

## —ఐస్‌క్రీమ్ తేలికగా చేయువిధము—

ఐస్‌క్రీమ్ అనగా చాలమందికి తెలిసియేవుండును. కాని దానిని పట్టణములలో అమ్మచోట్ల కొని తినవలసినదే, లేక అది తయారుచేయు యంత్రము వున్నవారు చేయుదురు.

ఈనడుమ మాయింటిలో చాలతేలికగా అందరు చేయగల్గునట్లు చేసినాము. అది ఇందు వ్రాయుచున్నాను.

### చేయువిధము

పాలు మనకుకావలసినవి 1 గాని 2,3 సేర్లు గాని బాగాకాచి, చల్లారపెట్టవలెను. ఆ పాలకు తగిన చక్కెర, కుంకుమపువ్వు పచ్చకర్పూరం ఇష్టమున్న తియ్యటిమామిడిపండ్ల గుజ్జు, వేసి వుంచవలెను. ఆ పాలను మరచెంబులో పోసి బాగా మూతపెట్టవలెను. గిన్నె 1 అడుగుగాని అంతకు కొంచెము పెద్దదిగాని పొడువుగావుండవలెను. వెడల్పు 1/3 అడుగు. అనగా యీ పాలచెంబు ఆ గిన్నెలో పెట్టిన చుట్టుసందు రెండు అంగుళములు వుండవలెను. అయిను పాలకు తగ్గది 3 సేర్లయిన 15 పౌనులు కావలెను. 1 శేరుకు 10 పౌనులు గాని చాలదు. వుప్పు 1 సేరు. అయినుమాత్రం నీరు కాకుండా చాల జాగ్రత్తగా పొట్టుతో మూసివుంచవలెను. ఈ పాలచెంబులో వేసినవిఅన్ని పాలలో కలిసేటట్లు కలిపి మూతపెట్టి, అది గిన్నెలో దింపి చుట్టువుండే సందులో (ముందుగానే మంచును

చిన్నముక్కలు అనగా 1 అంగుళము అంతవిగా కొట్టుకొని వుంచవలెను.) ఈ మంచుముక్కలను వేస్తూ పైన బాగా వుప్పు చల్లుతూ ఈ పాలచెంబు కుతికెవరకు మంచుముక్కలు ఉప్పులో నిండించవలెను. మర పట్టుకొని గిరగిర తిప్పవలెను. ఇట్లు అప్పుడపుడు మంచుగడ్డలు, వుప్పు చల్లుతూ ¾ గంట వరకు గిరగిర తిప్పవలెను. కొంతసేపటికి పాలచెంబు మూత తీయగా ఆపాలు గడ్డకట్టివుండును. అప్పుడు ఒక శుభ్రమైన గరిటెతో చెంబులోని పాలను అందులో గట్టిపడిన పాలను బాగా కలియబెట్టేది. అప్పుడప్పుడు మూతతీసి యీప్రకారము చేసిన అంతా బాగాగట్టిపడి వెన్నమాదిరి అగును. ఆవల యింకా గట్టిపడును. పాలల్లో మంచు వుప్పు పడకుండా జాగ్రత్తగా వుంచవలెను. చాల గట్టిపడువరకు తిప్పుచుండవలెను. ఒక సమయములో మంచు చాలకపోవచ్చును. తిరిగి తెచ్చి అదేవిధముగా చేసిన యంత్రములో చేసినదానికంటె చాల బాగా వచ్చును. గట్టిపడగానే బయటికితీయక అందులోనేవుంచి చిన్నస్పూనుతో పాసర్లలో పెట్టి అందరు భుజించిన చాల బాగుండును. పెద్దగిన్నె చుట్టు ఒకదారము కట్టివుంచిన మరీ మంచిది. తెలియని విషయములు పత్రికాముఖమున తెలిపిన వెంటనే జవాబు ఇవ్వబడును.

వి. సత్యవతమ్మ

— శొంఠి ఉక్కిరి —

1 శేరుబియ్యం 2 జాములు నీళ్లలో నానిన తర్వాత కడిగి 1 తులం శొంఠితో బియ్యం మెత్తగా రుబ్బి కళాయిలో 6 తులముల నేయి పోసి కాగిన తదుపరి యీ రుబ్బినపిండి వేసి కలుపుతూవుండగా కొంతసేపట్కి ఉప్మావలె తయారగును. అట్టిది యింకను కొద్దిగా వేగనిచ్చి తగుమాత్రం పంచదార చల్లి 2 నిమిషముల కాలమైన తర్వాత దింపి భుజించిన చాలా రుచిగాయుండును. ముఖ్యముగా చిన్నపిల్లలకు ఉదయం యీ శొంఠిఉక్కిరి తినిపించుట మంచి ఆరోగ్యకరము.

బాదంపూడి పార్వతమ్మ

— వడలు —

కావలసిన వస్తువులు

(1) 2 ఆళాకులు మినపపప్పు.
(2) 6 పచ్చి మిరపకాయలు.
(3) 1 టేబిల్ స్పూను ఉప్పు.
(4) 1 టేబిల్ స్పూను బియ్యపుపిండి.
(5) 1 టేబిల్ స్పూను నెయ్యి.

కొంచెము ఇంగువ (చిటికెడు) కరివేపాకు. ½ వీశె నెయ్యి.

పొట్టుతీసిన మినపపప్పు గిన్నెలో వేసి నీళ్ళు పోసి నానకముందే వెంటనే పొయ్యిమీద పెట్టి నీళ్ళు కాగడం మొదలుపెట్టగానే దింపవలెను. నీళ్ళు వంచి పప్పును ముద్దగా రుబ్బవలెను. మిరపకాయలు, వుప్పు, ఇంగువ, కరివేపాకు, మెత్తగానూరి పప్పు రుబ్బి వుంచిన ముద్దలో కలపవలెను. బియ్యపుపిండి ఒక పళ్లెములో వేసి దానిమీద నెయ్యివేసి అరచేతితో బాగారుద్దవలెను. ఇది నురగవలె వచ్చును. ఈ నురగమీద పప్పుముద్దవేసి బాగా కలపవలెను. అరిటాకుమీద చిన్న చిన్న గారెలుగా చేసి నేతిలో వేపవలెను.

నాయని కమలరత్నం

— మీగడబూరెలు —

చిక్కని మీగడ అనగా బర్రెపాలమీగడ, పాలుతో కలవక గట్టిగా ఉండునట్టిది, తీసి ఒక పళ్లెమునం దుంచవలయును. కొన్ని పటిక బెల్లం ముక్కలు అట్టే పెద్దవికాక చిన్నవికాక, ఒక మాదిరిగాయుండునట్లు కొన్ని యేరి యుంచవలయును. పిదప మీగడ కొలిచినట్టి గిన్నెతో మూడు గిన్నెల మైదాపిండి ఒక గిన్నె వరిపిండి కొంచెము సోడాగుండ వేసి మామూలు బూరెలుకొప్పు లాగున, కలుపవలయును. పొయ్యిమీద బూరెమూకుడు పెట్టి అందులో పావుసేరు మంచి నెయ్యి పోయవలయును. బాగుగా కాగినతరువాత ఒక్కొక్క పటిక బెల్లంముక్క చుట్టూ మీగడవేసి కప్పి, బూరెలతోపులో ముంచి నేతిలో దోరగా వేయించి తీయవలయును. వేడిగా భుజించిన బహురుచిగా నుండును.

చ. లక్ష్మీనరసమ్మ.

# గానము

## ఆత్మయజ్ఞము

(మహాత్ముని మహోపవాస ప్రారంభమునఁ బాడినది.)

(చనుమర్తి. కృష్ణమూర్తి)

శ్రీరాగము - ఆదితాళము.

సా-, ని-పమ-రీగరి ♦ సా-, ప ♦ రి మ-పని॥ సా॥
శ్రీ-, మ-తులు-విన- ♦ రే-, క్షి ♦ తివె-లయు॥ శ్రీ॥
1. రీగ సారి నీస పాని పమపని ♦ సాని పదనిపమ ♦ రిగరిస రిమపని॥ సా॥
ఆమహాత్ముడిట్లు చెప్పె నిజమగు ♦ ప్రేమవలననరు ♦ లనుగెలువుమనుచు॥ శ్రీ॥
2. సా రిగరి సానిపమ పని సరిగరి ♦ గారిసని రిసని ♦ పమ పనిస రిగరి॥ సా॥
వీరులకు మోక్షగతి యదిదొరకును ♦ భీరులకుదొరక ♦ దెపుడనుటనిజము॥ శ్రీ॥
3. సనస నినిసస రిసస పనిప సనిస ♦ గరిస గరిగరిని ♦ స పనిసరిగరిస।
పెరిమ గరిమకు వెలలు గిలలు గలవె ♦ వెలయ నుసురులని ♦ డి విలువవలయును।
రిగరి సరిస నిసని పనిప మపనిస ♦ సరిగ నిసరి పని ♦ స మపని రిమపని॥ సా॥
పరుల కొరకు బ్రతుకు నరగు ణాయుతుడు ♦ పడయు నిరత మున ♦ ల పరమ
సుఖమ ను॥ శ్రీ॥
4. నీప సానీపమరి గారి గారి ♦ సరిస నిసారిమ ♦, మ నిసరిమ పమ।
దార పుత్రాదులను భోగ భాగ్య ♦ తతిని బరిత్యజిం ♦, చి శరణని మన।
పాని మపసీసీని మపనీపని ♦ రీనిప మా మరి ♦, గరిస రిమపని॥ సా॥
సార దనుఁవర్పించి నపుడేకద ♦ ఆహారి నా మకి ♦, ర్తన రుచిదెలియు॥ శ్రీ॥
5. పాపనినిప సనిప మాప రీమప ♦ దని పమ రిగారి ♦ సరి సనిసా,,।
ముత్తియముల వలచు వాడు సాగర ♦ ముచ గడు గభీర ♦ మున మునుగుగా,,।
సీసనిస రిగరిస సీస రిమపమ ♦ పసని పమరి గరి ♦ నిసరిమ పా,,।
మిత్తినతి చులకన జేసి యిడుమల ♦ మెలగి మెలగి యట ♦ మరిచెల గుగా,,।
పానిపామా పనిస రిగరి సాస ♦ గారీససా రి ♦, మపా నిసగరి॥ సా॥
చత్తునేమో యనెడు పిరికి పంద ♦ సాధించునా యా ♦, గ ముత్యములను॥ శ్రీ॥
6. మపమ మపామ రీమపమ రిపమా ♦ సానిపమాసని ♦ పామా నిపామ।
అనల పరీక్ష సేయుటయె కనుమా ♦ ఆ పరమాత్ముని ♦ ప్రేమా ప్రభావ।

రిగరిస నిస రిగరి సరిస నిసరిమ • పనిప మపనిసరి • మపనిస రిగరిస
మనవ రతము బెరుకు పరువు లిఖనిడె • యరసి పురిమొకతె • రుపునకు బిరబిర
గరిస రిసనిప సనిపమ రిమపామ • సనిపమ రిగరిస • నిసరిమ-పనిసరి॥ సా॥
ఘనులు తదనల మునమల మలమాడి • కనుగొను దురుపర • మపదను-ఖనిరతి॥ (శ్రీ॥

## అనుభవపదాలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

కన్నాతల్లీ పెడితేగా
 కంటికి కూరుకు పడితేగా
 తిన్నాతిండీ అరిగేదీ
 తెవుళ్లు లేకా ఉండేదీ
తల్లీదండ్రులు ఉంటేగా
 తరుగని సేవలు చేస్తేగా
 కొమరుడు వాడని మెచ్చేదీ
 కోటీ దీవన లిచ్చేదీ
ఆలూమగలూ అయితేగా
 అన్యోన్యంబుగ ఉంటేగా
 ఇష్టా సుఖములు పొందేదీ
 ఎడములు లేకను ఉండేదీ
చిన్నాతనమున పుడితేగా
 చిల్కావలెను ఉంటేగా
 చంటీబిడ్డకు మురిసేదీ
 చంకానెత్తుక కులికేదీ
మగడూ తెచ్చిన వైతేగా
 మంచీ వాసన ఉంటేగా
 మగువలు పువ్వులు కోరేదీ
 మానక సిగలో ముడిచేదీ
ఉద్యోగంబున ఉంటేగా
 ఉడుగని గడనను చేస్తేగా
 వాడేమూవాడు అనేదీ
 వారక స్తుతులు చేసేదీ

చీరెలు సారెలు పెడితేగా
 చేతికి రొక్కం బిస్తేగా
 పొలతీ వారిని మెచ్చేదీ
 పుట్టీ నింటీ కొచ్చేదీ
ఆటలు పాటలు ఉంటేగా
 అందఱిదగ్గరి కొస్తేగా
 చిన్నిబిడ్డలె పిల్చేదీ
 చేతిలో పప్పులు పెట్టేదీ
ఇద్దఱిమాట కలిస్తేగా
 ఇరువురు కూడిక చేస్తేగా
 కాపురంవృద్ధి చెందేదీ
 కన్నులపండువుగ ఉండేదీ
చదువుల సరస్వతైతేగా
 చక్కనిరూపము ఉంటేగా
 కన్నెను అందఱు మెచ్చేదీ
 ఘనముగుమనువూ వచ్చేదీ
తమ్ముల దగ్గరతీస్తేగా
 తనంతవారిని చేస్తేగా
 అన్నను తమ్ములు కొలిచేదీ
 అందఱువారిని మెచ్చేదీ
చక్కనిరూపము ఉంటేగా
 చాలినవిద్యా పొందినగా
 తగినావరుడని తలచేదీ
 తనయను ఆతనికిచ్చేదీ




# నిమ్మపండు

యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యం,

నిమ్మపండ్లను వ్యాధులకు తరచు ఉపయోగించి సుగుణము బడయుట అందరెరింగినదే. వ్యాధులను కుదుర్చుటయందేకాక సౌందర్యమును పెంపొందించుటకుకూడ ఇదియుపయోగింపవగునని యీక్రింది విషయములవలవగ్రహింపనగును.

వట్టి నిమ్మరసమైననుసరే పన్నీరులో కలుపబడిన నిమ్మరసమైననుసరే సౌందర్యమును చాలవృద్ధినొందించును.

చర్మము దళసరెక్కినపుడు ప్రతిరాత్రియును ఆ భాగముపై నిమ్మరసమునురాసి తెల్లవారిన పిమ్మట కడిగి వేయుచుండవలయును. ఇందువలన గుణము కనబడును.

దేహముపై పచ్చనిమచ్చలు కలిగినచో వానిపైని తరచుగా నిమ్మరసమును రాయుచుండవలయును.

చర్మము ముసలితనము రాకమునుపే ముడతలుపడు సెడల నున్నితముగ నిమ్మరసమును పైనరాయవలయును.

ఉదయమున నిద్రలేవగానే ఒకగ్లాసు నీళ్లలో ఒక నిమ్మపండురసము పిండి ప్రతిదినము త్రాగుచున్నచో కనులు బాగుగా శేటపడును. ముఖముపై మచ్చలుపోయి మంచివర్చస్సు కల్గును.

గోళ్లమీద మరకలుపడినచో నీళ్లనునిమ్మరసమును సమభాగములుగాకలిపి రాసినచో మరకలుపోవును.

నిమ్మపండురసము చేతులకురాసుకొని కడిగినచో సబ్బురుద్దుటవలనకంటె చాలబాగుగ చేతులుపరిశుభ్రమగును.

దంతములకు నిమ్మరసమును రాసినచో అవి తెల్లబడును. త్వరగా పూడిపోవు. నోరు చాల శుభ్రముగానుండును. పాచిమున్నగునవి పోవును.

జొగ్గుపాడిలో నిమ్మరసముపిండి దానితో పళ్ళుతోమినచో పళ్ళు ముత్యములువలె నగును.

తలరుద్దుకొనిన పిమ్మట 20 ఔన్సుల వెచ్చనీళ్లలో ఒక నిమ్మపండు రసమునుపిండి దానిని రాసినచో తల వెంట్రుకలకు చాలమెరుగు కల్గును. ఈ నీళ్ళను శరీరమునకుకూడ ఉపయోగించనగును. శరీరము చాల మృదువుగ నుండగలదు.

చేతులెఱ్ఱబడి వ్యాధిగ్రస్తములైనపుడు నిమ్మరసము బాగుగా చేతులకురుద్ది Vaseline రాయవలెను. దినముకు 2 మార్లు చేయవలయును.

వస్త్రములుమాసిన నిమ్మపండుకోసి ఆముక్కలను నీళ్ళలోవేసి ఆనీళ్ళు మరుగుచున్నప్పుడు ఆనీళ్ళలోవేసి కొంతసేపు వుడకబెట్టినచో తెల్లగానగును.

చుండుపోవుటకై నిమ్మపండును వాడుటకలదు,

# బాలవిజ్ఞానశాఖ

## పిల్లల పాటలు

సోమయాజుల వెంకటరమణగారు

౧

కాకీ కలారు కాకీ
కాకినోట్లో దీపంబెడితే
దీపందీసుకుపోయి దిబ్బలోవేస్తే
దిబ్బమనకు ఎఱువుయిచ్చె
ఎఱువుదీసుకొని అవ్వాకిస్తే
అవ్వామనకు అన్నంబెడితే
అన్నందీసికొని ఆవుకేస్తే
ఆవుమనకు పాలుయిస్తే
పాలుతీసికొని పంతులుకిస్తే
పంతులుమనకు పద్యంచెప్పితే
పద్యందీసికొని మామకిస్తే
మామనాకు పిల్లనిస్తే
పిల్లపేరు మల్లెమొగ్గ
నాపేరు జమీందారు.

౨

విశాఖపట్నాన వీధిగుమ్మాన
వింతరాచకొడుకు బంతులాడేను
బంతివెళ్లి పాలకొండ సభలోపడితే
యిదియెవరిబంతని వివరించెరాజు
గోలకొండవారి గొలుసుల్లబంతి
పాలకొండవారి పచ్చల్లబంతి
శ్రీకాకుళమువారి చిత్రాలబంతి
బొబ్బిల్లవారిదే బంగారుబంతి.

## చిత్రప్రశ్న

కొత్త సూర్యనారాయణచౌదరిగారు

సీ॥ విపినంబులోపల। నృపతిగోల్పడెనెద్ది నందనందనునకా। నందమెద్ది
వెలినుండిలోనకు। వెలుగొసంగెడిదెద్ది మురికిపాత్రలశుభ్ర। పరచునెద్ది
కంఠహారమునున్న। కంకణరూపెద్ది పెన్నిధిఁగనెద్ది। పేదకొదవు
చిత్రంబువ్రాయుచో। శిల్పికిమొదలెద్ది తవలనిరుచియెద్ది। దంతములకు
అక్కరంబులు మూడేసి। యన్నిటికిని
త్రిప్పిచూచినసట్టులే। నొప్పవలయు
తెలియఁజేయుడు గృహలక్ష్మి। వలనమాకు
సుహితగుణులార లక్ష్మిస। మానులార

# మందమతి మంగమ్మ

శ్రీమతి పింజమూరి వెంకటరత్నమ్మగారు

విశాఖపట్టణమునకు సమీపమున గోపాలపట్టణ మను నొక పల్లె గలదు. అందు గోపరాజు వెంకటరాజుగా రను నొక నియోగిబ్రాహ్మణుఁడు గలఁడు. అతఁ డొక బడిని పెట్టుకొని కొందఱు పిల్లలకు జదువు చెప్పుకొని వారిచ్చు జీతములతో జీవనము చేయుచుండెను. అతని కెల్లవిధముల ననుకూలయగు భార్య యుండెడిది. ఆమె హఠంబున మశూచిక వ్యాధిచే మృతినొందగా, వెంకటరాజున కింట వండి పెట్టువారు లేక, నాయనుబంధువులు లేక, కష్టముగానుండెను. అతనికి నలువదేండ్లు దాటియుండుటచేత, మరల పెండ్లాడుటకు తప్పినది. అదిగాక, యతనికి ధనసంపద మిగుల దక్కువగానుండుటచే, నెవ్వరును పిల్ల నియ్యకుండిరి. మరల నుద్వాహమాడవలెనని యతఁ డెన్నో విధముల బ్రయత్నించాడు. ఎందును సాధ్యము కాకుండెను. కాకినాడలో వితంతూద్వాహ సంఘ మొకటియుండఁగా, వారికి దన స్థితిగతులు తెలియజేసి తానొక వితంతువును బరిణయమాడ గోరుచుంటినని వ్రాసెను. ఆ సంఘమువారియొద్దగల వితంతు బాలికలలో నొక యమాయిక గలదు. ఆమెయు నియోగికుటుంబమున బుట్టినదియే. పేరు మంగమ్మ. రూపవంతురాలు. గుణవంతురాలనియు జెప్పవచ్చును. కాని బొత్తిగా నమాయకురాలగుటచే నెందఱో వరులు వచ్చియు, నామె పాణిని గ్రహించుటకు నిరాకరించిరి. ఆమె యా సంఘమువారియందజేరి యొక యేడాదియైనను, వరుడు దొరకకుండుటచేత నిర్వేదము వహింప జొచ్చినది.

వెంకటరా జామెనుగూర్చి విని, యొకసారి కాకినాడకు బోయి, యామెను జూచి, సర్వవిధముల సంతుష్టి జెందెను. తెలివితక్కువ పిల్ల గావున, సంసారము పాడుచేయునేమోయని యించుక శంకించెను. కాని తన పేరు వెంకటరాజగుటయు, నామె పేరు మంగమ్మ యగుటయు తలచి తిరుమలవేంకటేశ్వర మంగదాయారమ్మలవలె దాముకూడ దాంపత్యసౌఖ్య మందవచ్చునని యూహించెను. ఎక్కువ తెలివిగలదియైన దనకొలది రాబడిని జూచియు దన యుత్తరవయస్సును మనస్సులో బెట్టుకొనియు దన్ను దిరస్కరింపవచ్చుననియు, గొంచెపు తెలివి గలదియే తన కమరుట మంచిదనియు దలపోసి మంగమ్మను బెండ్లియాడుట కియ్యకొనెను. మంగమ్మయు వెంకటరాజును బెండ్లాడ నిచ్చగించెను.

ఒక శుభదినమున వారికి బెండ్లియైనది. మంగమ్మను దీసికొని వెంకటరాజు గోపాలపట్టణము చేరెను. అది పల్లెటూరగుటచే నందలి జనులు పూర్వాచారపరాయణులై, యతనిని వెలివైచిరి. వెంకటరా జదియు దనకు మేలేయని యూహించెను. నూత్న దంపతులు సుఖముగా గాపురము చేయుచుండిరి. ఒండొరులు పేళ్లతోనే పిలచుకొనుచు జనవుగానుండిరి.

ఒకనాడు వెంకటరాజు బడిని తనిఖీ చేయుటకు ఇన్స్పెక్టరుగారు వచ్చిరి. ఆయనతో దాను జాల తడవుండవలయును గావున, మధ్యాహ్నవేళ దా నిలు సేరునప్పటికి మిక్కిలి యాకలితోనుండవలసివచ్చునని తలచి, వెంకటరాజు భార్యతో "మంగూ! నేను మూడుగంటల కింటికి వత్తును. అప్పటి కాఁకలితో నావురావురుమని వత్తును. కావున నింత మినుపరొట్టె చేసి, కొంచెము కాఫీ కాచుమీ" అని చెప్పెను. మంగమ్మ సరియేయనెను.

వెంకటరాజు నింట నొక పాఁడియావును, గావలికుక్కయు పెంపుడు పిల్లియు గలవు. ఆ యావుపాలు దంపతుల కిద్దరకు సరిపోవును. మంగమ్మకు వంటచేయుట తిన్నఁగా తెలియదు. పాఁడి చక్కగా జాగ్రత్తపఱచుకొన నేరదు. అయినను, వెంకటరా జెటులనో కాలక్షేపము చేయుచుండెను. భర్త యాజ్ఞనుబట్టి మంగమ్మ మినుపపప్పు రుబ్బి మూకుటరొట్టె జేయజొచ్చెను. రొట్టె పూర్తిగా గాలినతర్వాత బొయ్యిక్రింద మంటయార్పి, కాఫీకి పాలు తేవలెనని యింకొక గదిలోనికి బోయెను. పాలకుండమీద మూఁతవేయుట మఱచుటచే పెంపుడు బిల్లి పాలన్నియు ద్రావుచుండెను. కాని కొంచెము మిగిలియుండెను. అందు వెరసులు చాలగా బడుటచేత నొక్కొకటియే జాగ్రత్తగా దీయుచుండ, నొక యంశము జ్ఞప్తికి వచ్చెను. "అహా! మఱచితిని. కుక్కను గొలుసుతో గట్టివేయలేదు కాబోలు. అది రొట్టెముక్క నెత్తుకొనిపోవునేమో! ఈ వెరసులు తర్వాత దీయవచ్చును. ఈ

పాలను గుంపటిపై ముందుగా పెచ్చబెట్టెద" అని తనలో దాఁ బల్కికొని, ఉన్న కొంచెపు పాలను గుంపటిమీద బెట్టి, రొట్టెమూకుడు దగ్గఱకు రాగా, నందు రొట్టె లేకుండెను. ఒకమూల గూర్చుండి కుక్క దానిని తినుచుండెను. దాని నోటినుండి లాగికొని, మిగిలినదైన బుచ్చుకొందమని యత్నింప, అది పాఱిపోయెను. దాని వెంబడి నామెయు బరుగెత్తెను. కాని లాభము లేకపోయెను. "పోయిన దానికై విచారించిన లాభములే" దనుకొనుచు నింటికి మరలెను. ఇంటికి వచ్చుసరికి గుంపటిమీది పాలుపొంగి, యింకను మిగిలియున్నవి హరించిపోయెను. కాఫీ కషాయములో నించుక చక్కెఱ గలిపి యైన మగని కియ్యవచ్చునని, యొక గిన్నెతో వేడి కషాయము తయారుచేసి, దానిని బ్రొయ్యినుండి దింపలేక, క్రింద పడిలివైచెను. ఆ గదియంతయు కషాయముతో నిండిపోగా, భర్త జూచి యేమనునో యని యది పూడ్చుటకు నింట నిలువయున్న గోధుమపిండియంతయు దెచ్చి దానిపై జల్లెను.

వెంకటరాజింటికి నుస్సురనుచు వచ్చి, "మంగా! రొట్టెయు, కాఫీయు దెమ్ము" అనెను. ఆమె జరిగిన కథయంతయు జెప్పెను. "అయ్యో! ఎంత తెలివితక్కువదానవే! రొట్టె కుక్కకు బెట్టి, పాలు పిల్లికి బోసి, కాఫీకషాయము కాలదన్ని, గోనెడు గోధుమపిండియు గొంపనిండ జల్లితివే? ఇట్లు నీతో గాపురము నాకేమి సుఖమే?" అని వెంకటరాజనెను. "నాకేమి తెలియును? మొందట నేను రాగానే నాకు మీరన్నియు జక్కగా బోధచేయ రైతిరి! నాకేమి తెలియును?" అని మంగమ్మ మార్వలికెను.

పాలతి బుద్ధిహీనత కనిపెట్టి వెంకటరాజు తాను సంపాదించియున్న రెండు వందల రూపాయలు పెట్టెలోనుండగా, వానినిగూడ నామె పాడుచేయు నేమోయని భయపడి, వానితో కాసులుకొని యా బంగారు కాసులనే తన కోటుబొత్తములుగా జేయించుకొని, ధరించి తిరుగజొచ్చెను. భార్య "యీ బంగారుబొత్తము లెక్కడివి" యని యొకనా డడుగగా, నాతడు "ఇవి బంగారపువి కావు. ఇత్తడివి. చాల చౌకగా గొంటిని. వీనిపై నాకు ముచ్చట గలదు గావున, నీవు ముట్టకు"మని చెప్పెను. మంగమ్మ ముట్టనని యొట్టుపెట్టుకొనెను.

ఒకనాడు పింగాణీ గిన్నెలు, పళ్లెములు నమ్ము వర్తకులు కొందఱా వీధిని వచ్చిరి. వారిపై జిత్రవర్ణములు వేయబడియుండుటచే నవి మంగమ్మ కన్ను గుట్టినవి. ఆ వర్తకుల బిలిచి వాని వెల యడిగినది. వారు కొన్ని రూపాయల వెల చెప్పగా, "అయ్యా! నా భర్తగా రింట లేరు. నాయొద్ద డబ్బు లేదు. నాకు గావలసిన సరకులిచ్చి, సొమ్మునకు మరల వత్తురా?" యని యడిగెను. వారు వీలులే దనిరి. "మాయింట నే ధనమును లేదు. నా భర్త గారి కోటునకున్న యిత్తడిబొత్తాలు మాత్రమున్నవి. అవి వలయునేని పుచ్చుకొని, నాకు గొన్ని సరకు లిండు" అని యామె యడిగినది. ఆమె యాత్రము, వైఖరియుఁ గనిపెట్టి, వర్తకు లామె మూర్ఖయని గ్రహించి, "సరే, ఏవి యా బొత్తా"లని యడిగిరి. మంగమ్మ, "నేను వానిని ముట్టనని వాగ్దానము చేసితిని. మీకు బనికివచ్చునేని, మీరే తీసికొనుడు" అని భర్త గదిలోనికి వారిని దీసికొనిపెల్లి బొత్తాలు చూపెను. వారు సంతసముతో వానిని గ్రహించి, తమ కావడిలోని గిన్నెలును, బల్లెములు, నన్నియు నిచ్చి చనిరి. మంగమ్మ పరమానందముతో వాని నిల్లంతయు బఱచియుంచెను.

వెంకటరాజు కొంచెము సేపటికే యింటికి వచ్చెను. వచ్చుసరికి నిల్లంతయు బింగాణీ వస్తువులతో నిండియుండెను. "ఇవెక్కడినుండి వచ్చిన" వని యాతడు భార్య నడుగగా, నామె "మీ యిత్తడిబొత్తాలిచ్చి యిన్ని సరకులు కొంటిని. ఇది మంచి బేరము కాదా?" యనెను. "ఒసీ, నీ యిల్లు పల్లకాదు గాను. నా కొంపదీసితివే! నీవు తెలివి తక్కువ ముండవనియు, వానిని పాడు సేయుదువని యు భయపడి, యవి యిత్తడివంటిని. కాని బంగారువే. నాకున్న ధనమే యది. అది దొంగలు పాలు చేసితివే! నిన్ను పెండ్లాడినందునకు జాల సుఖపెట్టుచుంటివే!" యనెను. మంగమ్మ, "నన్నేమి చేయుమందురు? నాకేమి తెలియును? నాతో నిత్తడి యనుటచే నట్లు చేసితి. అదిగాక నేను వానిని ముట్టలేదు. ఆ వర్తకులే తీసికొనిరి" అని మార్వలికెను.

"సరే, ఇప్పుడు వా రేమార్గమున బోయి"రని యతఁ డడిగెను. "వా రాకొండపై పురవకే పోయిరి. మనము పరుగెత్తి సల్లిన దొరకుదురు" అని మంగమ్మ యనెను. "కానిమ్ము. పరుగెత్తెదము గాక!

కాని నాకడుపులో దహించుకొనిపోవుచున్నది. నేను రొట్టెలవానియొద్ద గొన్న రొట్టె సగమున్నది. అదియు, మన యావువెన్నయు బట్టుకొనిరమ్మ. దొంగల బట్టుకొన్న తర్వాత వానిని దినెదను" అని యుత్తరమిచ్చెను.

ఆమె, భర్త కోరిన వస్తువులతో, నాతని వెంబడి బయలుదేరెను. భర్త చివచివ నడచుటచే, భార్య వెనుకబడిపోయెను. అతడు వేగముగా కొండ నెక్కిపోయెను. "నా మగడు ముందువెళ్లి దొంగలను బట్టుకొని మరలి వచ్చునప్పటికి, నే నింకను సగము దూరములో నేయుందును కాబోలు. పోనిమ్మ. నాకే మంచిది. కొంత నడకతప్పినది. అయాసము కలుగదు" అని మంగమ్మ తనలో దాను బల్కికొనుచు మెల్లగా నడచుచుండగా, దారిలో పశువులు చెట్లను రాపిడిపెట్టి వీపులను గోకికొనుట గాంచెను. ఆ రాపిడిచేత, నా చెట్లబట్ట లూడుచుండెను. "పాప మీ చెట్లకు చర్మమూడి యెంత బాధ కలుగుచుండెనో! వీని కెవ్వరుదిక్కు? మనకు గాయములైన వైద్యులుందురు. వీని కెవ్వరుదిక్కు? వెన్న పుండ్లకు బట్టించిన గాయము కుదురునందురు. ఈ చెట్ల కీవెన్న రాచెదను" అని యామె చెట్లయం దనుకంపవహించి యా వెన్నయంతయు నీచ్చటి చెట్లకు బూసెను. తర్వాత మెల్లగా నామె కొండ యెక్కుచుండగా, రొట్టెముక్కలలో నొకటి క్రింద బడి దొరలిపోయెను. దానికై తాను బోలేక, "అది యెక్కడనున్నదో మన కెట్లు తెలియుగలదు? రొట్టెను వెదకుటకు రొట్టెయే సమర్థురాలు. కావున, ఈ రెండవ ముక్కను బంపెద. ఇది మొదటిదానింగని మేము మరలి వచ్చునరికి బట్టియుంచు"నని రెండవ ముక్కనుగూడ దిగవిడిచెను.

ఈరీతిగా వట్టిచేతులతో నామె భర్తను గలిసికొని జరిగిన యుదంతమెల్ల నెఱింగించెను. అతడిట్టి మూర్ఖురాలిని గట్టికొన్నందునకు గడుదుఃఖించి, "ఓసీ, వీనియన్నిటి మాటకేమి! వచ్చునప్పుడు వీధితలుపు జాగ్రత్తపఱచివచ్చితివా, లేదా" యని యడిగెను. లేదని యామె బదులుచెప్ప, "ఓసీ నిర్భాగ్యురాలా! యింకను నింటగల యుపకరణములెల్ల దొంగలకు బెట్టవలయుననియా తలుపు భద్రపఱుపక వచ్చితివి? వెనుకకేగి దానిని భద్రముచేసి రమ్మ" అనిపంపెను. "వచ్చునప్పుడు గూటిలోనున్న బాదము కాయలను, ఒక గిన్నెతో గొంచెము మజ్జిగయుం దెమ్మ. చాల ప్రొద్దుపోయినది" అనియు భార్యతో జెప్పెను. ఆమె మగని యాజ్ఞప్రకారము వెనుకకేగి, దొడ్డితలుపునకు తాళము వైచి, వీధితలుపు పైకెదీసి, యదియు, నొక గిన్నెతో మజ్జిగయు, నొక బుట్టలో బాదముకాయలును బట్టుకొనివచ్చెను. భర్త కొయ్యబడిపోయెను. "ఓసీ మందమతిమునిద! వీధితలుపు గూడదీసికొనివచ్చితివా! దొంగలకు మఱియు వీలు గలుగవలయుననియా? అప్పుడే చీకటిపడినది. ఇప్పుడీ కొండ దిగుదుమేని, యే పామో కఱవవచ్చును. నీ జీవముల కేడ్చుచు, నేటికీచెట్టుకొమ్మలపై దాగుకొనియుందము. రమ్మ" అని సమీపమందలి బాదము చెట్టుమీది కెక్కెను. ఆమెయు నలతె బరువుతో నొక కొమ్మపైకెక్కి కూరుచుండెను.

బంగారు బొత్తాలు దొంగిలించిన దొంగలును, ఆ చెట్టుక్రిందకే చేరుకొనిరి. వా రాడుమాటలవలన, వారే తన సొత్తు దొంగిలినవారని యా దంపతులు గ్రహించి, కిమ్మనక యూరకుండిరి. మంగమ్మకు బరువు మిక్కుటముగా దోచగా, "ఏమండీ! ఈ బాదముకాయల మూటవలన బరువెక్కువగానుండి మోపలేకున్నాను. వీనిని దిగవిడిచెద" ననెను. భర్త "వలదు. అనుమానహేతువగును. మనల వారు పట్టుకొందురు. లేక పాఱిపోవుదు" రన్నను వినక, కాయల విడిచిపెట్టెను. అవి చెట్టునుండి రాలిన కాయలని దొంగలు తలచిరి. ఇంకను నామెకు బరువు తగ్గదయ్యె. ఈమాఱు మజ్జిగ నొలుకబోయుదు ననెను. భర్త వలదన్నను వినక యదియు నొలుకబోసెను. దొంగ లది మంచో, పిట్టల మూత్రమో యని తలచి యూరకుండిరి. ఆపల నింకను బరువటులేయుండ నామె తలుపుకూడ గూలద్రోసెను. అది మీదఁబడ జెట్టుపై నేదియో దయ్యమున్నదనుకొని, వారు ధన మచ్చటవిడిచి కాలికిబుద్ధి చెప్పిరి. తెల్లవాఱిన తర్వాత, దంపతులు చెట్టుదిగి చూచుకొనంగా దమ బంగారు దొరకినది.

మంగమ్మ మందమతి యిదివఱ కుపకరింపకున్నను, ఇప్పుడైన నుపకరించెను. ఎక్కువ మూర్ఖతగలవారి మూర్ఖత మొక్కొక్కతఱి నుపకార మొనరింప వచ్చును. కాని వెంకటరాజు తద్దినము కొనితెచ్చుకొన్నట్లు, తెచ్చుకొన్న యీ రెండవభార్యవలన మరల జీవితకాలములో సౌఖ్యము పొందలేకపోయెను.

# ఎన్నెమ్మ కథ

శ్రీమతి మల్లవరపు లక్ష్మీదేవిగారు

[ఈ కథస్నానసమర్త్యేవరకు బాలింత రాలికి ప్రతిదినము చెప్పుదురు. ఈకథ చెప్పుటచేత పురిటిగదిచెంతకు దుష్టగ్రహము లేవియు చేరవనికూడ చెప్పుదురు.]

అనగా, అనగా ఒకఊళ్ళో ఒకబ్రాహ్మణుడు. ఆ బ్రాహ్మణుడికో కూతురు. తల్లి తనకూతురికి ప్రతిరోజు ఒళ్లునలిచి, ఆపిండి ఒకచోట పోస్తూవుండేది. కొన్నాళ్ళకి ఆనలుగుపిండిలోనుంచి ఒకమొక్క పుట్టింది. బ్రాహ్మణుడు, ఆమొక్క పేరు ఎవరైతే చెప్తారో వారికి తనకూతురిని ఇచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. ఈసంగతి వాళ్ళఇంట్లో దూడల్నికాస్తూన్న మాలాడు విన్నాడు. విని కొన్నాళ్ళకి పనిమానేసి ఆఊరునుంచి వెళ్ళిపోయాడు. మొక్క పేరు చెప్పేవారు ఎవరూరాలేదు.

ఐదు సంవత్సరాలు పోయాక, యీమాలాడు బ్రాహ్మణుడులాగుతయారై అవూరు వచ్చాడు. వచ్చి యీబ్రాహ్మణింటికి భోజనానికివచ్చాడు. భోజనంచేసి, చెయ్యి కడుకుగుకొనుటకు పెరటిలోకివెళ్ళి, 'ఏం వండోయి! శాస్త్రులుగారు మీయింట్లో నలుగుపిండి మొక్క మొలిచిందే' అన్నాడు యీమాలబ్రాహ్మణుడు. వెంటనే బ్రాహ్మణుడు సంతోషించి తనకూతురునిచ్చి పెళ్ళి చెయ్యడానికి ముహూర్తంపెట్టాడు. తనకి చుట్టాలెవరూ లేరని, ఆ మాలాడొక్కడే వచ్చి, పెళ్ళిచేసుకున్నాడు.

కూతురికి, అల్లుడికి వేరే ఇల్లుకట్టించి ఇచ్చాడు బ్రాహ్మణుడు. ఈమాలాడు రోజూ సాయంత్రం చీకటిపడినతరువాత తన వేషము తీసివేసి, ఒక గోచీపెట్టుకొని కల్లు పాకలోకివెళ్ళి పూర్తిగాతాగుతూ ఉండేవాడు. కాని యీసంగతి ఎవరికీ తెలిసేది కాదు. కొన్నాళ్ళకి యీమాలాడికి ఇద్దరు పిల్లలుపుట్టారు. ఆపిల్లలు ఎప్పుడూ చెప్పులు ఎత్తుకొచ్చి, కుండపెంకులుతెచ్చి ఆడుకొంటూ ఉండేవారు. ఒకనాడు యీబ్రాహ్మణుడికూతురు నీళ్ళకని బయలుదేరింది, చీకటి పడుతూవుండగాను. తనమొగుడు ముందుగా నడుస్తున్నాడు. కొంతదూరం నడిచాక జందెము బట్టలు తీసేసి ఒక తాటిచెట్టులో పెట్టి, గోచీపెట్టుకొని, చిప్పతీసికొని పాకలోకివెళ్ళడం చూసింది. వెంటనే ఇంటికి తిరిగివచ్చేసింది.

తనపుట్టింటికివెళ్ళి 'నాన్నా, నాన్నా కుక్క ముట్టుకుపోయినకుండకు శుద్ధిఏమి'టని తండ్రినడిగింది. 'నిప్పువేసి తగలెయ్యడమే నమ్మా' అన్నాడు తండ్రి. తిన్నగా ఇంటికి వచ్చేసి, పిల్లలకి తలంటి నీళ్లుపోసి, తను పోసుకొని పిల్లల్ని పడుకోపెట్టింది. నాలుగు కాగడాలు తయారుచేసి, నూనెలోముంచి వెలిగించి, ఇంటికప్పుకి నాలుగువేపులాపెట్టి, తనుకూడా పిల్లలదగ్గిర తలుపులువేసేసి పడుకుంది. కొంతసేపటికల్లా ఇల్లు తగులడిపోయింది. తల్లి, పిల్లలుకూడా ఆమంటలో మాడిపోయారు.

తరువాత యమధర్మరాజుదగ్గరికి వెళ్లింది ఆబ్రాహ్మణపిల్ల; యముడు, నీవు తెలియక మాలాడిని పెళ్లి చేసుకున్నావు. కనుక ఎన్నెమ్మవై, భూమిమీద పురిటిఇళ్ళుకాచుకొని ఉండమని ఆజ్ఞాపించాడు.

# వార్తలు—విశేషములు

ముందుజరుగనున్న బొంబాయిరాష్ట్రశాసనసభలో దేవాలయములోని దేవతలకు కన్నెపిల్లలను దాసీలుగావర్పించు ఆచారమును నిషేధించు ఒకబిల్లును యస్. కే. బోలుగారు ప్రవేశపెట్టనున్నారు. మైసూరురాష్ట్రములో ఇదివరకే ఇట్టిచట్టమును ప్యాసుచేసియున్నారు. ఇట్టి దురాచారమును తొలగించుటవలన దేవదాసీలభ్యసించుచున్న నృత్యగానకళలు నశించుటకు బదులు వాటికళంకములు తొలగి సర్వులును నభ్యసించి వాటి గౌరవాభివృద్ధులు హెచ్చునని టైమ్సు ఆఫ్ ఇండియాపత్రిక వ్రాయుచున్నది.

* * *

జూనునెల రెండవవారములో బెజవాడపురములో ఆర్యవైశ్యసభలద్వితీయవైభవముతో జరిగినవి. 16 వ ఆర్యవైశ్యమహాసభ, వస్తుప్రదర్శనసభ, వ్యాయామసభ, స్త్రీలసభ జయప్రదముగ జరిగినవి. స్త్రీలసభకు శ్రీమతి కొల్లూరు మహాలక్ష్మమ్మగారధ్యక్షతవహించి సంఘోద్ధరణమునకు కవశ్యకమగు అనేకతీర్మానములను ప్యాసుచేయించినారు.

* * *

కేవలక్షీరాహారమును మాని ఫలరసముతో కూడిన మిశ్రాహారమును స్వీకరించు చున్నప్పటినుండియు మహాత్ముని ఆరోగ్యము అభివృద్ధిచెందుచున్నది. అయినను మరికొంతకాలము విశ్రామము తీసుకొననిదీ ఆయన కార్యరంగమున ప్రవేశించజాలడని వైద్యపరీక్షకులు చెప్పుచున్నారు.

* * *

మదరాసు చింతాద్రిపేటయందు పడుపుగృహములను దొంగతనముగ నడిపించుచున్న లంబాడీకన్నెమ్మయను నొకదేశీయవనితను ఆలైసను అను నొక ఆంగ్లోఇండియను స్త్రీని పోలీసులు అరెస్టుచేసిరి.

* * *

బెజవాడపురవాస్తవ్యులు, మనోహరపదకవితాప్రవీణులు, పేరుపడసిన వార్తాపత్రికాలేఖకులు బసవరాజు అప్పారావు బి. ఎ. బి. ఎల్ గారు అకాలమృత్యువు వాతబడుటచే ఆంధ్రయువకలోకమంతయు ననంతచింతాసాగరమున మునిగియున్నది.

* * *

వనపర్తి నైజమురాష్ట్రములోనున్న సుప్రసిద్ధ ఆంధ్రజమీందారీ. దీనికి సంవత్సరము ఒకటికి రాబడి 8 లక్షలరూపాయిలు. మునగాల రాజాగారి మనమలు శ్రీరాజారామేశ్వరరావుగారికి మైనారిటీ వెళ్ళగానే 10 అణాలవంతు అప్పచెప్పబడునట్లును, ఆతని ప్రత్యర్థికి 6 అణాలవంతు అప్పచెప్పునట్లును, అంతవరకు దానిని కోర్టు ఆఫ్ వార్డ్సువారు వ్యవహరించునట్లును, వ్యవహరించుచున్నంతకాలము 4అణాలవంతు తీసుకొనునట్లును కోర్టువారు తీర్పుచెప్పిరి. నైజాముగారీప్రకారమే ఫర్మానాప్రకటించెను.

* * *

జూనునెల 12 వ తేదిని సుప్రసిద్ధకాంగ్రెసు సేవకులు శ్రీయుతులు గద్దె రంగయ్యనాయుడుగారి కుమార్తె శ్రీమతి చిరంజీవి సౌభాగ్యవతి సరోజినీ బాయిగారిని శ్రీయుతులు గుళ్ళపల్లి లక్ష్మయ్యగారి జ్యేష్ఠకుమారుడు శ్రీరాములుచౌదరిగారికిచ్చి

మదరాసులో వివాహము జరిపిరి. పలువురు దేశనాయకులు విచ్చేసిరి. కొందరాశీస్సులనంపిరి. అఖిల వర్ణములవారును కలసి విందులారగించి చందనతాంబూలాదులంది వధూవరుల నాశీర్వదించిరి.

* * *

రోగులగుండె లెట్లుకొట్టుకొనుచున్నవో దగ్గర పోయి గొట్టము పెట్టి పరీక్ష చేయనక్కరలేకయే నూరుమైళ్ళదూరమువరకు సైతము వినిపించగల యంత్రమునొక శాస్త్రజ్ఞుడు కనిపెట్టినాడు. రంపపు పొట్టునుండి పంచదార తయారుచేయుసాధనము నింకొకశాస్త్రజ్ఞుడు కనిపెట్టినాడు...భూప్రపంచము నుండి యితర మండలములలోనికి వెళ్ళి అక్కడ యిండ్లుకట్టుకొని వ్యవసాయాదివృత్తులను బూని జీవించుట కింకా నూరుసంవత్సరములైనను పట్టదని యొకశాస్త్రజ్ఞుడు వ్రాయుచున్నాడు...శాస్త్రీయ జ్ఞానమునకు సాధించరాని దద్ది.

* * *

నాగరిక దేశాగ్రగణ్యమని పేరుబడసిన బ్రిటను దేశములో కొన్నికొన్ని వస్తువులను మార్చుకొను పద్ధతి ఆశ్చర్యకరముగ మనకు తోచును. ఒక పురుషుడు తనభార్యను ఇద్దరుబిడ్డలను వేరొకనికిచ్చి ఒకమోటరుసైకిలును పుచ్చుకొనెను. ఒకయువకుడు తనకంటె పదిసంవత్సరములు పెద్దదైన తనభార్యను, ఆరేండ్లలోపలి వయస్సుగల యిద్దరుపిల్లలను ఇచ్చి ఒకమోటరుసైకిలు నింకొకనివద్ద పుచ్చుకొనెను. ఒక పురుషుడు తనపొరుగువానికి వారమున కైదుషిల్లింగులుచొప్పున నిచ్చుచు అతనిభార్యను తనయొద్దనే యుంచుకొనుచున్నాడు ... ఇద్దరు పురుషులు తమ భార్యలను మార్చుకొని ఆరునెలలయినది. ఇంకను రెండవభార్య వానివద్దకు రాలేదు. ఈవిషయములను డైలీహెరల్డుపత్రికవారు ప్రత్యక్షముగ చూచి ప్రకటించిరి. వార్తాపత్రికలలోని వార్తలసత్యములో, కలికాలానుగుణ్యముగ ఆచారములు మారుచున్నవో, వీనిని నిరోధించు చట్టములులేవో, ఉన్నను వ్యర్థములగుచున్నవో చదువరులే యూహించుకొనవలెను.

* * *

హంగేరీదేశములో డెబ్బదియేండ్ల వయస్సుగల ముసలివాడు చచ్చిపోయినతనభార్యపై విడాకుల దావావేసెను. చచ్చిపోయిన తరువాత విడాకు లేమిటయ్యా అంటే 'ఆమె సమాధిమీద ఆమెపేరుతో కలిసి నాపేరు చెక్కబడియుండుట నాకిష్టము లేదని వాదించుచున్నాడు.

* * *

నేపాళము చాలా పూర్వాచార పరాయణ దేశము. ఆదేశపు మహారాజావారును ప్రధానమంత్రియు మంచి ప్రజాభిమానులు. ప్రజలను నొప్పించకుండ మెప్పించి మంచి సంస్కరణములు పెట్టుట వారిసంకల్పము. వారు ఒక్కపెట్టున నొకచట్టమును ప్యాసుచేసి దేశముపైకి విసరి అతిక్రమించినవారిని శిక్షించుట ప్రారంభించక మహాపండితులనందరిని పిలచి అతి బాల్యవివాహములు అతి వృద్ధపురుష వివాహములను సమస్యలను వారితో చర్చించి శాస్త్ర వాక్యములకు ఉదారమైన అర్థములను వివరించునట్లు బోధించిరి. కాని బ్రాహ్మణులు రజస్వలానంతర వివాహముల కేమాత్రము నంగీకరించక పోవుటచేత బాలికలకు 11 సంవత్సరములలోపుల వివాహము చేయరాదని. వయోనిర్ణయము చేసిరి. 48 సంవత్సరములకు పైబడిన బ్రాహ్మణుడు 12 యేండ్లలోపలి పిల్లను పెండ్లాడకూడదనికూడ శాసించిరి. అనగా అట్టి వారికి వారికులసాంప్రదాయముల ప్రకారము పునర్వివాహమాడుటకు వీలులేదనుట. క్షత్రియ బాలురకు 16 యేండ్లలోపులను బాలికలకు 14 ఏండ్ల లోపులను వివాహములు చేయరాదు. 60 యేండ్లకు పైబడిన పురుషుడు 20 యేండ్లలోపలి పిల్లను పెండ్లాడరాదు. తక్కినజాతులలో రజస్వలాత్పూర్వవివాహములు లేనేలేవు. ఇంతమట్టుకు వారిని మనఃపూర్వకముగ ఒప్పించగలిగిరి.

* * *

# పుష్పచయము

## ఆంధ్రుల చిన్నకథలు:—

ప్రబంధకవులు పచ్చిశృంగారంయొక్క రసం తీశారు. సారస్వతంలో ఆధునికత్వాన్ని పోషించే ఉత్సాహంతో 'కథలు' బయలుదేరాయి. ఆశయం ప్రశంసనీయమైనదే. కాని ఓయమ్మకుమా-యుక్తవయస్కురాలు-ఆటంకములు—వివాహం—అక్కడతో సరి-ఇవి ఆంధ్రంలో బయలుదేరే చాలాకథలు. ఆంగ్లభాషయొక్క విశాలవికాసం ఎరగని ఆధునికులు లేరు. అందు కథలస్థానమును గుర్తింపనివారూ లేరు. కాని అనంతమానవస్వభావమున ప్రేమతప్ప వేరువానికి తావులేనట్లు, అదీ యువతీయువకులకే అర్హాలంకారం అయినట్లు, అదికూడా వివాహంతో అంతరించేటట్లూ తోస్తుంది మనకథలుచూస్తే. ఈలా విమర్శనలు మొదలెడితే చేతనైతే రాసిచూపరాదా? అని మందలిస్తారు మిత్రరత్నాలు.

—సత్తిరాజు కృష్ణరావు

## స్త్రీలు-హిందీభాషాభ్యాసము:—

అందరికిని దొలుత నే హిందీభాషాభ్యాసమునం దాసక్తి కలుగుట దుర్ఘటమగును. కావునఁ దొలుత హిందీపుస్తకములు గృహమునందుఁ బ్రవేశము కలుగఁ జేసికొనుట యెట్లో విచారింపవలసియున్నది. స్త్రీ తన గృహకృత్యములను నెరవేర్చినపిదపఁ గొంతయవకాశము కలుగఁజేసికొని కొంతవిద్యాకృషి చేయుచుండుట చూచుచున్నాము. ఆసమయమున నామె హిందీభాషకుఁగల ప్రాముఖ్యమును గుర్తెఱింగి దాని నభ్యసించినచో మగవారికిని దానియెడ నభిరుచి కల్గును. ఇంట హిందీపుస్తకములున్నపు డెటులైనను, ఎప్పుడైనను మగఁవాడు వానిని బరికింపకపోఁడు. తనకుఁగాకున్నను, తనవనిత చెప్పినపు డామె కొఱకైనను హిందీపుస్తకములను సంగ్రహించుటలోఁ బురుషుఁడు తొలుతఁ బ్రయత్నించకపోఁడు. హిందీభాష చాలస్వల్పకాలములో "హిందీ-తెలుగు వాచకము" లసాయమువలన నెట్టివారికైనను స్వయంకృషివల్లనైనను సుసాధ్యమగుచున్నది. హిందీ మధురభాషయగుటచే దానిసంగతి యొకింత గుర్తించినంతనే సమగ్రముగ దానిని గ్రహింప నుత్సాహము తప్పక కలుగును. మహిళామణు లీవిషయములను బాగుగ గుర్తించి నాబోధనల నించుక యాలింతురు గాక!

—బులుసు వేంకటరమణయ్య.

## సదాచారము మోక్షసాధనము:—

చూడుడు. గతించిన కాలమును సింహావలోకనము సేయుఁడు. కొన్ని విషయములయందు ఎంతో సందేహము: మరికొన్నిఁటియందెంతో చీదర! ఇదియేమి చిత్రము! అతతాయులు—కేవలమాతతాయులు—తాము సేయుచుండిన పాతకములకుఁదగిన శిక్ష నొందకపోవుట యటుండఁగా మీదు మిక్కిలి నానాటికి నెంతెంతయో సుఖవంతులగుచున్నారొక వంక! మరియొకవంకనో! సాధువులు, దయాళువులు, కేవలపరోపకారతత్పరులు, కష్టము వెంటనే వేరొక కష్టము నొందుచు నెడతెరపిలేక బాధనొందుచున్నారు. ఇట్టివారిం జూచునపు డీదేదో పగసాధించుకొనుచున్నదాయని తోచకమానదు. అది యటులుండనిక నైశ్వర్యమో-శ్రీరామా! దానిమాట యడుగనక్కరయేలేదు." దానను ముంగాళ్ళఁదన్ని యేగదులక్ష్మి

కడుల్లో భిక్షానిని కౌగిలించు" "మృష్టాన్న మారోగ్య హీనులకుండును తినగలవారికి దిండి లేదు." ఆరీతో భాగ్యవశమునం గాలోలేక కొందరు జన్మరోగులు. పాపము వారు చాలమంచివారే సుమీ! ఇంక దుర్మార్గులో—నిరంతర నిరామయులు!! ఈ విధముగా నవకతవకలతో నిండియున్న లోకమును జూచుచున్న కొలదియు దీనిగతి యింతేయేమోయనియు దోచుచుండును. "మరియు నేదియెట్లుపోయిన మనకేమి? మనబ్రతుకు తెరుకైనో మనది!" అనియు ననిపించును. నిజమే! ముమ్మాటికి నిజమే!! కాని యట్లనుకొనుట బుద్ధిమాంద్యమే సుమా, ముఖ్యముగా నిట్టి రోజులలో. "ఏది యేలాగు తగులబడితే నేమి—నాయేడు పేర్చోనాడి" యని తప్పించుకొనుట సరికాదు. అటులనుకొంట బుద్ధిమాంద్యమే!—మరలం జెప్పుచున్నాను. నీ వేయవకతవకలనుగాంచి మిక్కిలి కంటగించుకొనుచున్నావో ఆయవకతవకలు నేటివియు నిన్నటివియుం గావు! అనాదులు!! ఇవి యనాదులు!! ఇట్టి విషమవిషయముల నెట్టుల సరిపెట్టికొనవలెనో అదియే తత్త్వదర్శి, శ్రమపడి తాను తెలుసుకొని యితరులకుం దెలియంజేయుచున్నాడు. "ఇదంతా తుదకు నాశనానికే"యని యాలోచించుట తప్పు—ప్రమాదకరమైన తప్పు!! ప్రపంచము నీవనుకొనునట్లులేదు సుమా! ఇది దుఃఖమయమును గాదు. "అయ్యో! నాబ్రతుకేమగును?—ఈనిర్బంధము లెట్లు తొలంగును?—నాయాస్తి యేమగును. ఎవరు తిందురు." అను నీభయములను నీ పరిస్థితుల నెంత మాత్రమును జక్కబరుపంజాలవు సరేకదా నీకు మరింత చెరుపును దెచ్చిపెట్టును. "రానిది రానే రాదిక రానున్నది కోరకున్న రానేవచ్చును." నీ వెంతచింత నొందినను "గానున్నది కాకపోదు" కదా! అట్టిదానికై యీయేడుపు లెందుకు? ఈ యక్కరకురాని యేడుపులతో కుందుచుంటి శరీరమును బాడుచేసికొందువా? "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని నీ వెరుగవా? "బ్రతికియుండిన సుఖములం బడయవచ్చు" ననుట యబద్ధముగా నెంచితివా? వలదు వలదు! అటులెన్నటికిని వలదు!! నీతోడిదే లోకము. నీవుండిన, సర్వమునున్నదే! ఏదీ నీకొక్కపన్ను సంబవీ—అప్పుడు నీస్థితి యెటులుండునో చూడుకో! నీబిడ్డలు నీయొద్దికీడ్చినను నీకు చికాకుగానే యుండునుగదా! ఇక తదితర ప్రపంచముమాట చెప్పనేల? అప్పుడేదిచూచినను నీకసహ్యమే! కాబట్టి అక్కరకురాని వేదాన్తములును విచారములును మనసున కంటించుకొని శరీరమును బాడు చేసుకొనకుందువుగాక! ఆరోగ్యమే భాగ్యము. సుఖములనునవి యారోగ్యవంతుల కాజ్ఞానువర్తనములై యుండును. నేనెట్లు బ్రదుకుదునను చింత యేల? సుఖమనునది ద్రవ్యములోనే లేదు. మరి యెచ్చటనుగూడ లేదు. అది కేవలము నీమనసునందే యున్నది. సర్వసుఖాలవాలమగునట్టి మనసును ఎన్నడును జెడగొట్టుకొనకుండుటయే వివేకము. మనసు బాగుగనుండవలయునన్న, శరీరము కేవలమారోగ్యవంతమైయుండి తీరవలయును. ఈ యారోగ్యము విషయమున నేమాత్ర మశ్రద్ధ సేయరాదు. ఒక్కనాటి మలబద్ధము చాలును—శరీరయంత్రమును దలక్రిందు సేయును. దాన జీవితమంతయు దుఃఖభాజనమగును. అయ్యో! జీవితమన నేమిటిదిగా నెంచితివి తల్లీ! వైకుంఠపాళిలో మాదిగదివంటిదీ మానవజీవితము. సరియైన కట్టుబాట్లతో నీశరీరమును బోషించికొని తన్మూలమున మనసును బదిలపరచికొని దాని సహాయముచే నెనుబామును దప్పించుకొని పరమపదమును బ్రాపించుటయో లేక కట్టుబాటులకు లోంబడక యొడలు పాడుసేసికొని తన్మూలమున నానావికారములనొందిన మనసుయొక్క దౌర్బల్యముచేత 'గోవిందా'యని పెనుబాము నోటం బడి యడుగంటుటయో—అనగా మోక్షమో నరకమో ఈజీవితమున కర్థము. ఇదెట్టిదియైనను మనసునకు లోబడియున్నది. "మనయేవ మనుష్యాణామ్ కారణమ్ బంధమోక్షయోః" అట్టి మనసును నీవు లోబరచుకొనవలెను. దానికేది యుపాయము? కట్టుదిట్టముగా దేహమును బోషించుకొనుట. మనసు

స్వాధీనమయ్యెనా మనము దేవతలతో సమానుల మగుదుమనుటకు సంశయమునులేదు. స్వాధీనమనస్కులకు స్వాధీనముకాని దేదియులేదనుట సాహసము కాదు. స్వరాజ్యము ననుభవించుచున్న మహాత్ముని జూచుచునే యున్నాముకదా! కాబట్టి ఆరోగ్యమే మోక్షసాధనమని యెరుగుము. "ఎప్పుడుపడితే అప్పుడు"—"ఏదిపడితే అది"—"ఎక్కడపడితే అక్కడ"—"ఏగుడ్డలతోపడితే ఆగుడ్డలతో" తిన వద్దు అను నీ మొదలుగాగల నియమములను మన పూర్వులు చేసియుండిరి. ఈ నియమములయందు శౌచముతప్ప మరియొక యర్థములేదు; కాబట్టి వాటిని పాటించుటే యాచారము. ఈ యాచారమే ముక్తిసాధనమగుచున్నది.

### ఏ పుట్టలో నే పాము న్న దో !!

ఒక వైద్యుడు తన యంగడిలో కూరుచొని యుండగా నొక 'రిక్షా' వాడు వచ్చి, "అయ్యా, యింకా దయరాదా! ఈ స్వల్పమునకై యిన్ని మార్లు త్రిప్పదగునా?" యని యింకేదో చదువ సాగెను. వైద్యుడు చిరచిరలాడుచు నా కష్టజీవినిం బట్టి పోలీసువాని కొప్పగించెను. సరి. మరునాడే కేసు—కోర్టువారి యెదుట రిక్షావాడు తన వాఙ్మూలము నిచ్చెను:—"అయ్యా, నా పేరు సతీశచంద్ర రాయ్. నేను బి. యే. పరీక్ష నిచ్చితిని. కష్టపడి బ్రతుకుటయందుగల గౌరవతనమునుగూర్చి "Dignity of labour" అని ఆంగ్లేయభాషలో నొక గ్రంథమును వ్రాసితిని. దాని ప్రతియొకటి యీ డాక్టరు మహాశయులు కొని దాని మూల్యమునకై ముమ్మారు నన్ను త్రిప్పి తుద కిట్లు చేసినారు" అని. మేజ—"బి. యే. పాసైనవాడవు రిక్షా లాగుచున్నావా?!!" ముద్దాయి—ఔను. నే నొక్కడనే కాదు నాతోడి వారు మరిముగ్గురు నలుగురుకూడ నిదేవృత్తి నవలంబించియున్నారు." కోర్టువా రాశ్చర్యము నొందికేసు కొట్టివేసిరి.

### గాంధీ—ఆరోగ్యము:—

ఆహారవిషయమునను, సామాన్యములగు జబ్బుల విషయమునను చేసిన పరిశోధనలవల్ల కలిగిన ముప్పది యేండ్ల స్వానుభవముతో, ఆరోగ్యదర్శని యను గ్రంథమును మహాత్ముడు వ్రాసియున్నాడు. అందులో తేయాకు, కాఫీ, కోకో మొదలగు పానీయములందుగల మంచి చెడుగుల నధికరించి వ్రాసిన యధ్యాయములో చివరకు నా పానీయములు విపరీతములగుట నారోగ్యమును బాడుసేయునని నిష్కర్షగ జెప్పుచున్నాడు. "ఈ వస్తువులలో, పాలును చక్కెరయును కలుపకున్నయెడల, బలకరమగునట్టి దేదియు లేదు. వీటి కలవాటుపడినతరువాత మానుటకు వీలులేదు కాబట్టి యివి మత్తుపదార్థములనుట నిర్వివాదము. ఒక యిల్లాలు తేయాకు కషాయమును సేవించి సేవించి జీర్ణశక్తిని పోగొట్టుకొని తుద కామరణాంతశిరోవేదనకు లోనై బాధపడుచుండుట నే నెరుంగుదును. ఇంగ్లాండులో బాటర్సీ మునిసిపాలిటీలో నొక డాక్టరు, "పరిశోధించి చూడగా మా జిల్లాలో ననేకమంది స్త్రీలకు మెదడు చెడియుండుటకు కారణము, తేయాకు త్రాగుటే" యని చెప్పెను. టీ త్రాగుడుమూలమున నొడలు పాడుచేసికొన్నవారి నే నెరుదుగును." "కఫవాతములకు కాఫీ మంచి"దని కొందరందురు. కాని యిది రక్తమును నీరుచేసి దేహశక్తిని పాడు చేయుట నెరుంగరు. అట్టివారల్లపురసము నేల త్రాగరాదని నే నడుగుచున్నాను. ఇది చాల మంచిది కదా కాఫీకంటె! కాఫీవలన గలుగు చెడుగున కంటె మంచి అతితక్కువ." కాఫీకి బదులుగా:— మంచి బాగుచేసిన గోధుమ లొక కొన్ని చక్కగా బాణలిలో వేయించి—యించుక మాడునట్లు—వాటిని తరువాత పొడిచేసి కాఫీపొడి వాడినట్లే వాడవచ్చును. ఇది కాఫీవలెనే యుండును. పోల్చుకోలేరు సాధారణముగా. నిప్పులమీద డికాక్షను నొక మినిటువరకుంచి పాలును జక్కెరయు జేర్చుట మంచిది. ఇది చవకకు చవక—ఆరోగ్యము జెరుపదు—రుచికి రుచి. పై జెప్పబడిన గోధుమపొడి "గాంధీకాఫీ" యను పేర దేశమునం దసంఖ్యాకులచే వాడబడుచున్నది. సాత్వికాహారములలో గోధూమ యొకటి. పైత్యప్రకోపము చేయునని యందురు కాని దానికి విరుగుడు చక్కెర చేర్పబడును కాబట్టి యా బాధయుండదు.



# నవ్వుతాలు

పంతులు:—మొదటివాడు! "సుందరము" అను మాట వాక్యములో ఉపయోగించు?

మొ:—"మీ ముఖము సుందరమైనది."

పం:—భేష్, రెండవవాడు! "సుందరతరము"

రెం:—మీ ముఖము పందుకోతిముఖముకన్న సుందరతరమైనది.

* * *

గురువు:—దానాలన్నిటిలో గొప్పదానమేదిరా!

శిష్యుడు:—మైదానమండి, గుర్రపుస్వారికి.

పాకల రాజామణి

బాలుడు:—అమ్మా, మిఠాయి కొనుక్కుంటాను అణా ఇవ్వవూ!

తల్లి.—అణా లేదూ, పైసా లేదు. ఊరుకో.

బా:—పోనీలే నువ్వు ఇవ్వకుంటే నాన్న నడుగుతాను.

త:—పాపం! మీ నాన్నదగ్గర మాత్రం ఉంది కాబోలు. నన్ను పెళ్లి చేసుకోవటంచేతనే ఈ డబ్బంతా మీ నాన్నకు వచ్చింది.

బా:—అయితే అమ్మా నన్ను పెళ్లిచేసుకోవూ!

పాకనాటి శ్రీ లక్ష్మీకామేశ్వరి

రంగన్న:—ఓరే, గంగన్నా నాకు కవిత్వం చెప్పడమంటే మహా సరదా కాని నాకు రాదురా దీనిదుంపతెగా!!

గంగన్న:—నాకు కవిత్వం చెప్పడం బాగా వచ్చు, కాని నాకువచ్చినట్లు ఎవరికీ తెలియదు. నీకు చెప్తా చూడు. నేను పద్యములో మూడు పాదములు చదువుతాను నీవు నాల్గవపాదం పూర్తి చెయ్యి.

రంగన్న:—అలాగే

గంగన్న:—వీధిలో కుక్కలు మొరగగా
మనసులో భయమెంతో వేయగా
నేను యిట్లట్లు చూసిగా

రంగన్న:—(ఏమియుతోచక) గంగన్ననీ ముండ మోసిగా

గంగన్న:—ఛీ, గాడిదకొడకా!!

కే.యస్. ప్రకాశరావు

ఒక కొళాయివద్ద నీరుకొరకు వచ్చిన ఒక పురుషుని, స్త్రీని దూరమునసున్న ఇంకొక స్త్రీ చూచి, వారివద్దకు వచ్చి, పురుషునితో, మీరిద్దరూ ఏమౌతారు? అనినది.

పు:—మేం మిరువురమూనా! చెపుతా విను. ఆ మనిషి అటునుండి, నేను ఇటునుండి ఇక్కడకు వస్తే దగ్గరవుతాము. తిరిగీ ఇక్కడనుండి నే నిటూ, ఆ మనిషి అటూ వెళ్లితే దూరమవుతాము. ఆమనిషి అటునుండి ఆ సందు తిరిగితే, నేను ఇటునుండి ఈ సందు తిరిగితే మరుగౌతాము. తెలిసిందా!

పాకనాటి శ్రీ లక్ష్మీకామేశ్వరి

భర్త:—మొన్న హెయిరాయిల్ తెచ్చినప్పటి నుంచీ నీతలకి చాలా అందంవచ్చింది. నేను చెప్పినట్టుగా వాడుతున్నావనుకుంటా!

భార్య:—అవునండీ: బుడ్డిమూతతీస్తే సువాసన పోతుందన్నారని సీలుకూడా విప్పకుండా భద్రంగా పెట్లో పెట్టి వుంచాను. నిజంగా ఇప్పుడు నాతల వెంట్రుకలు నిగనిగా మెరుస్తూ మెత్తగా ఎంతో బాగావున్నాయి సుమండీ!

లాయి రత్నమాల

# గ్రంథపరిచయము

## శ్రీ ధర్మమూర్తి, శ్రీ కృష్ణమూర్తి, శ్రీరామమూర్తి:—

ఈ మూడు గ్రంథములకును రచయిత మైలాపూరు పి. యస్. హైస్కూలులో సీనియరు తెలుగు పండితులుగా నున్న గరిమెళ్ల సత్యగోదావరి శర్మగారు. క్రౌనుసైజున మొదటిది 66 పుటలు, రెండవది 72 పుటలు, మూడవది 64 పుటలు. హిందువులకు ప్రధానేతిహాసములై, నీతిబోధకములై, మోక్షసాధకములైన భారత భాగవత రామాయణములలోని సారమెల్లయు నీ గ్రంథములోనున్నది. కథలు ప్రతి హిందూబాలుడును బాలికయును అవశ్యముగ తెలియంగవలసినవి గనుక గ్రంథకర్త ఇతిహాసములలోని భాగములను దేనిని గాని విడచిపెట్టక సూక్ష్మీకరించి హారముపోలిక సందర్భానుసారముగ గ్రుచ్చి లిఖించినారు. వీనిని పఠించినవారికి ప్రధాన గ్రంథములను చదువవట్టికొ అంత యేమియునుండదు సరేగదా, వీనిని పఠించుటవలన బాలురకు పెద్దవారయిన తరువాత ప్రధానగ్రంథములను పఠించవలెనను కుతూహలముకూడ మెండగును. శైలి సాధారణవాచక పుస్తకముల శైలికంటె కఠినముకాదు. గూఢపదము లెచ్చటను లేవు. నిర్దుష్టవ్యాసలేఖనములో తరచు గానవచ్చు సాధారణ సంస్కృతపదములు, అచ్చ తెలుగుపదములు వాని రూపరూపాంతరములతో గ్రంథములలో నెల్ల గానవచ్చి శైలి కొక మార్దవమును ధారను గూర్చుచుండును. అపరూప వ్యాకరణ మాత్ర ప్రయోగములు అపరూపము. నాలు గైదు ఆరవతరగతుల విద్యార్థు లిట్టి గ్రంథములను పఠించినచో వారి విషయజ్ఞానము, పదపరిచయము, రచనాశక్తి హెచ్చి ఇతోధికోన్నత గ్రంథముల నవగాహము చేసుకొనుటకు మిక్కిలి సమర్థులగుదురు. గ్రంథకర్త విద్వాంసుడు, కవియు, అధ్యాపకుడునుగూడ అగుటచేత వ్రాయవలసిన విషయములను ఎంచుకొనుటయందు, ప్రదర్శించుటయందు, చెప్పిన శయ్యయందుగూడ మిక్కిలి నైపుణ్యమును చూపినారని చెప్పవలెను. విద్యాశాఖాధికారులును, దానికి సంబంధించిన యితర యజమానులును వీనిని పాఠ్యగ్రంథములుగ తీసుకొని ఆయా తరగతుల విద్యార్థులకు వీనివలన సంపూర్ణ ప్రయోజనము కలుగునట్లు చేయుదురు గాక యని కోరుచున్నాము. మైలాపూరులోనున్న అంబికా బ్రదర్సువారు వీనిని ప్రకటించినారు. వెలలు క్రమముగా 4, 5, 4 అణాలు.

## ఆత్మత్యాగి:—

అనువాదకులు కూచిభొట్ల ప్రభాకర శాస్త్రి గారు. క్రౌనుసైజు 32 పుటలు. వెల రు 0-5-0లు. స్వర్గీయ జతీంద్రనాథుని జీవితము. అతని దేశభక్తి, కారాగారప్రాప్తి, నిరశనవ్రతము, మరణము, దేశీయులతని కళేబరమునకు చేసిన గౌరవాదులు స్వచ్ఛమగు శైలిలో వర్ణింపబడినవి. తెనాలి, కొమ్మూరి కాశీవిశ్వనాథము గారు ప్రకాశకులు.

## భారత విదుషీరత్నములు:—

గ్రంథకర్త కొండాలి లక్ష్మీనారాయణగారు, అసిస్టెంటు జి. సి. హైస్కూలు తురుమెళ్ల. తెనాలి దగ్గర మోపర్రులోనున్న విదుషీ సాహితీ సమితివారిచే ప్రకటితము. వెల రు 0-4-0లు. గార్గి, మైత్రేయి, లీలావతి, మీరాబాయి, మొల్ల, వెంకమాంబ మొదలగు 15 గురు చరిత్రలు క్రౌనుసైజు 64 పుటలలో క్లుప్తముగ నిముడించి వ్రాయబడినవి. నవలా జనంబున కవశ్యపఠనీయంబు. పెక్కు గ్రంథములను చదివి సూక్ష్మముగ వ్రాయబడినది. ఇది మొదటి భాగము. త్వరలో రెండవ భాగమునుగూడ ప్రకటించి గ్రంథకర్తగారు నారీలోకంబు నజ్ఞాననిద్ర నుండి మేల్కొల్పవలెనని కోరుచున్నాము.

జీవనపథము:—

1926వ సంవత్సరములో సర్. డాక్టరు యస్. రాధాకృష్ణన్ ఎమ్. ఎ. గారు మాంచెస్టరు నగరము నందు హైందవ నాగరికతనుగూర్చి యిచ్చిన యుపన్యాసములను కామరాజు హనుమంతరావు గారు ఆంధ్రములోనికి చక్కగా అనువదించిరి. ఈశ్వరానుభవము, మతముల సంఘర్షణము, హిందూ ధర్మము రెండు భాగములు మొత్తము నాలుగు ఉపన్యాసము లిందున్నవి. క్రౌనుసైజు 216 పుటలు. ప్రాక్ప్రతీచీ గ్రంథమాల ద్వితీయకుసుమము. హిందువుల ఆచారవ్యవహారధర్మములు, వారి జీవితపరమావధి మొదలగు ఉత్తమవిషయములనుగూర్చి ప్రబల పరిశోధనముచేసి పాశ్చాత్యులకుగూడ వాటి ప్రాశస్త్యము నచ్చునట్లు రాధాకృష్ణన్ గా రుపన్యసించి నారు. ప్రాచీనాచారములు శృంఖలములుగా కావనియు, తదనువర్తులెల్లరు దానులును పిరికిపందలును కారనియు, నవీనవ్యక్తిస్వాతంత్ర్యవాదుల చర్యలెల్లయు సమర్థనీయములు కావనియు, మానవుని మోహమునకు దౌర్బల్యమునకు నైతికగౌరవము నిచ్చుట కిప్పుడు ప్రయత్నించుచున్నారనియు అతని యుపన్యాసములవలన తెలియవగును. వర్ణాశ్రమ ధర్మములయొక్క ఆవశ్యకత ఆర్థికదురాశలనుండి వైముఖ్యము, విద్యావినయ వివేకపరులయందు గౌరవము, దీన నిమ్నజాతులయం దాదరము, ముముక్షుమార్గాసక్తి, యివియెల్లయు చేరి హిందూజీవనపథమగుచున్నవని యీ గ్రంథపాఠకులు గ్రహింపగలరు. హిందువులెల్లరు ఇట్టి గ్రంథములను పఠించి సత్యమగు జీవితాదర్శమును గ్రహించి, తదనుసరముగ వర్తించి తమ దేశముయొక్క గౌరవమును రక్షింప ప్రయత్నింతురుగాక. అనువాద మెంత సత్యమై, తెల్లమై స్వచ్ఛమై యున్నదో తెల్పుటకు ఈ గ్రంథమును గూర్చి శ్రీ రాధాకృష్ణనుగా రిచ్చిన అభిప్రాయమే సాక్షి. ఈ గ్రంథమును తర్జుమా చేసి హనుమంతరావుగారు ఆంధ్రుల కెల్లరకు అమితతమగు సేవచేసినా రనుటకు సందేహములేదు. వెల రూ. 1-4-0లు మాత్రమే. వలయువారు రాజమహేంద్రవరమునుండి యీ గ్రంథమాలను ప్రకటించుచున్న హనుమంతరావుగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

కల్లు సారాయి కథలు

గ్రంథకర్త కె. జె. జె. సుందరు, డోర్నకల్లు. క్రౌనుసైజు 27 పుటలు. వెల రు. 0-2-0లు. కల్లు మొదలగు మద్యములు సిరిని, ఆరోగ్యమును, బుద్ధిని, దేహమును ఎట్లు చెడగొట్టునో మనోనిశ్చయము ద్వారా వీనిని విసర్జించినచో సంసారము లెట్లు బాగుపడునో తెలుపు 12 చిన్నకథ లిందు గలవు. బాలురకు విద్యాసురక్తి లేని పెద్దవారికి ఇట్టి కథలు వినుట కెంతో మనోహరముగ రీతినున్నవి. మూడు పిల్లులు, అలవాటు రామన్న, బుద్ధిగల మేక మొదలగు కథలు మంచి వివేకమునుగూర్చును. డోర్నకల్లు మద్యపానవిషేధ సంఘమువారిచే ప్రకటితము. రెవరెండు జి. డేనియల్ (కళాసపాడు బాద్వేలు కడపజిల్లా) గారివద్ద ప్రతులు వెలకు లభించును.

వీరకరవాలము:—

క్రౌనుసైజు 142 పుటలు. గ్రంథకర్త వై రెడ్డి రంగారెడ్డిగారు. వెల రు. 0-8-0 లు. వీరరస ప్రధానమగు చిన్న నవల. మాయూరధ్వజుడు, రణమల్లు ఆదర్శకవీరులు. మొదటివాని రాజభక్తియు రెండవవాని దేశభక్తియు అద్వితీయములు. శీలవతి త్యాగము నిరుపమానము. యువకు లెల్లరకు నవశ్య పఠనీయము. గ్రంథములు ప్రొద్దుటూరు జనోపకారిణీ స్టోర్సునందు లభించును.

బందిగములున్న వే దేశభక్తులకును:—

క్రౌనుసైజు 29 పుటల గీతమాలిక. గ్రంథకర్త జె. సుబ్బయ్యగారు. వెల రు. 0-4-0లు. దేశభక్త సోదరులు కారాగారములో పడు ఇడుములు, అహింసాధర్మ విజయము ఇందలి విషయము. ఆంగ్లకవి బైరను వ్రాసిన చిల్లి యను ఖైదీ యను కావ్యము దీనికి మూలము. వివిధ కవీంద్రుల ప్రశంసలు గాం

చినది. ప్రతులు ప్రొద్దుటూరు భవానీ గ్రంథమాల వారివద్ద లభించును..

### ధనంజయ విజయము:—

డెమ్మీ సైజు 84 పుటలు. గ్రంథకర్త బాలకవి వేమూరు సుందరరామశర్మగారు. పంచమవేదాంతర్గత సైంధవవధ ఇందలి విషయము. అభిమన్యుపరాక్రమ ఘట్టమతి రమణీయము. అయిదంకముల మనోహర నాటకము. శైలిమృదుమధురము.

### సత్కథాసారము:—

క్రౌనుసైజున 88 పుటలు, గ్రంథకర్త శ్రీయుత ఆదిపూడి సోమనాథరావుగారు. భగవత్కథాసారము, భారతకథాసారము, శ్రీహనుమత్కథాసారము, శ్రీరామకథాసారము, శ్రీకృష్ణకథాసారము, అను అయిదుభాగములు. ఒకొక్కభాగము 25 తే. గీ. పద్యములు. సుందరభావములు, మధురశైలి, పదాదర్శములతో శోభిల్లుచున్నది. ప్రతులు 1/40 మైలాపూరు బజారురోడ్డునవున్న గ్రంథకర్తగారివద్ద లభించును.

### లక్ష్మీశారదా సుభాషితము:—

క్రౌనుసైజు 80 పుటలు. వెల రు 0-8.0 లు. ఇది నూజవీడు లక్ష్మీశారదాగ్రంథమాలవారి తృతీయ పుష్పము. కొల్లాపురమువందు స్నేహలతా కవితా సంఘమువారిచే ప్రకటితము. లక్ష్మీశారదలనాబరగు శ్రీమతులు గిడుగు లక్ష్మీకాంతమ్మ, జొన్నలగడ్డ శారదాంబగార్లు దీనిని రచించిన కవయిత్రులు—సటీకాతాత్పర్యము. లోకోక్తులగు ఉపమానములతో కూడినవీతులు గల 200 పద్యము లిందుగలవు. ప్రతి నీతిని ఒకఉపమానముతో లక్ష్మీకాంత వచించిన వేరొకయుపమానముతో శారదాసతి సమర్థించును. లక్ష్మీకాంత శారదాసతికిని శారదాసతి లక్ష్మీకాంత కును విదుషీమణుల జ్ఞానాభివృద్ధికొర కీనీతులను చెప్పుచుండురు. ఉపమానములు కొన్ని ప్రకృతి గత ములు, కొన్ని పురాణసంగ్రథితములు, మరికొన్ని అనుభవసంగ్రథితములు, శైలి మనోజ్ఞము. ధార ధారాళము, పదములును ప్రయోగములును పరిశుద్ధ గ్రాంథికములు, అంగనామణుల కెల్లరికి పఠనీయములు. ఇంటింటను అలరార తగినదియును ప్రతి పాఠశాలయందును ఉన్నతమధ్యమ తరగతి విద్యార్థినుల నిమిత్తము నియమింపఁ దగినదియునై యున్నది. ఈరకము గ్రంథ మిది యొక్కటియే యున్నదనుట అతిశయోక్తిగాదు. భాస్కరశతక మును మరపించుచుండును. ఇట్టి గ్రంథములను రచించి నారీలోకమున కాదర్శ ప్రాయులగుచున్నందుకు కవ యిత్రీద్వయమును మాహృదయపూర్వకముగ నెంతయు అభినందించుచున్నాము.

### నిర్వచనభారతగర్భ రామాయణము:—

డెమ్మీసైజు 66 పుటల పద్యకావ్యము. వెల రు 0-8-0 లు మాత్రము. గ్రంథకర్త శ్రీయుత రావిపాటి లక్ష్మీనారాయణగారు. ఈగ్రంథమునఁగల 126 పద్యములలో మరి 126 పద్యములు గర్భిత ములై యిమిడియున్నవి. అసలు పద్యములు రామా యణార్థమును గర్భపద్యములు భారతార్థమును తెలుపును. ఇది యొంతమాత్రమును ద్వ్యర్థకావ్యము కాదు కాని రచించుట కంతకంటెను గూఢ కష్టతర మగు ద్వ్యంద్వకావ్యము. పూర్వమిట్టిపద్యములు ప్రబంధములలో నచ్చటచ్చట మచ్చుకు వ్రాసెడి వారు. ఇట్టి దొకకావ్యము అందునను నిర్వచనద్వంద్వ కావ్యము వ్రాయుట కవిగారి అసమాన ప్రజ్ఞను ఓపికను చాటుచున్నది. సుప్రసిద్ధ కవిశిఖామణుల యొక్కయు శతావధానులయొక్కయు ప్రశంస బడసినది. ప్రతులు వలయువారు గుంటూరుజిల్లా గురజాలలో నుండు కవిగారిపేర వ్రాసిన బడయ గలరు.

### తర్కసంగ్రహము:—

క్రౌనుసైజు 92 పుటలు వెల రు1-0-0 శ్రీమదన్నం భట్ట పండితకృత గ్రంథమునకు డాక్టరు ములుగు విశ్వేశ్వరశాస్త్రి యల్. ఐ. యం., హెచ్. పి. ఐ. యమ్‌గారు రచించిన ఆంధ్రతాత్పర్యయుక్తము.

చరకమకదీపికాఖ్యాయుర్వేదమతవివరణసహితము. మనలో నేటిపలాంగ్లవిద్యాధికులకు ఇంగ్లీషులో వుండే లాజిక్కు తెలుసును కాని సంస్కృతములో ఉండే హిందూదేశీయమైన తర్కశాస్త్రమంటే యేమిటో తెలియదు. దీనికి కారణము అది మన పాఠశాలలలో చెప్పకుండుటయు, మన ఆంధ్ర భాషలోని కనువదింపబడకుండుటయునై యున్నది. తర్కశాస్త్రము సంశయవిచ్ఛేదము సత్యనిరూపణ ములకొరకు వెలసినది. ఆశాస్త్రమెంత పరిపక్వమైన సత్యమంత పరిశుద్ధమైనదగును. దీనిని పఠించినవారికి ప్రాచ్యపాశ్చాత్యశాస్త్రవిధానముల భేదము, ప్రాచీనుల అశేషశేముషీప్రతిభ అనుపమానసత్వ సక్తి గోచరించకమానదు. శాస్త్రమింత పెద్దదైనను కొంచెము సూత్రములలోను 1 పటములోను నిమిడి జ్ఞాపకముంచుకొనుటకు సాధ్యము చేయఁబడినది. ఈగ్రంథమునం దిసూత్రములు సతాత్పర్యముగనున్నవి. పటముగూడఁగలదు. తెనాలిలోనున్న ఇండియను మెడికల్ స్టోర్సువారివల్ల ప్రకటించబడినది. పండిత యస్. రామలింగయ్యగారు ప్రకాశకులు.

లోకలుబోర్డు:—

ఇదియొక మాసపత్రిక. ఇప్పటికప్పుడే ఒకసంపుటము పూర్తియై రెండవసంపుటపు 1 వ సంచిక మే మాసములో ప్రకటింపబడినది. రాజ్యాంగపద్ధతిని గూర్చి కొన్నివ్యాసములిందు క్రమముగా ప్రకటింపఁబడెను. మొదటివ్యాసము మేసంచికయం దున్నది. గ్రామసాంఘికీయుపాయములు, కోలగారములను గూర్చి రెండు చక్కనివ్యాసములున్నవి. ఇవి కాక స్టాండింగు ఆర్డరులు సర్క్యులరుల తర్జుమాలును, సహకారనిబంధనల తర్జుమాలును గూడ గలవు. చందా సం 1 కి రు 2-0-0 లు. తూర్పుగోదావరిజిల్లా కపిలేశ్వరపురమునుండి ప్రకటింపఁబడుచున్నది.

అగ్నికులప్రబోధిని:—

అగ్నికుల క్షత్రియ మహాసంఘముతరపున బందరు రామానాయుడు పేటనుంచి పెదసింగు వెంకటనారాయణగారిని సంపాదకత్వమున ప్రకటింపఁబడుచున్న మాసపత్రిక. జూనుమాససంచిక సంపాదకీయము నందు బ్రాహ్మణ ప్రాబల్యమును నిర్మూలించుటకు బ్రాహ్మణేతరోద్యమము కొంత కృషి చేసినను, సెట్టి, కుమ్మరి, రొయికలి మొదలగు స్వల్పజాతులకు చేయూతనియ్యక ప్రత్యేక కులసాంఘికతత్వములను వైషమ్యములను పెంచుచున్నందుకు పత్రికాధిపతులు చింతించుచున్నారు. జస్టిసుపార్టీ సరియైన క్రమమున పునర్నిర్మింపబడే నేని యీ యన్యాయము తొలగునని వారి ఆశయము. వివిధవార్తలు వ్యాసములు, సభల నివేదికలు మొదలగు వానితో పత్రిక మంచి ప్రబోధవంతముగనున్నది. చందా సం 1 కి రు 2-0-0.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు కళాశాల తెనుగుసంఘము:—

ఇదియొక త్రైమాసపత్రిక. శ్రీయుత పింగళి లక్ష్మీకాంతకవిగారు సంపాదకులు—కళాశాలపరిశోధక విద్యార్థులు వ్రాయు ఉత్తమసాహిత్య విమర్శ వ్యాసములతో మిగుల గంభీరమై పండిత జనపఠనీయమై యుండును. మార్చిమాసపు సంచిక యందు శ్రీనాథుని కళాకౌశలము, వేమనకవీంద్రుడు, నాటకవిమర్శనము, దశకుమారచరిత్ర కాలనిర్ణయము మొదలగు విషయములు చర్చింపబడినవి.

ఆంధ్రభూమి:—

ఇదియొక సచిత్రమాసపత్రిక. సంపాదకులు శ్రీయుత ఆంధ్ర శేషగిరిరావుగారు, బి.ఏ., మదరాసు, వేపేరి ఆంధ్రభూమి ముద్రణాలయమునుండి మేమాస ములగాయితు వెలువడుచున్నది. ఆంధ్రజనాభివృద్ధి కనుగుణములగు ప్రధానసమస్యలు కొన్నిటిని ఇది విమర్శగ చర్చింపఁ బూనికొనినట్లు మేసంచికను పఠించినవారికి విశదముకాగలదు. భారతి, గృహలక్ష్మి మొదలగు పత్రికలవలె ఇదికూడ ఆధునిక కవికుమారులు వ్రాయునాటికలు చిన్నకథలు పద్యములు మొదలగువానితో సమ్మిళితమై కళలు గ్రక్కుచున్నది. సంవత్సర చందా రు 3-0-0లు. రసజ్ఞులగు ఆంధ్రులీ పత్రికాకిశోరమునకు తగిన చేయూత నొసగి చిరంజీవిని చేయుదురుగాక!

# సంపాదకీయములు

## జీవద్దవతము

8-6-22 తేదీని గుంటూరు జిల్లా మంతెనవారిపాలెము గ్రామములో నూతనముగ కట్టబడిన శ్రీ గాంధివిజయవిలాస మను పురమందిరము సాయంకాల మూరుగంటల వేళను శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిచే తెరువబడెను. పిమ్మట తత్ప్రాంగణమున సుమా రిరువది గజముల పొడవుగల సీమెంటు స్తంభమును జనులెల్లరు మోతులతోను కేకలతోను జయజయ ధ్వానములు చెలరేగ పైకెత్తి నిలబెట్టి దానికి ప్రాణప్రతిష్ఠాపనము చేసిరి. తరువాత మహాత్ముని సీమెంటు విగ్రహము సత్యోత్సాహ సంరంభములతో నా స్తంభము మీదికెత్తి వేదోక్తమంత్రములతో రాత్రి రెండు గంటల సమయమున ప్రాణప్రతిష్ఠ చేసిరి. ఈ సత్కర్మ కధ్వర్యులు దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు. పేరెన్నికగన్న దేశసేవకపుంగవులు, భక్తులుగాను ప్రేక్షకులుగాను వచ్చి దర్శించిరి. పత్రఫలపుష్పాదులు విగ్రహమున కర్పింపబడినవి. మహాత్ముని నిత్యజీవితము ఆధునిక లౌకిక పౌరజీవితమున కాదర్శమైనదనుటకు సందేహములేదు. అతని సత్యదీక్ష, నీతిపరాయణత, అకుంఠితవిశ్వాసము, నిష్కామకర్మాచరణము మొదలగు సుగుణములు అనన్యసామాన్యములు. ఈకాలపు లౌకిక జీవనములో అట్టి ఆశయములు కలిగియుండుటయు తదనుగుణముగ వర్తించుటయు దుస్సాధ్యమని చెప్పవలెను. నిరుత్సాహయుతులు పరిహాసరతులు, వ్యతిరేకతత్వశీలురు హోరాహోరున నట్టి సంకల్పములను తెగడి భంగము కలిగించుచుందురు. అట్టి తఱి నాత్మశక్తిని కుదుటబట్టి యుంచుకొనుట దైవికలక్షణము కాని మానవసాధ్యమగు పనికాదు. మహాత్ముని సెప్టెంబరు ఉపవాసమును మే మాసపు టుపవాసమును అతని ఆత్మవిజయమునకు నిదర్శనములనుట కాటంకములేదు. తద్విజయసూచకముగ ఈ స్తంభమును విగ్రహమును నెలకొల్పబడి ప్రతిష్ఠింపబడినవని శ్రీయుత వెంకటప్పయ్య పంతులుగారు తమ యధ్వర్యోపన్యాసమున నుడివిరి. కాని యీ స్తంభమును విగ్రహమును కేవలము విజయసూచక చిహ్నములకంటె నెక్కువ పవిత్రమై స్థిరమైన తత్వమును ప్రపంచమునకు చాటకమానవు. మహాత్ముని జీవితము సామాన్య మానవజీవితమువంటిదే యని భావించుట పాడిగాదు!!

"సామాన్యుడనుకోకు మతని— దైవ
సంకల్పమురా వానిజనన మీయవని॥
వినురా నా ప్రియసహోదరుడా"

యని జానపదునిపదము. దైవమనునది అననుగోచర ఆత్మైకానుభవసాధ్యతత్వమాత్రమేయైనను అపూర్వగుణ శక్తులతో శోభిల్లి మానవశరీరమును దాల్చి భూమిపై నవతరించి ధర్మసంరక్షణమార్గమును ప్రజాసముద్ధరణోపాయమును చూపి లోకమును తరింపఁజేయుచుండక మానదని గీతావాక్యము, హిందూమతవిశ్వాసము. ఇట్టియెడ మహాత్ముడు దైవమనుట కేమి యాటంకము గలదు? మనలో కొందరికి నమ్మకము కుదరకపోవుటకా, సమకాలికుని మహత్వము నెవ్వ రెప్పుడు గుర్తించిరి? హిందూదేశములో నేడు దైవతములై విగ్రహములై వెలసి పూజాపురస్కారము లందుచున్న వ్యక్తులన్నియుగూడ తమ జీవితములోకంటె తదనంతర ముత్తరోత్తర గౌరవములంది దేశమంతట దేవాలయములు కట్టించుకొనినవారే. ఇట్టి గౌరవము మహాత్మునికి తమ జీవితకాలములోనే లభించుట అతని నిర్వక్రప్రజ్ఞకు నిదర్శనము. అతను దైవమేయైనచో అతని సంకల్పములన్నియు నీడేరి లోకము సంస్కరింపబడినదా యని కొందరు అడుగవచ్చును. లోకమట్లు సంస్కరింపబడనిచో అది లోకముయొక్క ప్రారబ్ధవిశేషముగాని యతనిలోని లేశము కాదు. ముందు ముందు గ్రామగ్రామమునను అతని విగ్రహములు, దేవాలయములు, పూజలు, నమస్కారములు, మొక్కుబడులు మొదలగునవి హిందూదేశములో సర్వసామాన్యములు కాగలవు. అందు ప్రథమస్థానము మంతెనవారిపాలెమునకు లభించుట ఆ గ్రామస్థుల పుణ్యమనవలెను. మరియు ఈ దైవము తక్కిన ముప్పదిమూడుకోట్ల దేవులవలె సచ్ఛీలము, భక్తి, ముక్తి యొసగి భక్తుల కోరికల నీడేర్చుటమాత్రమే కాక తద్భక్తులను దేశభక్తవీరులుగను, అహింసాచరణులుగను, ప్రజాసేవాపరాయణులుగను, లోకకళ్యాణకారులుగను నొనర్చ ననుటకు సందేహములేదు. ఇట్టి మహాత్కార్యమునకు దేశోద్ధారక దేశభక్తుల వంటివారు ప్రథమాధ్వర్యులుగనుండుటయు, పురమందిరప్రాంగణమున నీ ప్రతిష్ఠాపనలు జరుగుటయే మా అభిప్రాయము సత్యమైనదనుటకు ప్రబలతరతార్కాణము.

### స్త్రీల కోరికలు

లండనులో ఈస్టిండియా సంఘమువారి యెదుట శ్రీమతి బీగమ్‌షా నవాజుగారు ఉపన్యసించుచు శ్వేతపత్రసూచనల ప్రకారమున్న స్త్రీ వోటరుల సంఖ్య చాల తక్కువనియు, రాష్ట్రీయశాసన స్త్రీ వోటర్లు కనీసము లోథియను కమిటీవారు సూచించినంతమందియైన నుండవలెననియు, ఫెడరలు సభ వోటర్ల సంఖ్యకూడ హెచ్చించవలెననియు చెప్పిరి. శ్రీమతి రామారావు సతిగారు స్త్రీలు తొలినుండియు సాంఘిక ప్రాతినిధ్య సిద్ధాంతమునకు ప్రతికూలురని చెప్పిరి. శ్రీమతి రాజకుమారీ అమృతకేరు గారు స్త్రీలకు తగిన ప్రాతినిధ్యములేనిదే కావలసిన సాంఘిక సంస్కరణములుగాని

విద్యాసంస్కరణములు కాని జరుగనేరవని సెలవిచ్చిరి. అఖిలభారత స్త్రీసంఘపు మూడు ప్రధాన సంస్థల తీర్మానములను వీరు మువ్వురును బలపరచిరి.

మఱియొక సందర్భమున శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు చెప్పినట్లు పురుషులు బానిసలై యున్న దేశములో స్త్రీలు స్వతంత్రులు కాగలుగుదుమని వాంఛించుట యెండమావిలోని జలమున కాశించుటవంటిదేయైనను, దేశీయపురుష ప్రతినిధుల కోరికలను ప్రభుత్వమువారు నిరాకరించినను స్త్రీల కోరికలనైన నీడేర్చినచో సంతోషింపని పురుషు లీ దేశమున లేరు. ఎవరెన్ని యాడికలనాడిపోసినను హిందూదేశమునందు స్త్రీలయెడలనున్న గౌరవమును మాతృభావమును దేవతాభావమును విదేశములలో నరుదు. పాశ్చాత్యదేశపు స్త్రీలయెడలకంటె హిందూదేశములో స్త్రీలయెడల కొన్ని నిర్బంధము లెక్కువగనున్నను, అవ్వికూడ వారియెడలగల గౌరవవిశేషమువల్లనే విధించబడినవని సనాతనులుకూడ అందురే కాని స్త్రీలు హీనులని కాని వారి జీవనమును హేయము చేయుదమను తలంపుతో ఆ నిర్బంధములు విధించబడినవని కాని వా రంగీకరించరు. 'కలకంఠకంఠి కన్నీరొలికిన సిరి యింటనుండ నొల్ల'దని యిప్పటికిని ప్రాజ్ఞులైనవా రెల్లరు నిచ్చట వారి యడుగులకు మడుగులొత్తుచు అతినున్నితముగ మెలగుచున్నారు. ఇట్టియెడల ప్రభుత్వమువారు కూడ వారియెడల నట్టిభావమునే చూపి వారి వోటర్ల సంఖ్యను హెచ్చించి, సమిష్టి ప్రాతినిధ్యమునిచ్చి సంస్కార మార్గములు సాధ్యమగునట్లు చేయుదురు గాకయని కోరుచున్నాము.

**చదువులా—సంసారములా?—**

హిందూదేశములో స్త్రీవిద్యయొక్క ఆవశ్యకతనుగూర్చి చర్చించు దినములు గతించినవి. దేశమంతటను బాలికాపాఠశాలలు, యువతీవిద్యాలయములు, వేసంగి సంగీతతరగతులు, హిందీశిక్షణములు ప్రభుత్వమువారివల్లను, స్థానికసంస్థలవారివల్లను, అనధికారలోకహితసంస్థలవల్లను జరుపఁబడుచున్నవి. సుప్రసిద్ధకవయిత్రులు, వ్యాసలేఖకలు, ఉపన్యాసకర్త్రులు ఆంధ్రదేశమునఁగూడ వెలయుచున్నారని ఋజువుపరచుటకు మాగృలక్ష్మి వ్యాసాదికములే సాక్ష్యము. ఇదిగాక స్త్రీలు బహిరంగసభలలో ఉపన్యసించుచున్నారు. స్థానికసంస్థలయందును శాసనసభలయందును పాల్గొనుచున్నారు. నాటకరంగమున రాణించుచున్నారు. త్యాగముచేసి వెనుకొంకక జైళ్ళయందు ప్రవేశించుచున్నారు. ఉన్నతోద్యోగములు పురుషులతో తుల్యముగ నిర్వహించుచున్నారు. స్వతంత్ర భారతదేశములో వీరింతకంటె వేయిరెట్లెక్కువ ప్రతిభతో విరాజిల్లగల రనుట కావంతయు సందేహము లేదు.

అయినను స్త్రీల కెట్టి విద్యయొసంగవలెననువిషయమున నింకను తర్కోపతర్కములగుచున్నవి. గృహసామ్రాజ్యమునకు స్త్రీ చక్రవర్తిని యనుట కామె కొసంగబడినఁ గృహిణీ బిరుదమే సాక్ష్యము. క్రిందు మీదుబడినను పురుషు డీసామ్రాజ్యమును

నిర్వహింప గలుగుట దుస్సాధ్యము. పైకి పోయి పెద్దయుద్యోగములను నిర్వహించు వనితలైనను ఇంటికివచ్చి తద్వ్యవహారములను తామే చక్కదిద్దుకొనవలెను కాని పురుషుని పాలబెట్టినచో ఆసంసారము లరాచకములై అసౌఖ్యమున కాలకాలములు కాకమానవు. కనుక స్త్రీలకు ఉన్నత విద్యకంటె గృహనిర్వహణ విద్యయే యెక్కువ ఆవశ్యకమని అనేక స్త్రీవిద్యాభిమానుల ఆశయము. ఎట్టి విద్య స్త్రీల కొసంగఁబడవలెనను విషయమునుగూర్చి స్త్రీవిద్యాసంఘమువారే నిస్సందేహముగ తమ అభిప్రాయమును వెలిబుచ్చియున్నారు. గృహనిర్వహణవిద్యయను నెపమున తమ కేకొంచె మక్షరజ్ఞానమునో సాహిత్యజ్ఞానమునో మప్పి, కుట్టుపని, వంట, చిత్రకారితనము మొదలగుపనులతో నాలుగుగోడల మధ్యను కాలక్షేపము చేయుటకై త్రోసివేయబడుటకు వారంగీకరించరు. తక్కిన అన్నివిషయముల యందువలె విద్యావిషయమునఁగూడ తమకు పురుషులతోపాటు సమానత్వముండి తీరవలెననియు, సమస్తవిధములగు విద్యలు తమకుకూడ గఱపఁబడవలెననియు, పురుషులతోపాటు సమస్త ఉద్యోగములయందును తమకుఁగూడ స్థానముండి తీరవలయుననియు వారు తీర్మానించి ఆందోళనము చేయుచున్నారు. ఇందు విపరీతమేమియును లేదు. విద్యాధికురాండ్రైన స్త్రీలు గృహనిర్వహణమున కెందుకును పనికిరాకున్నారని యనేకులు దృష్టాంతరములెత్తి చూపించుచున్నారు. ఇది విద్యావిధానలోపము కాని ఉన్నతవిద్య యొక్కలోపము కాదని మనము గుర్తించవలెను. ఆధునికోన్నత విద్యావతులగు యువతులు కొందరు విద్యాగర్వదూషితలై గృహాలక్ష్యములేక పైపైత్తనముపయందే యెక్కువ ఆసక్తిని జూపించుచు విలాసలోలలై తిరుగుచున్నారని కొందరందురు. ఇది కొంతవరకు విదేశాచారానుకరణఫలము కాని విద్యాఫలము కాదని మనము గుర్తించుటలెస్స. మనదేశ సంప్రదాయానుసారము వారి కున్నతవిద్య నేర్పి ఉన్నతోద్యోగమున కవకాశమొసగినచో ఇట్టి దోసగు లెన్నగా తొలగిపోవునని మావిశ్వాసము. భారతదేశము, దాసి ప్రతిభాగారముఁలు మొదలగునవి వారి కొసగఁబడుచుండు శాస్త్రీయజ్ఞానమంతటితో బాటుచేర్చి చెప్పుచున్నచో వారు సత్పౌరులును సద్గృహిణులును గూడ కాగల్గుదురనుటకు సందేహములేదు. కేవల పాశ్చాత్య విద్యావిలాసితలలో గల యీషల్లోపముల నెత్తి గోరంతలు కొండంతలుగా ఉగ్గడించువారు అట్టి దోషములు స్త్రీలలో కంటె అట్టి పురుషులలోనే యెక్కువగా గలవను సంగతిని మఱువరాదు. సవ్యముగు జాతీయ విద్యావిధానమొక్కటియే స్త్రీపురుషులలోఁగల యిట్టి లోపములను తొలగించునుగాని ఉన్నత విద్యానిరోధ మెంతమాత్రమును అట్టి లేశములను తొలిగించఁజాలదని దేశీయులను మేము హెచ్చరించుచున్నాము. ఇట్టి జాతీయవిద్యావిధానమును మన మవలంబించితిమేని స్త్రీలు సంసారము కొరకు చదువుకాని చదువుకొరకు సంసారమును కాని విసర్జించ నక్కరలేకుండ రెంటను చక్కగ నిర్వహించఁగలరని మనము రూఢిగ నమ్మవలెను.